# సంపూర్ణ కుటుంబానికి పరిపూర్ణ స్నానానుభూతి.




ఔషధీకృత సున్నిపిండి రూపంలోవచ్చే అశ్విని హెర్బల్ బాత్ పౌడర్, మీకు పరిపూర్ణ స్నానానుభూతినిస్తుంది.

ప్రకృతి సిద్ధమైన మూలికల ప్రయోజనాలను మీకందిస్తూ ముచ్చటైన రీతిలో నేరుగా ఒంటిమీద చల్లుకొని రుద్దుకోగల విధంగా 'ఈజీ స్ప్రింకిల్ కంటైనర్'లో వస్తోంది అశ్విని హెర్బల్ బాత్ పౌడర్. దీనివల్ల -

- ★ శ్వేదరంధ్రాలు శుభ్రపడి, రక్తం స్వచ్ఛంగా ఉంటుంది.
- ★ శరీరంలోని సహజ నూనెల సమతౌల్యం నిలుస్తుంది. చర్మం కాంతులీనుతుంది.
- ★ శరీరాంగములకు స్థిరత్వము కలుగుతుంది.

వెల రూ. 9.50

# అశ్విని

ఔషధీకృత సున్నిపిండి

**అను నిత్యం మీ స్నానం ఆనందమయం, ఆరోగ్యదాయకం !!**

200 గ్రా. మరియు 500 గ్రా. 'రీఫిల్' ప్యాక్స్ కూడా లభ్యం

everest/H/0126/94

---

ఆయుర్వేద ఔషధము

అశ్విని గ్రూపు వారి మరో విశిష్ట ఉత్పాదన

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఫిబ్రవరి చతుర నవల పడగనీడ**

.....................................................

సమీక్షకుని పేరు : .....................................................

చిరునామా : .....................................................

.....................................................

.....................................................

.....................................................

# ఏరిన ముత్యాలు

☆ అసమానత నుంచి హింస, మానవతనుంచి అహింస పుడతాయి.

-గాంధీజీ

☆ ప్రతిఫలాన్ని కోరకుండా మీకు మంచికి సహాయపడే వ్యక్తి గొప్పవాడు.

-పండిట్ నెహ్రూ

☆ గొప్ప త్యాగాలవల్లనే గొప్ప కార్యాలు సాధించబడతాయి.

-వివేకానంద

☆ ఎవరైనా సరే సదా నేర్చుకుంటూ వుంటేనేగానీ సరిగా బోధించలేరు.

-రవీంద్రనాధ్ టాగూర్

☆ ద్వేషాన్ని ప్రేమాభిమానాలతో మాత్రమే చల్లబర్చగలము.

-సర్వేపల్లి రాధాకృష్ణన్

☆ అసూయ, అత్యాశ, ఆగ్రహాలను వదిలిన వాడే సజ్జనుడు.

-తిరుక్కురళ్

☆ సిద్ధాంతానికి, ఆచరణకూ గల సంబంధంలోనే ప్రగతి బీజం ఇమిడివుంది.

- హెడ్గేవార్

☆ మనం ఏదైనా కోల్పోవడానికి ఒక్కక్షణం చాలు.

-నెపోలియన్

☆ ఉపయోగపడని శాంతికంటే ఉపయోగకరమైన సంఘర్షణ మేలు.

-గోర్కీ

☆ చెడును ఉపేక్షించేవాడు మంచిని నిర్లక్ష్యం చేస్తున్నాడన్న మాట!

-టాల్‌స్టాయ్

☆ రోజువారీ ఆలోచనల మేలిమి రూపమే శాస్త్రం.

-ఐన్‌స్టీన్

☆ ఇతరుల నుంచి నీవు కోరుకునే మర్యాదనే ఇతరులకు అందజేయి.

-కన్ఫ్యూషియన్

☆ తత్త్వశాస్త్రమంటే సత్య పరిశీలనా శాస్త్రం.

-అరిస్టాటిల్

☆ తనను గూర్చి తనకే తెలియని వాడే నిజమైన అజ్ఞాని.

-సోక్రటీస్

☆ తాత్త్విక యోచనను మించిన ఉన్నత సంగీతం మరొకటిలేదు.

-ప్లేటో

☆ చిరుదీపిక వలెనే సత్కార్యం కూడా వెలుగును ప్రసరింపజేస్తుంది.

-షేక్స్పియర్

☆ మనస్సు, హృదయం నిశ్చలంగా ఉంటే ఉత్సాహం లభిస్తుంది.

-జిడ్డు కృష్ణమూర్తి

---

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్

# 'విలువలు'పై సమీక్షలు



డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన రాధాశివమోహన్ నవల 'విలువలు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## అపురూపమైన వ్యక్తిత్వపు 'విలువలు'

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

**అ**పురూప అంటూ పేరు పెట్టడంతోనే కథానాయిక ప్రత్యేకమైన వ్యక్తిత్వం తెలియచేసే ప్రయత్నం జరిగింది. నేటి సమాజంలో అంతరించిపోతున్న మానవత్వపు విలువల్నీ, రక్త సంబంధాన్నీ, కన్న తల్లిదండ్రుల మమకారాన్ని కూడా కాదనుకుని వెళ్ళగలిగే విదేశీమోజునూ చక్కగా చిత్రించారు. ఎలాగోలా పెళ్ళి చేసెయ్యాలనే ఆరాటంతో తల్లితండ్రులు కేవలం చదువు, ఉద్యోగం, కుటుంబ సాంప్రదాయాలు మాత్రమే చూసి ఆడపిల్లలకు పెళ్ళిచేసి తమవంతు బాధ్యత నెరవేర్చామనుకుంటూ, తరవాతి పరిణామాలకు బాధపడే పెద్దలకు

కవర్‌ఫొటో: వి. సత్యమూర్తి

ఈ కథ ఓ హెచ్చరిక లాంటిది. తన జీవితం మొగ్గలోనే నాశనం అయినా చెరిగిపోని ధైర్యంతో తన వాళ్ళకే కాక అత్తమామలకు సేవచేస్తూ తన నిండైన సంస్కారంతో ధైర్యం చెప్పిన అపురూప స్త్రీలకే ఓ ఆదర్శంగా నిలుస్తుంది. ఆత్మహత్యే అన్ని సమస్యలకు మార్గం అనుకునే నేటి ఆడపిల్లలందరూ నేర్చుకోవలసిన ఆత్మవిశ్వాసం, ఆత్మస్థైర్యం నిండుగా ఆ పాత్రలో దర్శనమిస్తాయి. మమకారాలు, ఉద్వేగాలు, మానవత్వపు లోతులు, దేశభక్తి స్వార్థపూరిత ఆలోచనలు కదంబంలా కలబోసిన తీరు అద్భుతం. ఓ సమస్య వచ్చినపుడు ఎలా తట్టుకొని నిలబడాలి అన్న సందేశం కరువవుతున్న నేటి రచనల్లో 'విలువలు' ఓ ఆణిముత్యం. ఎన్నో మధ్యతరగతి సమస్యలు, పరిష్కారాలు అలవోకగా చర్చించబడ్డాయి. ప్రతి ఒక్కరూ మాటలు మాత్రమే చెప్తున్న ఈ రోజుల్లో తమకు వీలయినంతలో ఏ విధంగా ఎదుటివారికి తోడ్పడవచ్చుననేది ప్రభాకర్ పాత్రలో సుస్పష్టం. ఎదుటి వారికి సహాయం చేయడానికి హృదయంలో జనించే ఆర్ద్రత, కరుణ ముఖ్యంగాని, డబ్బు, ఆర్భాటాలు కావని తెలియచెప్పారు. ఏది ఏమైనా హింస, దౌర్జన్యాలు, పగలు, సెక్స్, అవినీతి పనులు ఎంత తెలివిగా చేయచ్చో వివరించే కథాంశాలతో నిండిన నేటి రచనా ప్రపంచంతో విసిగిన పాఠకులకు దేశభక్తి ప్రేమ, మానవత్వపు ఆసరా వృద్ధాప్యంలో ఎంత అవసరమో తెలియచెప్పే ఈ చతుర కానుక 'విలువలు' నిజంగా విలువైందే.

**డా.జి. పద్మావతి,**
తిరుపతి.

## మానవతకు పట్టాభిషేకం

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

సిన్మాల్లాగే చాలా కథలూ పెళ్ళితో ముగుస్తాయి. వాస్తవంలో అసలు కథ పెళ్ళితోనే మొదలవుతుంది. పెళ్ళే జీవితం కాకపోయినా అది జీవితంలో అత్యంత ప్రధానమైన మలుపు. ఈసూత్రం న్యాయంగా ఆడకైనా, మగకైనా సమానంగా వర్తించాలి. అయితే మన సమాజంలో పెళ్ళి తర్వాత వచ్చే పరిణామాలు స్త్రీ జీవితాన్ని కట్టడిచేసినంతగా పురుషుడ్ని అదుపులో ఉంచలేకపోతున్నాయి. అతని అధికారాన్ని, అరాచకాన్ని నిలదీసి ప్రశ్నించలేకపోతున్నాయి. ఫలితంగానే ఎంత చదువుకున్నా, ఎంత సంపాదన ఉన్నా స్త్రీలు అధికశాతం అసంతృప్తిని, ఇబ్బందిని చిరునవ్వుల వెనుక, కనురెప్పల మాటునా బంధించి కాలం గడుపుతున్నారు. ఈ సూక్ష్మాన్ని గ్రహించిన రాధాశివమోహన్ తన నవల 'విలువలు' పెళ్ళితో ప్రారంభించారు. సున్నిత హృదయం సునిశిత పరిశీలనా దృష్టిగల 'అపురూప' దురదృష్టవశాత్తూ, కన్నవారిపైనే కనికరం లేని వాడికి ఇల్లాలైంది. వాస్తవాన్ని దాచి, తన జీవితాన్ని నట్టేట ముంచుతూ అమెరికాకి తుర్రుమన్న ఆ నయవంచకుడి ప్రతిరూపం కడుపులో కదలాడుతున్నా ఏవగించుకోలేదు, ఆ దుర్మార్గుడి తల్లిదండ్రులపట్ల వ్యతిరేకతనూ పెంచుకోలేదు. పైగా తన కన్నవారు వద్దని వారిస్తున్నా వినక ఏకాకులు, వయోవృద్ధులైన అత్తమామలపట్ల మానవత్వంతో వ్యవహరించి వారి మంచి చెడుల బాధ్యతను స్వీకరించింది. రచయిత్రి ఈ పాత్రను తీర్చిదిద్దడంలో కృతకృత్యులయ్యారు. ఏకక్షణంలో ఇటు తల్లిదండ్రుల ఆవేదనను, అటు అత్తమామల అసహాయతను అర్థంచేసుకోవడమేగాక మానవతా మూర్తిలా తన కర్తవ్యాన్ని నిర్వర్తించేందుకు ముందంజ వేయడమన్న సంఘటన నిజంగా అపురూపమైనదే! అత్తమామలు కూడా ఒక ఆడపిల్ల నిండు జీవితాన్ని అడవిగాచిన వెన్నెలలా చేసిన తమ సుపుత్రుడ్ని క్షమించకుండా, రక్తసంబంధాన్ని సైతం కాద

నుకుని కొడుకుతో తెగతెంపులు చేసుకున్నారు. అత్తగారు వియ్యపురాలి మాటలకు క్షోభించక పోగా, 'తమ బిడ్డ జీవితం ఛిన్నాభిన్నం చేసిన వాళ్ళతో ఏ కన్నతల్లైనా ఇలాగే ప్రవర్తిస్తుంది' లెమ్మని సమర్థించింది. దీనికి కావల్సింది చదువు కాదు సంస్కారం... డబ్బు కాదు హృదయం. ఈ మూడు పాత్రలే కాక ప్రభాకరం పాత్రకూడా ఔన్నత్యానికి మారుపేరులా నిలి చింది. స్నేహితురాలి జీవితం నందనంచేయ డానికి, అభాగినిలా మిగిలిపోయిన ఆమె బతు కులో వెన్నెలలు కురిపించడానికి అనుక్షణం మథనపడిపోయిందీ పాత్ర. ఇంకా అనుభవాలే అన్ని పాఠాలూ నేర్పుతాయన్న చందంగా శ్వేత, ఉమ, రాజారావు, సంధ్య తదితర పాత్రలన్నీ అచ్చం సజీవపాత్రల్లాగే వ్యవహ రించాయి.

అయితే నవలలో అమెరికా వెళ్ళిన మూడు ప్రధాన పాత్రలూ చెడ్డవిగానే చిత్రితమ య్యాయి. అందరూ అలాంటివారే కాదనీ, అలా వెళ్ళిన వారిలోనూ సంస్కారులూ, ఉన్నతులూ ఉంటారనీ చెప్పగలిగితే సమ తూకం ఉండేది. మంచి, చెడు అనేవి అన్నిచో ట్లా ఉంటాయి. అమెరికా వెళ్ళిన వాళ్ళంతా చెడ్డవారు కారు. ఇండియాలో ఉన్న వారంతా మంచివారూ కాదు.

మొత్తంమీద ఈ నవల మానవతా విలువ లకు పట్టాభిషేకం చేసింది. రచయిత్రి పరిణత దృష్టికి ప్రతి సంఘటనా అర్థంపట్టింది.

-పత్రాపచంద్ర,
హైదరాబాద్,

## అమెరికా క్రేజ్

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**'చ**తుర' డిసెంబరు 1994 సంచికలో ప్రచురి తమైన 'విలువలు' చక్కని ఇతివృత్తంతో ఆకట్టుకొన్న నవల. జీవన్ అమెరికా చదువు కోసం పట్టుబట్టినపుడు లక్ష్మీదేవి పలుకులు, 'బిడ్డల్ని కంటాంగానీ వారి స్వభావాల్ని కాదు గా?' అనేది 'ప్రొలోగ్' గా అనిపిస్తాయి. అతను తల్లిదండ్రుల్ని మభ్యపెట్టి తన అమెరికా ప్ర యాణాన్ని సుగమంచేసుకున్న తీరు, అతను ఎంతకయినా సమర్థుడన్న భావాన్ని ప్రతిఫ లించింది. జీవన్‌లాంటి ఎందరో విలాసాలు, సంపాదన, స్త్రీ మోజుల్లో పడి తను ఔన్న త్యంతోపాటు మానవతా విలువల్నీ మరచి పోతున్నారన్నది అక్షరసత్యం!

తమకు స్టెల్లాతో ఎంత సన్నిహిత బాంధ వ్యమున్నా చెప్పకుండా అమాయకురాలయిన 'అపురూప'ను పెళ్ళాడి ఆమెకు తీరని ద్రోహం చేసిన పాత్రగా మిగిలిపోతాడు జీవన్. రూప మానవతా విలువలు ఉన్న, అవి తెలిసిన మనసున్న పాత్ర. వృద్ధాప్యంలో అత్తమామల కడగండ్లను అర్థం చేసుకోగలిగిన కరుణామూ ర్తి! ఎంత సంస్కారవంతమయిన కుటుంబంలోంచి వచ్చినా పిల్లలు రెక్కలొచ్చే సరికి మానవాతా విలువల్ని మరచిపోతున్నా రన్న రచయిత్రి ఆవేదన అర్థవంతమయిన అంశం. సంధ్య నూటికి నూరు పాళ్ళు సగటు ఆడపిల్లల తల్లి అనిపిస్తుంది. రూప మాటల్లో చెప్పాలంటే, 'కాలానికీ కష్టానికీ భయపడకపో తే ఏ పనయినా సాధించవచ్చు' అన్నది అక్షరసత్యం. హరినాధరావు కొడుకువల్ల బాధా తప్తుడయినా, రూపలాంటి కోడలి ఆదరణ, సపర్యలకు నోచుకున్న పుణ్యజీవి. ఉమ పాత్ర ద్వారా బాధితులయిన ఆడపిల్లలకు 'స్ఫూర్తి' లభిస్తుంది. 'అమెరికా సంబంధం' అంటే సామాన్యంగా ఉండే వేలం వెర్రిని ఎండగట్టి, తద్వ్యతిరేకంగా ఇక్కడే 'చిన్న ఉద్యోగమైనా చాలు- బుద్ధిమంతుడయిన యువకుడు లభి స్తే!' అనిపించేలా ప్రభాకర్ పాత్ర మలచబ డింది. 'గతాన్ని తవ్వుకుంటూ కూర్చునేవారికి వర్తమానమేకాదు, భవిష్యత్తు కూడా వుండదు' అనేది కఠిన సత్యం! మానవతా విలువలున్న మంచి మనిషికోసం సాగిన రూప అన్వేషణతో ముగిసిన ఈ నవలలో సామాజిక స్పృహ వుంది. మన సాంప్రదాయ విలువలకు భా ష్యం చెప్తూ అమెరికా 'క్రేజ్'ను ఎత్తి చూపిన




ఈ నవలలో పట్టుగా చదివించే గుణం పుష్కలంగా వుంది!

-గోపాలుని రఘుపతిరావు,
తెనాలి.

## విలువైనది

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'విలువలు' నవల చాలా బాగుంది. ఆదర్శ భావాలుగల అత్తమామలు, తల్లితండ్రులు, స్నేహితులు, అన్నిపాత్రలు మనసుకు హత్తుకున్నాయి. తల్లితండ్రులు బిడ్డలను ప్రయోజకులను చెయ్యాలని కష్టాలు భరించి పెద్ద చదువులు చెప్పిస్తున్నారు. ఇంకా విజ్ఞానాన్ని సంపాదించాలని విదేశాలకు వెళ్ళి, వెళ్ళిన పని మర్చిపోయి, విలాసాలకు మరిగి అక్కడే బందీలు అయిపోతున్నారు. అందుకు ఉదాహరణ జీవన్ పాత్ర. అలాంటి యువకులకు ఇది కనువిప్పు.

అపురూప పాత్ర నిజంగా అపురూపం! అనురాగానికి, ఆప్యాయతకు ఆమె ప్రత్యక్ష రూపం. అపురూపలాంటి స్త్రీలు మన సమాజంలో చాలా తక్కువగా కనిపిస్తారు. స్వార్థం అసూయనిండిన వాళ్ళే ఎక్కువ. అలాంటి వాళ్ళకి అపురూప పాత్ర ఎంతో సందేశాన్నిస్తుంది. ఈర్ష్యాద్వేషాలతో రగులుతున్న మన సమాజానికి ఈ నవల ఒక పన్నీటి జల్లు. ఈ జల్లులో ప్రతి ఒక్కరూ ప్రేమ, ఆప్యాయతల విలువను గుర్తిస్తారు. ఇందులో ప్రతి పాత్ర కళ్ళకు కట్టినట్లుగా ఉంది. స్నేహంలో తియ్యదనం రూపా, శ్వేత, ఉమ, ప్రభాకర్ పాత్రల ద్వారా తెలుస్తుంది. అణువణువునా మృదుమధురమైన సంభాషణలతో చివరివరకు ఆగకుండా చదివించిందీ నవల. దాచుకుని మళ్ళీ మళ్ళీ చదవాలి అనిపించే విలువైన నవల ఇది. 'మళ్ళీ పెళ్ళి మగవాళ్ళకేకాదు ఆడవాళ్ళకీ కావాలి' అనే ఆదర్శానికి అనుగుణంగా తల్లి, తండ్రి, అత్తమామలు, బంధువర్గపు పాత్రలు బాగా సృష్టించబడ్డాయి. ఇలాంటి విలువైన నవలను మన సమాజానికి ఇచ్చిన రచయిత్రి అభినందనీయురాలు. మంచి నవలలు అందిస్తున్న చతురకు మా ధన్యవాదాలు. ఈలాంటి నవలలు మన సమాజానికి ఎంతో చైతన్యం కలిగిస్తాయి.

-కె. మీనాక్షి,
జొన్నాడ.

## మరో అమెరికా

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

పాశ్చాత్య సంస్కృతిలో మోకాళ్ళదాక దిగబడిన యువత ధోరణుల్ని చిత్రించటంలో 'రాధాశివమోహన్' గారు సఫలీకృతులయ్యారు. ఈ ధోరణి ఒక్క అమెరికాలోనే స్థిరపడిన 'భారతీయ యువత'కే కాదు ఇక్కడి యువతకు కూడా వర్తిస్తుంది. 'భారతీయ సంస్కృతి' నరనరాన వ్యాపించినవారిని సైతం 'పాశ్చాత్య సంస్కృతి' ఎలా నిలువునా ఆవరించుకుంటుందో ఈ నవలలో గమనిస్తాం.

పాశ్యాత్య సంస్కృతిలోని మంచిని స్వీకరించటంవరకు సబబే. 'సినిమా చూసినవాడిని మంచికన్నా చెడే ప్రభావితం చేసినట్లు పర సంస్కృతికి ఆకర్షితులయినవారిలో పెడ ధోరణులే కలుగుతున్నాయి. చదువుల కోసం బరువు బాధ్యతల్ని గాలికి వదలేసే యువతపట్ల హరినాధనావు ఆవేశం సమంజసమే! ఇలాంటి యువకులు యిక్కడ లేరని చెప్పగలమా! యువకులనే ఎందుకు పేర్కొంటున్నానంటే యువతులకి ఈ బాధ్యతలు, బంధాలు వివాహానంతరం ఏర్పడతాయి గనుక. చివరికీ పాశ్చాత్య సంస్కృతి వారిని కూడా అలుముకుంటే ఇండియా 'మరో అమెరికా' కాక మానదు. ఈ 'భావి'లో యువత మునిగిపోకూడదన్న ఆదర్శం ఈ 'విలువలు' నవలలో అడుగడుగునా కనిపిస్తుంది.

- వై. బాలరాజు,
హైద్రాబాద్.



చతుర సంపుటి: 18 సంచిక: 1
ఫిబ్రవరి: 1995

ప్రకృతి అందాలకు, ప్రశాంత జీవితానికి పట్టుకొమ్మ యిన ఆ పల్లెలో... పసిడిపంటలు పండించుకుంటూ తృప్తిగా బతుకుతున్న రైతు అతను...

పట్నాలలో అభివృద్ధి పథంలో ఉన్న వ్యాపారాలు, మనసును మురిపించే ఆదాయాలు, వాటితో లభించే సుఖమయ జీవితాల్ని ఓ పంచరంగుల చిత్రంలా ఊహించుకునే గృహిణి ఆమె...

పరిస్థితుల ప్రోద్బలంతో, భార్య ప్రోత్సాహంతో పొలాల్ని తెగనమ్మి పట్నంలో వ్యాపారం ప్రారంభించాడతను.

ఆ ఆధునిక వ్యాపార నాగరికతా పడగనీడనే పచ్చని వృక్షచ్ఛాయ అనుకుని పట్నం చేరిన ఆ కుటుంబం అనూహ్యంగా ఎదుర్కొన్న అనుభవాలేమిటి?

పట్టణాల వెలుగు జిలుగుల బతుకు పరదాల్ని తొలగించి వాస్తవాల్ని బట్టబయలు చేస్తూ జె.వి. బాబు రాసిన 'పడగనీడ' ఈ నెల చతుర సమగ్ర నవల.

# పడగనీడ

—జె.వి.బాబు

చీకటిపడింది.

వర్షం ఇంకా తగ్గలేదు. చినుకులు పడుతూనే ఉన్నాయి. అప్పుడప్పుడూ గాలి బలంగా విసురుతోంది. దాంతో చినుకులు జల్లుగా వరండాలో పడుతున్నాయి.

ఆకాశంలో ఉరుములూ, మెరుపులు. చీకటి మధ్య మెరుపుల వెలుతురులో చినుకుల వేగాన్ని చూస్తున్నాడు శ్రీనివాసరావు.

తెలతెలవారుతుండగా మొదలయిందా వాన. పన్నెండు గంటలుగా ముసురు తగ్గనేలేదు.

వరికోత పూర్తయింది. పంట పొలంలోనే ఉంది. ఈరోజు పంట కుప్ప వేయాలనుకున్నాడు. కూళీల్ని కూడా పిలిచిపెట్టాడు. ఇంతలోనే వర్షం...

అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఈ వర్షానికి వడ్లు పచ్చగింజ పడతాయి. సగం రేటు కూడా పలకదు... దిగులు మేఘమయితే, ఓదార్పు వర్షం. వర్షిస్తే మేఘాలు మాయమవుతాయి. కానీ తననిప్పుడు ఎవరు ఓదారుస్తారు? అతడు తననుతానే ఓదార్చుకున్నాడు... 'సరేలే! దిగులు పడి కూర్చుంటే, జరిగేది జరగకమానుతుందా?' అని.

వాకిలి దగ్గర చప్పుడయింది. అతడు తల తిప్పి చూశాడు. సరోజ!

అతడు చూపులు ఎప్పటిలానే వర్షం మీదకు మరల్చాడు.

"ఎంతసేపని ఇలా కూర్చుంటారు? లోపలికి రండి... పిల్లలు ఆకలంటూ గోల చేస్తున్నారు''

"వాళ్లకి భోజనాలు పెట్టేసెయ్యి''

"మీరు లేకుండా వాళ్లు భోంచేయరేమో'' ఆమె గొణిగినట్టుగా అంది.

అతడికి ఆ చోటునుండి లేవాలనిపించడం లేదు. ఏదో నీరసం, మరేదో నిస్సహాయత!

ఆరు నెలల కష్టం నీళ్ల పాలవుతుందని తెలుస్తోన్నా ఏమీ చేయలేని పరిస్థితి... పిల్లల కోసమయినా లేవక తప్పదు.

శ్రీనివాసరావు వాలుకుర్చీలోనుండి లేచి ఇంట్లోకి వెళ్లాడు. "అందరికీ భోజనాలు పెట్టు'' కాళ్లు కడుక్కునేందుకు పెరట్లోకెళ్లాడు.

అతడు వచ్చేసరికి పిల్లలిద్దరూ పళ్లాల ముందు కూర్చుని ఉన్నారు.

"వాడేడి?" అడిగాడు అతడు.

"పిలిచాను... వస్తున్నాడు'' బదులిచ్చింది సరోజ.

అతడు పీట మీద కూర్చుని పళ్లెం దగ్గరకు లాక్కున్నాడు. సరోజ భర్త ప్లేట్లో అన్నం వడ్డించింది. అతడు అన్నం కలుపుకోబోతూ తమ్ముడిని కేకేసాడు, "రేయ్ రవీ''

"వస్తున్నా'' గదిలోనుండి తమ్ముడి గొంతు వినిపించింది. పది క్షణాల తర్వాత రవి వచ్చాడు. వారితోపాటే కూర్చున్నాడు.

ఇరవై రెండేళ్లుంటాయి. మంచి ఎత్తు, దృఢంగా ఉన్నాడతడు.

"ఇంతసేపూ గదిలో ఏం చేస్తున్నావ్?" శ్రీనివాసరావు తమ్ముడిని ప్రశ్నించాడు.

"బ్యాంక్ కాంపిటీషన్ పుస్తకాలు తిరగేస్తున్నాను''

రవి డిగ్రీ పూర్తి చేసి రెండు సంవత్సరాలయింది. ఈ రెండేళ్లు అతడు ఉద్యోగాన్వేషణలోనే ఉన్నాడు.

సరోజ మరిది పళ్లెంలో అన్నం, కూర వడ్డించింది.

"ఉదయం నుండి వర్షం కురుస్తూనే ఉంది. పొలంలో పంట మునిగిపోయి ఉంటుంది కదన్నయ్యా''

శ్రీనివాసరావు నిశ్శబ్దంగా తలాడించాడు.

"ఏమిటో! ఈ సంవత్సరం కూడా మన పరిస్థితి మామూలే అయ్యేట్టుంది. తెచ్చిన అప్పు సగమయినా తీరుతుందో లేదో?!"

గత రెండు సంవత్సరాలుగా తీర ప్రాంతంలోని రైతులు నష్టపడుతూనే ఉన్నారు.




ఒక సంవత్సరం పంట తీరా చేతిలోకి రాబోయే ముందు తుపాన్‌దెబ్బ తగిలింది. రైతుకు తీరని దెబ్బ అయింది. ఈ సంవత్సరం భారీ వర్షాల కారణంగా పంట నాశనం! 'ప్చ్! రైతు బతుకు బాగుపడే అవకాశం కనుచూపు మేరలో కనుపించడం లేదు' మనసులోనే అనుకున్నాడతడు.

భోజనాలయ్యాక శ్రీనివాసరావు గొడుగేసుకెళ్లి పశువులకు గడ్డివేసి వచ్చాడు. అతడు వచ్చేసరికి రవీ, పిల్లలు గదిలోకి వెళ్లి తలుపేసుకున్నారు. పిల్లలిద్దరికీ బాబాయ్ దగ్గరే పడుకోవడం రెండు సంవత్సరాల నుండి అలవాటయింది. అతడూ వెళ్లి పడుకున్నాడు.

సరోజ వంటగది సర్ది వచ్చేసరికి అర్ధగంట పైగానే పట్టింది.

సాధారణంగా ఆమె ఆ గదిలోకి వచ్చేసరికి అతడు నిద్రపోతూ ఉంటాడు. కాని ఈరోజు అతడు నిద్రపోవడంలేదు. కన్నులు తెరిచి ఇంటి పైకప్పును తదేకంగా చూస్తున్నాడు. భర్త బాగా మధనపడుతున్నాడని ఆమె గ్రహించింది... మంచం మీద సర్దుకుని పడుకుందామె.

ఆకాశం భయంకరంగా ఉరిమింది... ఎక్కడో పిడుగుపడుతున్న ధ్వని! ఆమె భర్తకు మరింత దగ్గరగా జరిగింది.

శ్రీనివాసరావు తల తిప్పి ఆమెను చూసి, కుడిచేత్తో దగ్గరగా లాక్కున్నాడు. ఆమె అతడి ఛాతీ మీద చెయ్యివేసింది.

"బాధపడుతున్నారా?" సరోజ అడిగింది మెల్లగా.

అతడికి నిశ్శబ్దాన్నిబ్రద్దలు చేయడం ఇష్టం లేనట్టుంది. జవాబు చెప్పలేదు. ఆమే అంది...

"బాధపడి మనం చేయగలిగింది ఏముంది? ఆకాశానికి చేతులు అడ్డుపెట్టి వర్షాన్ని ఆపలేము. పొలంలోని పంట తడవకుండా కాపాడలేం... ఏమీ చేయలేము" ఆమె గొంతు నిస్సహాయంగా పలికింది.

"ఈ పల్లెటూరి బతుకులే అంత. వర్షం వచ్చినా, రాకపోయినా బాధపడాలి. ఎక్కువ వాన కురిస్తే పైరు మునిగిపోతుంది. వాన రాకపోతే పైరెండిపోతుంది. అదునుకాని అదునులో వర్షంపడితే పంట నాశనం. ఏటికి వరదొచ్చినా, విశాఖకార్తెలో తుపానొచ్చినా రైతు బతుకు తల్లడిల్లిపోవలసిందే"

భర్త తన మాటలు విన్నాడో లేదోనని ఆమె అతడి ముఖంలోనికి చూసింది. అదేక్షణం అతడూ ఆమె చూపులలో చూపు కలిపాడు. సన్నగా నవ్వాడు... అతడికి ఆమె మనసులోని కోరిక తెలుసు.

అతడు కాస్త నవ్వడంతో ఆమెకు హుషారొచ్చింది. ఆమె చెయ్యి అతడి ఛాతీమీది వెంట్రుకలను మృదువుగా పట్టి లాగడంతో అతడు అప్రయత్నంగానే ఆమె నడుము మీద చెయ్యి వేశాడు. తనూ ఆమె వైపుకు తిరుగుతూ "అయితే ఇప్పుడేమంటావ్?" తెలుసు అతడికి, ఆమె ఏం చెప్పబోతుందో! అయినప్పటికీ ప్రశ్నించాడు.

"మనకి ఎప్పుడూ కష్టాలే! ఆకాశంలో మబ్బు కమ్మితే వర్షం వస్తుందని భయం. బలంగా గాలి విసిరితే తుపానేమోనని భయం. రైతు బతుకు ఎప్పుడూ భయంతో ముడివడి ఉంది. పగలంతా గొడ్డు చాకిరీ చేయాలి. పేడా, రొచ్చుల్లో దొర్లాలి. ఒక వినోదం లేదు, ఆనందమూ లేదు. పని... పని... పని... ఇంత కష్టపడ్డా ప్రకృతి కనికరిస్తే సరి! లేకపోతే అప్పు మాత్రమే మనకు మిగులుతుంది"

"టౌన్‌లో కాపురం పెట్టాలనే కోరిక ఇంకా నీకు పోలేదా?"

సరోజ అతడికి మరింత దగ్గరగా జరిగింది. ఆమె ఎడమ చెయ్యి అతడి వీపు మీద కదలాడుతోంది. మగవాడి బలహీన క్షణాలెప్పుడో తెలిసిన ఆడది ఆమె. అతడి వీక్‌పాయింట్ ఎక్కడో కూడా తెలుసామెకు.

"అదికాదండీ! టౌన్‌లో వ్యాపారాలు చేసి ఎంతోమంది లక్షలు సంపాదిస్తున్నారు. పల్లెల

నుండి ఏమీలేకుండా పట్టణంవెళ్లినవాళ్లు తిరిగి చూసేసరికి అక్కడే మిద్దెలు కట్టేస్తున్నారు. స్కూటర్‌లలో తిరుగుతున్నారు. వాళ్ల పిల్లల్ని మంచి స్కూల్స్‌లో చదివిస్తున్నారు..." ఆమె నిట్టూర్చింది. "హూఁ! మనది మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడ్నే ఉంది''

అతడు బదులు పలకలేదు. చిరునవ్వుతో తననే చూస్తుండడం గమనించి మనసులోనే విసుక్కుందామె "నేనింతగా వాగుతుంటే, మీరేం మాట్లాడరేం?"

శ్రీనివాసరావు అదే నవ్వుతో "నువ్వు చెప్ప దలచుకున్నదంతా విన్నాక మాట్లాడదా మని..." అన్నాడు.

టౌన్ ప్రసక్తి ఎత్తితేనే కసురుకునే భర్త ఆమాత్రం ఓపికగా తన మాటలు వింటానన డంతో ఆమెకు చాలా ఆనందం కలిగింది. "ఈయనలో ఇప్పుడిప్పుడే మార్పు వస్తోంది. మరికాస్త పోరితే విజయవాడలో కాపురం పెట్టేందుకు అంగీకరించవచ్చు అనుకుందా మె. దాంతో ఆమె మరింత వగలుపోతూ బుంగమూతిపెట్టింది.

అతడు ఆమె బుంగమూతి చూశాడు. ఆ క్షణం ఆమె చాలా అందంగా కనుపించింది అతడికి. భార్య పెదవులమీద తన పెదవులతో ముద్ర వేశాడు. ఆప్యాయంగా కురులను సవ రించాడు. ఆమె నడుము చుట్టూ చేతులు పోనించి గట్టిగా శరీరానికి హత్తుకున్నాడు.

సరోజ అతడిలోని మార్పు గమనిస్తూనే ఉంది. ఇనుమును సాగదీయాలంటే బాగా కాల్చాలి. మగవాడిని మాటలతో వంచాలంటే ముందు వేడెక్కించాలి. ఆమె అతడిని అల్లుకు పోయింది. అతడికి సహకరిస్తూనే మెల్లగా చెప్పింది, "ఏమండీ! విజయవాడలో మా రామకృష్ణన్నను చూడండి. కిరాణాకొట్టు పెట్టు కున్నా ఎంతో ప్రశాంతంగా బతుకుతున్నాడు. ఒక వస్తువు చెడిపోతుందని దిగులులేదు. నష్టపోతామని భయంలేదు. వర్షం వస్తే అంగ డి మూసేసి ఇంట్లో కూర్చుని టి.వి. చూస్తాడు. ఆదివారం అందరూ కలిసి సినిమాకెళ్తారు. జీవితాన్ని ఎంత ఆనందంగా గడపొచ్చో వా రిని చూస్తే తెలుస్తుంది. మనకి ఈ పల్లెలో ఒక సుఖంలేదు, ఆనందం లేదు. చెప్పండి! మన మూ విజయవాడ వెళ్లిపోదామా?"

అతడు అన్నాడు "సరోజా! విజయవాడలో కాపురం పెట్టాలంటే నాకు కొద్దిగా భయంగా ఉంది. ఇది నేను పుట్టినగడ్డ. సేద్యం నాకు అలవాటయిన వృత్తి. ఈ గడ్డను వదిలేసి ఎక్కడికో వెళ్లి నాకు చాతకాని పనులు చేయా లంటే... ఏమో! ఇబ్బందులు కొని తెచ్చు కుంటామేమోనని భయం"

"అదిగో... అదిగో ఆ భయమే మనిషిని పైకి రానివ్వకుండా చేసేది. టౌన్‌కి వెళితే ఎలా బతకాలన్న భయం మనకెందుకు? మనకి నాలుగెకరాల పొలం ఉంది. అది అమ్మితే లక్ష రూపాయలు తక్కువకాకుండా వస్తుంది. దాంతో విజయవాడలో మంచి వ్యాపారం మొదలుపెట్టొచ్చు. వ్యాపారం తెలియదని మీరెందుకు కంగారుపడటం? మన రవి ఉన్నా డు. తను చదువుకున్నవాడుకదా! విజయవా డలో తనకి మంచి స్నేహితులున్నారట. ఒక సారి నేను కదిలిస్తే చెప్పాడు. తన ఫ్రెండ్స్‌లో ఒకరికి బీసెంట్‌రోడ్‌లో బట్టల వ్యాపారం ఉందట. ఇంకొకరిది టి.విలు అమ్మే షాపట. మరొకడి నాన్న నవలలు ప్రింట్ చేసి అమ్ముతా డట. 'వదినా అన్నను కూడా వ్యాపారం చేయమని చెప్పు. నేను నా ఫ్రెండ్స్‌ని ఏ వ్యాపారమయితే బాగుంటుందో కనుక్కుంటా ను. నా ఫ్రెండ్ ఒకడు చెప్పాడు నేను వ్యా పారం చేయాలనుకుంటే తను సహాయం చేస్తానని. లక్ష రూపాయలుంటే చాలట. లక్షకు లక్ష రూపాయల సరుకు అప్పు ఇస్తారట' అని చెప్పాడు''

"మనవాడు చాలా వివరాలు సేకరించా డే?" నవ్వాడతడు.

"మన రవికి కూడా వ్యాపారమంటే చాలా ఇష్టం"

"అంటే వదినా మరిది ఒక జట్టు అన్న




మాట"

ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది. మెరుపు కాంతిలో ఆమె మేని అందాలు కనుల విందు చేశాయి అతడికి. ఆమెను తమకంగా పైకి లాక్కున్నాడు శ్రీనివాసరావు. ఆమె బుగ్గ మీద వేలితో కొట్టాడు.

అతడు పూర్తిగా మూడ్‌లోకి వెళ్లిపోతున్నాడని గ్రహించి చివరిగా చెప్పింది "రవి చదువుకుని రెండు సంవత్సరాల నుండి ఖాళీగా ఉన్నాడు. ఈ కాలంలో చదువుకున్నవారికి ఉద్యోగాలెక్కడొస్తున్నాయి చెప్పండి. అన్నదమ్ములిద్దరూ కలిసి విజయవాడలో వ్యాపారం మొదలెడితే..."

ఆమె మాటలు మధ్యలోనే ఆపుచేస్తూ "సరే ఆలోచిద్దాంలే' అన్నాడు... భార్య గుండెలమధ్య ముఖం దాచుకునే ప్రయత్నం చేస్తూ.

ఇక అతడిని మాటలతో ఇబ్బంది పెట్టడం ఆమెకూ ఇష్టంలేకపోయింది. ఈయన అలా అన్నాడేగానీ ఈ పల్లెను అంత సులభంగా వదిలే మనిషి కాదు అనుకుంటూనే భర్త గుండెల మీద తలవాల్చుకుందామె.

★ ★ ★

నల్లత్రాచులా భూంకరిస్తున్న చీకటిని తన కాంతిఖడ్గంతో తరిమి కొడుతూ సూర్యుడు హుషారుగా పైకి లేస్తున్నాడు.

వర్షం వెలిసింది.

వేకువనే పొలం చేరుకున్నాడు శ్రీనివాసరావు. పొలం వంక చూస్తే గుండె తరుక్కుపోయింది.

ఆరు నెలల కష్టం, పదివేల రూపాయల పెట్టుబడి... నీటిలో తేలియాడుతోంది. సగం గింజలు నీటిలోనే రాలిపోయాయి. మిగిలిన సగం పచ్చగింజ పడిపోతోంది. వాటిని కొనేవాడుండడు. ఈ సంవత్సరం కూడా తను బాగా నష్టపోయాడు.

రెండు సంవత్సరాలుగా వరుస దెబ్బలు. ప్రకృతి రకరకాలుగా రైతును కృంగదీస్తోంది. ఎందుకనో ఆ ప్రకృతి మాతకు రైతుమీద ఇంత కోపం?!

అతడికి ఆ క్షణం చాలా దిగులేసింది. ఈసారయినా పంట బాగా పండితే అప్పులు కాస్త తీర్చుకోవచ్చు అనుకున్నాడు. కానిప్పుడు... శ్రీనివాసరావుకి సరోజ మాటలు గుర్తుకు వచ్చాయి. 'ఈ పల్లెటూరి బతుకులే అంత! వర్షం వచ్చినా, రాకపోయినా బాధపడాలి. ఎక్కువ వాన కురిస్తే పైరు మునిగిపోతుంది. వాన రాకపోతే పైరెండిపోతుంది'

'ఈ కష్టాలు తీరేరోజెప్పుడోకదా!' దిగాలుపడ్డాడు శ్రీనివాసరావు. మిగిలిన అప్పుల సంగతి ఎలా ఉన్నా, ఈ సంవత్సరం నారాయణ అప్పు కట్టేయాలి. వాడు మరో మూడు నెలల్లో కూతురి పెళ్లి చేయబోతున్నాడు.

నారాయణ శ్రీనివాసరావుకి పెదనాన్న కొడుకు. అతడికన్నా ఆరేడు సంవత్సరాలు పెద్దవాడు. అయినా వారిద్దరూ ఒకే ఇంట్లో పుట్టి, ఒకే చోట కలిసిమెలిసి తిరిగారుగాబట్టి పేర్లు పెట్టి పిలుచుకోవడం అలవాటయింది.

ఏం చేయాలో దిక్కుతోచడంలేదు శ్రీనివాసరావుకి. మునిగిపోయిన పంటముందు ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు. ఎప్పుడో పదిహేనేళ్ల క్రితం తల్లి శవం ముందు ఇలాగే చైతన్యరహితుడయి కూర్చున్నాడు. తిరిగి ఇప్పుడు...

"అన్నయ్యా!"

అతడు తలెత్తి చూశాడు... తమ్ముడు... రవి!

"పొలమంతా తిరిగి చూసి వస్తున్నాను'' రవి అన్నాడు.

"మనం ఈ సంవత్సరం కూడా బాగా నష్టపోయాం" చాలా సేపటి తర్వాత తమ్ముడితో చెప్పాడు అతడు.

రవి బలంగా ఊపిరి పీల్చి వదిలాడు. అతడు బాగా వ్యధపడుతున్నాడని అర్థమయింది. రవి మాట మారుస్తూ "వదిన మిమ్మల్ని పిలుచుకురమ్మంది. బారెడు పొద్దెక్కినా




చద్దన్నానికి రాలేదని దిగాలుపడింది'' చెప్పాడు.

తప్పనిసరయి లేచాడు అతడు.

పొలాలమ్మట నడుస్తుంటే ఎటు చూసినా నీళ్లలో మునిగిన పైరు, రైతులు చాలామంది పొలంగట్ల మీదే దిగాలుగా నిలబడి ఉన్నారు.

"ఏం శీనయ్యా! పైరు ఎలా ఉంది?" ఒక రైతు అడిగాడు.

"నీళ్లలో మునిగిపోయి ఉందన్నా''

"ఈ నీళ్లన్నీ పోయి, పొలాలు ఎండేందుకు ఎంతలేదన్నా వారం రోజులు పడుతుంది'' వాపోయాడా రైతు.

"అంతేకదా! అప్పటికి ఆ మిగిలిన వడ్లు రాలిపోతాయి'' చెప్పాడు శ్రీనివాసరావు.

పొలాలు దాటి రోడ్డు మీదకొచ్చారు అన్నదమ్ములిద్దరూ. నేలంతా చిత్తడిగా ఉంది. వర్షం వస్తే పల్లెటూరి రోడ్లన్నీ బురదమయమవుతాయి.

ఇంటికెళ్లేసరికి వాకిటనే నిలబడి తనకోసం ఎదురు చూస్తున్న సరోజ కనుపించింది.

"పది గంటలయింది. ఇంకా చద్దన్నానికి రాకపోయేసరికి..." ఆమె కన్నులలో భయం స్పష్టంగా కనుపించింది అతడికి.

"భయపడ్డావా?"

ఎందుకనో తెలియదు ఆమె కన్నుల్లో నీళ్లు చిప్పిల్లాయి. ఆమె నిజంగానే తన గురించి భయపడినట్లుంది పిచ్చిది! ఏదో పంట నాశనమయిందని దిగులుపడి అక్కడ కూర్చుండిపోయాడనుకో... అంత మాత్రానికే ఏవేవో ఊహించుకోవడం?! భార్య అమాయకత్వానికి నవ్వొచ్చింది. తనంత పిరికివాడు కాదని ఆమెకు ఇంతకాలం సాహచర్యంలో అర్థమయినట్లు లేదు.

"లోపలికి పద" అతడు ఇంట్లోకి నడిచాడు. "చద్దన్నం పెట్టు'' పెరట్లోకి వెళుతూ అన్నాడు.

ఆమె కంచంపెట్టి చద్దన్నం అందులో పెట్టింది. ఉప్పు, మిరపకాయలు ప్లేట్‌లో ఉంచింది.

శ్రీనివాసరావు పళ్లెం ముందు కూర్చున్నాక అడిగాడు, "పిల్లలు స్కూల్‌కి వెళ్లారా?"

"ఆc వెళ్లారు'' ఆమె గొణిగింది. "ఏం చదువులో ఏం పాడో! ఈ పల్లెటూరి బడులకు అయ్యవార్లు రావడమే కష్టమయిపోతోంది. పిల్లల్ని పట్టించుకునేదెవరు? చదువు చెప్పేదెవరు?"

అతడు నిశ్శబ్దంగా తలాడించాడు. ఆమె మాటలలో కొంత వాస్తవముందని అతడికి తెలుసు. టౌన్‌లో కాపురం పెట్టే అయ్యవార్లు పల్లెల్లోని స్కూల్స్‌కి సరిగ్గా టైముకి రాలేరు. ఒక్కోరోజు రాకపోవడం కూడా జరుగుతుంటుంది. పల్లెటూర్లలోని స్కూల్స్‌ని పట్టించుకునేవారెవరు? అందుకే పల్లెటూరి పిల్లలకు చదువు అంతంత మాత్రంగానే ఉంటుంది.

శ్రీనివాసరావుకి ఇద్దరు సంతానం పెద్దవాడు ఐదో తరగతి, చిన్నవాడు మూడో తరగతి. వారికి మంచి చదువులు చెప్పించాలని అతడి కోరిక. అయితే అందుబాటులో సరయిన కాన్వెంట్ కూడా లేదు. పల్లెటూరి పిల్లలకు సరయిన విద్యాసౌకర్యాలు అందుబాటులో లేవన్నది వాస్తవం.

చద్దన్నం తిన్నాక ఆయన పశువుల పని చూసి, పొలం వెళ్లిపోయాడు.

పొలంలోని నీరు కాల్వకి మళ్లించాడు. మధ్యాహ్నానికి నీరు కొంత తగ్గింది. మరోరోజు ఆగితే చాలు పొలంలోని నీరు చుక్కలేకుండా కాల్వకు వెళ్లిపోతాయి. ఆ తర్వాత మరో రెండురోజులు తడారవలసి ఉంటుంది.

మధ్యాహ్నం రెండింటికి ఇంటికెళ్లి భోంచేసి వరండాలో కూర్చుంటే, రవి మెల్లగా పక్కన చేరాడు. తమ్ముడు అలా పక్కన నిలబడ్డాడంటే ఏదో విశేషమే ఉంటుందని అతడికి తెలుసు.

తమ్ముడంటే అతడికి అభిమానమేకాదు,








# అజరామర కళాసృష్టి



★ కళాకారుడు చనిపోయినా అతని సృష్టి మాత్రం అజరామరంగా నిలిచి వుంటుందనడానికి సాక్షులు ఈ చిత్రాల్లోని వృక్షాలు. కాలిఫోర్నియాలోని స్కాటేవాలీలో సుమారు ఏభై రకాల వృక్షాలను కొత్త పద్ధతిలో అంటుకట్టి, అవి ఆకర్షణీయమైన ఆకృతిలో పెరిగేలా చేసిన కళాకారుడు ఎలెక్స్ ఎర్లాండ్‌సన్. 1967లో అతను చనిపోయాడు. అయితే ఆ లోయను అభివృద్ధిచేసే పనిలో భాగంగా ఈ వృక్షాలన్నిటినీ పెకలించి వేయబోయారు సంబంధిత అధికారులు. కానీ మరొక ప్రకృతి ప్రేమికుడు ఇరవై వేల డాలర్లు ఖర్చుపెట్టి అందమైన ఈ వృక్షాలన్నిటినీ వేళ్ళతోసహా పెకిలించి మరో ఉద్యానవనానికి తరలిస్తున్నాడు.

తెలివితేటల మీద నమ్మకమూ ఉంది. రవి ఆ పల్లెలోని అందరి కుర్రాళ్లలాంటివాడు కాదు. చిన్నప్పటి నుండి మంచి లక్షణాలు అలవర చుకున్నాడు. తన చదువేదో తను చదువు కుంటూ ఇంటిపట్టునే ఉండేవాడు. ఊళ్లోని స్నేహితులతో అల్లరిచిల్లరగా తిరిగేవాడు కాదు. కాలేజీ చదువుల కోసం విజయవాడలో కొంతకాలమున్నా, చెడు అలవాట్లు నేర్చుకోలేదని తనకు ఖచ్చితంగా తెలుసు.

"ఏమిట్రా రవీ! ఏమిటి విశేషం?"

రవి అతడి పక్కనే కింద కూర్చున్నాడు.

"అన్నయ్యా! నేను మీతో కాసేపు మాట్లాడాలి''

అతడు ఏమీ మాట్లాడకుండా తమ్ముడి ముఖంలోనికి కొద్ది క్షణాలు తదేకంగా చూశాడు. కొద్దిక్షణాల తర్వాత "ఏ విషయం" ప్రశ్నించాడు.

రవి కొన్ని సెకన్లపాటు గుటకలు మింగుతూ ఉండిపోయాడు. శ్రీనివాసరావుని చూస్తే కాస్త భయం. అంతకు మించి గౌరవం ఉన్నాయి. అందువలననే ఒక ముఖ్యమైన విషయం మాట్లాడేందుకు కాస్త తడబడవలసి వచ్చింది.

"మన పొలం విషయం?"

శ్రీనివాసరావు చూపులలో విస్మయం కదలాడింది. కనుబొమలు ముడివడ్డాయి "చెప్పు!"

"అదే... అదే అన్నయ్యా! మన పొలం ఖరీదు ఎంతుంటుంది?"

"పాతికవేలు ఎకరం!"

"అంటే నాలుగెకరాలు లక్షరూపాయలన్న మాట..." రవి కొద్దిగా మాటలు కూడదీసుకుని ప్రశ్నించాడు కాస్త భయంగానే. "మరి ఈ సంవత్సరం మీరు లక్ష రూపాయల పెట్టుబడి మీద ఎంత సంపాదించారు?"

శ్రీనివాసరావు కాస్త తడబడి "సంపాదించడమేమిటి? ఈ సంవత్సరం రెండు పంటల మీద మనకే అయిదారువేలు అప్పు తేలుతుంది'' బదులిచ్చాడు.

"పోయిన సంవత్సరం?"

"అప్పుడు..." అతడు కొద్దిగా ఆలోచించుకుని బదులిచ్చాడు. "అప్పుడు బొటాబొటీగా సరిపోయాయి''

రవి అదోలా నవ్వాడు "లక్ష రూపాయల పెట్టుబడి మీద మీరు రెండు సంవత్సరాల్లో ఏమీ మిగల్చకపోగా ఐదారువేలు అప్పు పడ్డారు. అప్పుల పాలయ్యేందుకు మనం వ్యవసాయమే చేయవలసిన అవసరమేముంది? ఇంట్లో తిని కూర్చున్నా ఇంతకన్నా ఎక్కువ అప్పు అయి ఉండేదికాదు''

"అయితే ఇంతకీ నువ్వేమంటావ్?" అతడు కోపంగా ప్రశ్నించలేదు. తమ్ముడి మనసులోని మాట ఏమిటో తెలుసుకోవాలని ప్రశాంతంగా అడిగాడు.

రవికి కూడా తన మనసులోని మాట చెప్పడంలో తప్పు లేదనిపించింది. గొంతు సర్దుకున్నాడు, "నేను చెప్పే మాటలు కోప్పడకుండా వినండి. వ్యవసాయం నేడు రైతుకు లాభదాయకం కాదు. నేటి రైతు వ్యవసాయ ఖర్చులు పెరిగి, పెట్టుబడులకు తగిన దిగుబడులురాక అప్పుల పాలయిపోతున్నాడు. మరో రెండేళ్లు ఇలాగే గడిస్తే మనం పూర్తిగా అప్పుల పాలయిపోతాం. అందుకే మనం ఇప్పుడే కాస్త జాగ్రత్తపడటం మేలు'' అన్న ముఖంలోని ప్రశాంతత గమనించాకే, చెప్పదలచుకున్నది పూర్తిగా చెప్పాడు... "మనం పొలం అమ్మేస్తే లక్ష రూపాయలొస్తుంది. ఆ మొత్తం వడ్డీకి ఇచ్చి ఇంట్లో కూర్చున్నా, నెలకో పదిహేను వందలొస్తాయి. మన ఇంటి ఖర్చు నెలకో వెయ్యి రూపాయలు కూడా కాదు. అదృష్టవశాత్తు ఈలోపు నాకేదయినా ఉద్యోగం వస్తే మన కష్టాలు పూర్తిగా తీరిపోతాయి''

చాలా సేపటివరకూ శ్రీనివాసరావు పెదవి విప్పలేదు. పెదవులు బిగపట్టి ధ్యానముద్రలో మునిగిపోయినట్టున్న అన్నను చూస్తే తనేమ

యినా తప్పు మాట్లాడాడేమోనన్న అను మానం కలిగింది రవికి.

"నువ్వు చెప్పేదీ బాగానే ఉంది. ఆలోచి ద్దాం" శ్రీనివాసరావు పలికాడు.

అప్పటికి రవి మనసు కాస్త స్థిమితపడింది. అన్న తనను అపార్థం చేసుకోలేదు.

కిటికీ అవతల ఉండి వీరి సంభాషణ ఆలకిస్తున్న సరోజ కూడా సంబరపడింది. అసలు మరిదిని తయారుచేసి పంపింది తనే!

అతడు కాసేపు విశ్రాంతి తీసుకుని పొలం వెళ్లాడు.

పొలంలో గట్టు మీదే నిలబడి పైరుని చూస్తున్నాడు నారాయణ. శ్రీనివాసరావు అత నికి దగ్గరగా వెళ్లాడు.

"ఏరా శీనూ! ఎకరానికి పుట్టెడు కూడా రాలేట్టులేవే" అన్నాడు.

"ప్చ్" నిట్టూర్చాడు శ్రీనివాసరావు "పె ట్టిన ఖర్చు తిరిగొస్తే చాలనుకుంటున్నాను" చెప్పాడు.

ఇద్దరూ పొలంగట్ల మీద నడవసాగారు.

ఆ పొలం వారి తాతలనాటి ఆస్తి. శ్రీనివా సరావు తాతయ్యకు ఇరవై ఎకరాల పొలం ఉండేది. నలుగురు సంతానం ఆయనకు.

నలుగురు అన్నదమ్ములు ఓ పదిహేడేళ్ల క్రితం వరకూ కలిసే ఉండేవారు. బిడ్డలు ఎదిగాక తలా నాలుగెకరాలు పంచుకుని విడి పోయారు. శ్రీనివాసరావు తండ్రి వారిలో రెండో వాడు. నారాయణ మొదటి కొడుకు సంతానం. నారాయణ, తన తమ్ముడికి రెండె కరాలు భాగం పంచి ఇచ్చేశాడు నాలుగేళ్లక్రిత మే! ఇప్పుడు తనకు ఉండేది రెండెకరాల పొలమే. అదీ శ్రీనివాసరావు పొలాన్ని ఆనుకు నే ఉంది.

రవి పుట్టిన నాలుగేళ్లకు తండ్రి పాముకా టుకు గురయి మరణించాడు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకే తల్లి భర్తను వెతు క్కుంటూ పైలోకాలకు వెళ్లిపోయింది.

అప్పటికే తాతగారి పెత్తనం పోయి, పెదనా న్న చేతికి అధికారం వచ్చింది. ఆయన అంత పెద్ద కుటుంబాన్ని ఒక్కడే బరువు బాధ్యతలు మోయడం కష్టమని తలచి, ఎవరికివారు వేరు కుంపట్లు పెట్టుకోమని చెప్పాడు. తమ్ముడి బరువును తలకెత్తుకుని కొత్తకాపురం పెట్టాడు శ్రీనివాసరావు. పెదనాన్న, చిన్నాన్న బిడ్డలు తిరిగి విడిపోయారుగానీ తాము ఎప్పటికీ కలిసి ఉండాలని శ్రీనివాసరావు కోరిక.

నారాయణ మోటారు దగ్గరగా నడిచి, మా మిడి చెట్టు మొదట్లో కూర్చున్నాడు.

"లాభంలేదురా శీనూ! మనబోటివారు వ్య వసాయం చేసి పది రూపాయలు సంపాదించే అవకాశమే కనిపించడం లేదు. ఒకవైపు ఇలాంటి ప్రకృతి దెబ్బలు, పెరిగిపోతున్న ఎరువుల ధరలు, అందుబాటులో లేని కూలీ లు... వ్యవసాయం మానేసి మరేదయినా పని వెతుక్కోవడం మంచిదనిపిస్తోంది"

"నేనూ అదే ఆలోచిస్తున్నా నారాయణా! పొలాన్ని అమ్మేద్దామనుకుంటున్నాను"

నారాయణ ఉలిక్కిపడి అతడి వంక చూశా డు, "పొలాన్ని అమ్మేద్దామనుకుంటున్నావా?"

"అవును" తలాడించాడు శ్రీనివాసరావు.

"అమ్మేసి...?"

"హాయిగా వడ్డీకి ఇచ్చేసి, ఇంట్లో కూర్చుని వడ్డీ డబ్బు తింటున్నా జరిగిపోతుంది"

నారాయణ కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక చెప్పాడు, "కానీ డబ్బు స్థిరాస్తి కాదు. డబ్బుగా ఉంటే మనబోటివారికి లేనిపోని ఆలోచనలు పుట్టుకొస్తాయి. రకరకాల కోరికలు కలుగుతుంటాయి"

రవి తనకు చెప్పిన సలహా నారాయణకు చెప్పాలా వద్దా అని కొద్దిక్షణాలు తటపటా యించి చెప్పడానికే నిర్ణయించుకున్నాడు.

"నారాయణా! మేము పొలం అమ్మేసి, విజయవాడకు కాపురం మార్చే ఉద్దేశ్యంలో ఉన్నాము"




నారాయణ అతడి వంక చూశాడు, "ఏమిటీ? నువ్వు చెప్పేది నిజమేనా?"

అతడు తలూపాడు.

"వద్దు... వద్దు. పట్నం వెళ్లే ఆలోచనను దగ్గరకు కూడా రానివ్వకు'' వెంటనే చెప్పాడు నారాయణ.

అతడు ప్రశ్నార్థకంగా నారాయణ వంక చూశాడు.

"టౌన్‌లో మనబోటివారం బతకడం కష్టంరా! అక్కడంతా మోసం, అన్యాయం... మనం ఊహించని ఇబ్బందులు ఎన్నో ఉన్నాయి. ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తేగానీ నెగ్గుకురావడం చాలా కష్టం"

"మన రవి అక్కడే ఐదేళ్లు చదువుకున్నాడు. వాడికి విజయవాడ గురించి బాగా తెలుసు. వాడు తెలివిగానే అన్నీ చూసుకోగలడు''

"చిన్న కుర్రాడు వాడికున్న లోకజ్ఞానం ఏపాటిది? టౌన్‌లో జీవితమంటే తమాషా అనుకుంటున్నట్టున్నాడు. అక్కడ ఎవరికెవరో! సాటివాడి గురించి ఎవరూ పట్టించుకోరు. కానీ ప్రతివాడూ తనపక్కవాడిని మోసం చేయాలని అనుకుంటూనే ఉంటాడు. పల్లెలో ఇలాంటి దెబ్బలు తగిలినా తట్టుకోగలం. పట్నంలో దెబ్బ తగిలితే కోలుకోవడం చాలా కష్టమవుతుంది. నా మాట విను. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడంవల్ల ఉపయోగం ఉండదు. పట్నం వెళ్లి దెబ్బతిని బాధపడటం వలన ప్రయోజనం లేదు''

అతడు అన్నాడు. "సరే! మేమిక్కడే పల్లెలో ఉంటే రవి పరిస్థితి ఏమిటి? వాడు రెండు సంవత్సరాలనుండి ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు. రాలేదు. ఈ పల్లెలో ఉండి ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభం ఏముంటుంది? విజయవాడలోనయితే అవకాశాలన్నీ మన దృష్టికి వస్తాయి. ఒకవేళ ఉద్యోగం రాకపోతే వాడీ పల్లెటూర్లో ఉండి ఏం చేయగలడు? పొలం పనులకు పనికిరాడు. వాడికి ఏదయినా వ్యాపకం కలిపించాలనే నేనీఆలోచన చేస్తున్నా''

శ్రీనివాసరావు మెదడులో పట్నం వెళ్ళాలనే ఆలోచన బలంగా నాటుకుపోయిందని గ్రహించాడు నారాయణ. అతడి మనస్తత్వం నారాయణకు బాగా తెలుసు. ఏదయినా మనసులో పడకుండానే ఉండాలి, పడితే దాని గురించి ఆలోచిస్తూనే ఉంటాడు.

"ఏదేమయినా నీ ఉద్దేశం మార్చుకుంటే మంచిదేమో''

శ్రీనివాసరావు బదులు పలుకలేదు. అతడిని మార్చడం కష్టమని అర్థమయింది నారాయణకు. అందుకే ఆ ప్రస్తావన అంతటితో ఆపేశాడు. అటుగా వెళ్దాం పద" నారాయణ లేచి తన పొలంవైపు నడక సాగించాడు. శ్రీనివాసరావు వెనుకే నడవసాగాడు.

నారాయణ పొలంలో పైరు కూడా నీళ్లలో మునిగిపోయివుంది. "ఈ పంట దెబ్బతినకుండా ఉండి ఉంటే పెళ్ళిఖర్చులకు మరో ఐదారువేలు కలిసివచ్చి ఉండేది''

"అన్నీ మనం అనుకున్నట్టే జరగవుకదా... ఈసారి వడ్లు అమ్మితేనే ఐదువేలు అప్పు తీరిపోతుందనుకున్నాను. ఇప్పుడు నీ అప్పు తీర్చాలంటే మరో దగ్గర అప్పు చేయాలి'' చెప్పాడు శ్రీనివాసరావు.

"అమ్మాయి పెళ్లికార్యం తలపెట్టకపోతే నిన్ను అసలు అడిగి ఉండేవాడినే కాదు''

"ఆ విషయం నాకు తెలుసు''

బాగా పొద్దుపోయేవరకూ వారిద్దరూ పొలంలోనే ఉన్నారు.

ఇంటికి తిరుగుముఖం పట్టినప్పుడు నారాయణ "ఏమయినా విజయవాడకు వెళ్ళాలన్న నీ ఆలోచన సరయినదిగా నాకనిపించడంలేదు'' అన్నాడు.

శ్రీనివాసరావు ఎప్పటిలానే బదులివ్వకుండా, నవ్వి ఊరుకున్నాడు.

"వెళ్లొస్తానూ'' ఊళ్లో ప్రవేశించాక, రెండురోడ్లు చీలేచోట నిలబడి చెప్పాడు అతడు.

తలూపాడు నారాయణ.

ఇంటికెళ్లాక వరండా ముందున్న బక్కెట్‌లో నీళ్లు ముంచుకుని బురదకాళ్లను కడుక్కొని లోపలికెళ్లాడు. చొక్కావిప్పి భార్యకు అందించాడు. చొక్కా అందుకుంటూ "ఇదేమిటి?" ఆమె ప్రశ్న.

అతడు అటు చూశాడు. తెల్లచొక్కామీద 'బురద మరక'

"పొలం వెళ్లాక బురదమరకలు కాకుండా ఉంటాయా- ఏమిటి?" నవ్వాడు శ్రీనివాసరావు.

"ఈ బురద మరకల బ్రతుకు ఇంకెంత కాలమో?" చొక్కా విదిలిస్తూ ఇంట్లోకి వెళ్లింది సరోజ.



కృష్ణానది ఒడ్డున ఉండే ఒక అందమైన పల్లెటూరు. అది- ఉయ్యూరు.

పచ్చని పంటపొలాలు, సమృద్ధిగా లభించే పాడి, కన్నులకు ఇంపుగా కనిపించే కృష్ణానది! ఆ పల్లెజనాలు మంచివారు. గ్రామంలో రాజకీయ పార్టీలున్నాయిగానీ, కొట్లాటలు లేవు. ప్రశాంతమయిన పల్లె అది.

ఎంకి పాటలు, కోయిల కూతలు, గోధూళి మైమరపులు, బావామరదళ్ల సరదాలు, బంధువుల రాకపోకలు, ఒకరికోసం ఒకరు బ్రతకడం... అన్నీ కలసిన అపురూప అనుభవాల ఆశ్రయం... ప...ల్లె...

అందమయినవి పల్లెలు. ఆప్యాయతల హరివిల్లులు పల్లెద్వారాలు. చిలికే కవ్వాలు సప్తస్వరాలు. పలికే గోవులు వేదమంత్రాలు. శ్రమైక జీవన సౌందర్యానికి పల్లెలు దేవాలయాలు.

కానీ నేడు పల్లెలు మెల్లమెల్లగా ఖాళీ అవుతున్నాయి. జనం దేవాలయం నీడనుండి శ్మశానంలోని సమాధుల కిందకు సేదతీరే నిమిత్తం పరుగెడుతున్నారు... ఎందుకని?

అత్యాశ- ఒక్కటే కారణం కాదు, రకరకాల ఆకర్షణలు. ఇంటిలోని అందమైన భార్యకన్నా, తెరమీది సినీతార ఆకర్షించినట్టు జనం రకరకాల వ్యామోహాలతో పట్నాలవైపు పరుగెడుతున్నారు. ఎంతోమంది చెపుతూనే ఉన్నారు. టౌన్ పక్కకెళ్లొద్దురా డింగరీ, డాంబికాలు పోవద్దురా... అని.

శ్రీనివాసరావుని విజయవాడ ఆకర్షించలేదు. అతడికి అత్యాశ కూడా లేదు. అయితే- పల్లెలో ఉండి ఏమీ సంపాదించలేకపోవడం బాధగా ఉంది. భార్యా, తమ్ముడి ఉపదేశం తలకెక్కుతోంది. అందువలననే అతడు 'విజయవాడ కాపురం' అంటూ కలవరిస్తున్నాడు.

పల్లెటూర్లలో ఏ వార్తయినా క్షణాలలో ఊరంతా తెలిసిపోతుంది.

శ్రీనివాసరావు విజయవాడకు వెళ్ళిపోతున్నాడు.

పొలం కొనుగోలుకు చాలామంది ముందుకు వచ్చారు. శ్రీనివాసరావుది బంగారం పండే పొలం. పోటీబేరాలు వచ్చాయి. పాతికవేలన్నది మరో వెయ్యి రూపాయలు ఎక్కువ పెట్టి కొనేందుకు సిద్ధపడ్డారు.

శ్రీనివాసరావు పొలం అమ్మకానికి పెట్టాడని తెలిసి, అతడి పెద్దనాన్న, చిన్నాన్న బిడ్డలు మందలించారు. "నేలతల్లిని నమ్ముకున్నవాళ్లెన్నడూ చెడిపోలేదు... పట్నంలో మనుష్యుల్ని నమ్ముకోవాలి. 'మనిషిని నమ్మితే ఏముంది? మట్టిని నమ్మినా ఫలితం




ఉంటుంది''

ఆ మాటే భార్యతో చెప్పాడు అతడు. అందుకు ఆమె అంది. "వాళ్లు ఎవరండీ? మనకు దాయాదులు. పురాణాలలోనుండి దాయాదులు మేలుకోరడం ఎక్కడయినా ఉందా? ఒకరు బాగుపడుతుంటే చూడలేని లోకమండీ ఇది. ఇతరులు ఏమంటున్నారో మీరు పట్టించుకోకండి. మనం ఏం చేయాలా అన్నది ఆలోచించుకోండి. మన భవిష్యత్ మనం నిర్ణయించుకోవాలిగానీ వాళ్ల వీళ్ల మాటలు వినడమేమిటి?"

వారిమధ్య ఆ సంభాషణ జరిగిన మూడోరోజే శ్రీనివాసరావు ఇరవైఆరువేల చొప్పున ఎకరం అమ్మేసి అడ్వాన్స్ పుచ్చుకున్నాడు.

ఆరోజు సరోజ ముఖం మతాబులా వెలిగిపోయింది. రవి కన్నులలో కాంతి కనిపించింది. పిల్లలకింకా లోకం తెలియదు. వారికి పట్నానికి-పల్లెకు మధ్య తేడా ఏం తెలుసు?!

పొలానికి అడ్వాన్స్ పుచ్చుకున్నాక శ్రీనివాసరావు కొద్దిగా బాధపడుతూ ఉంటుంటే, ఆ బాధ తనవారి ముఖాలలోని సంతోషం చూసినప్పుడే ఎగిరిపోయింది. "పోతే పోయిందిలే! పట్నం వెళ్లి పదిరూపాయలు సంపాదించుకుంటే, ఇలాంటి పొలం ఎంతయినా కొనుక్కోవచ్చు'' అనుకున్నాడు.

పూర్తి డబ్బు చెల్లించేందుకు నెలరోజులు గడువుపెట్టారు కొన్నవాళ్లు. అడ్వాన్స్‌గా ఇచ్చిన పాతికవేలలో పదివేలు అప్పులు కట్టేశాడు. మిగిలిన పదిహేనువేలు చేతిలో పట్టుకున్నాడు.

"పట్నం వెళ్లాలి? కాని... పట్నం వెళ్లి ఏం చేయాలి?"

ఒక సాయంత్రం తమ్ముడిని దగ్గర కూర్చోబెట్టుకుని ఆ విషయమే చర్చించాడు. "రవీ! నువ్వు, మీ వదిన పొలం అచ్చిరావడంలేదని పట్నం పోదామని అంటుంటే 'సరేనని పొలం అమ్మేశాను' ఇక పట్నం పోవాలి... అక్కడికెళ్లి ఏం చేద్దాం? నా ఉద్దేశం నువ్వారోజు చెప్పినట్టు ఈ డబ్బు వడ్డీకి ఇచ్చేసి కూర్చుని తింటూ పల్లెలోనే ఉండిపోదామని''

రవి అన్నాడు, "పొలంలో మనకు లాభాలు రానందున, వడ్డీ మేలని చెప్పానుగానీ, చేతిలో డబ్బులున్నప్పుడు విజయవాడలాంటిచోట వ్యాపారం చేయడమే మేలుకదా అన్నయ్యా''

"నాకు విజయవాడ గురించి ఏమీ తెలియదురా నీకు మాత్రం తెలియనిదేముంది? నేను చిన్నప్పటినుండి పొలంపని తప్ప మరోటి ఎరగనుకదా! పట్నాలలో పరిస్థితి ఏమిటో నాకు తెలియదు. నువ్వూ మీ వదిన మాత్రం పట్నంలో కాపురం పెడితే పైకి రాగలం అంటున్నారు. ఈ పల్లెలో పదిరూపాయలు సంపాదించుకుంటుంటే నేను మీ మాట కాదని, ఇక్కడే ఉండాలని అని ఉండేవాడిని. కాని ఇక్కడి పరిస్థితి కూడా సరిగా లేదు. ఏటా కొంత లోటు అవుతూనే ఉంది. అందుకే పోనీ పట్నమే వెళ్లి మన అదృష్టం పరీక్షించుకోవాలనే నిర్ణయానికి వచ్చి పొలం అమ్మేశాను. ఇప్పటివరకూ ఈ సంసారం నామీద జరిగింది... విజయవాడ, వ్యాపారం నాకు తెలియనివి. కాబట్టి ఏం చేసినా నువ్వే చేయాలి''

రవి నిశ్శబ్దంగా తలాడించాడు. ఇరవైరెండేళ్ళ ఆ యువకునికి ఆ క్షణమే అర్థమయింది- అన్న తనమీద చాలా పెద్ద బరువు ఉంచాడని. రవి అంత అమాయకుడేం కాదు. మంచి తెలివితేటలు ఉన్నాయి. బరువుబాధ్యతలు తెలిసినవాడే! తన కుటుంబాన్ని పైకి తీసుకురావాలన్న కోరిక తనలో ఉంది. అందువల్లననే పల్లె విడిచి పట్నం పోదామంటున్నాడు. టౌన్‌లో సంపాదించుకునే అవకాశాలు ఎక్కువని అతడి నమ్మకం.

మనిషి ఎంతయినా శ్రమపడొచ్చు. ఎంతో కృషి చేయవచ్చు. కాని కాసింత అనుభవం, సరయిన పరిసరాలు కూడా సమకూరాలి.

రవికి అవి లేవు. ఇంకా ఆ వ్యాపార

సంబంధ వాస్తవాలు తెలియవు.

★ ★ ★

విజయవాడలో రవికి మంచి ఫ్రెండ్ సర్కిల్ ఉంది. కమలాకర్, సురేష్, ప్రసాద్, ఆలీ... వీరంతా అతడికి క్లాస్‌మేట్స్.

కమలాకర్ తండ్రి సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగి. సురేష్ నాన్న స్థానిక పలుకుబడి ఉన్న రాజకీయనాయకుడు. ప్రసాద్ కుటుంబానికి పెద్ద బట్టలకొట్టు ఉంది. ఆలీ స్వయంగా ఫైనాన్స్ కంపెనీ పెట్టేసుకున్నాడు.

ఉయ్యూరునుండి విజయవాడకు ముప్పయ్‌కిలోమీటర్ల దూరం. ఆరోజు వేకువఝామునే వెళ్ళే బస్సులో విజయవాడకు బయలుదేరాడు రవి.

అతడు కదలబోయేముందు సరోజ చెప్పింది. "అక్కడ మా రామకృష్ణన్నను కూడా కలుసుకో రవీ! ఆయన సలహా కూడా తీసుకునిరా''

తలూపాడు రవి.

విజయవాడలో బస్సు దిగాక తిన్నగా ప్రసాద్ ఇంటికి వెళ్లాడు అతడు. రవికి వారింట్లో బాగా చనువు ఉంది.

"హల్లో రవీ! చాలాకాలానికి వచ్చావే టౌన్‌కి?" ప్రసాద్ ఆప్యాయంగా పలకరించాడు. మిత్రుడిని తన రూమ్‌లోకి తీసుకువెళ్లాడు.

కాసేపు అవీ, ఇవీ మాట్లాడుకున్నాక రవి తనొచ్చిన విషయం చెప్పాడు. "మేమూ విజయవాడకు వచ్చేయాలనుకుంటున్నాంరా''

"గుడ్‌ఐడియా'' అన్నాడు ప్రసాదు. "ఇక్కడికొస్తే ఏదో ఒక వ్యాపారం చేసుకోవచ్చు''

"అదే... వ్యాపారం చేయాలనే ఆలోచనే ఉంది. కాని ఏం వ్యాపారం చేయాలో అర్థం కావట్లేదు. సలహా చెపుతావనే నీ దగ్గరకు వచ్చాను''

"మాలాగే బట్టల వ్యాపారం స్టార్ట్ చేయండి''

రవి నసిగాడు. "మాలాగా అంటే... మీది కోటిరూపాయల వ్యాపారంకదరా! మేము అంత పెద్ద ఎత్తున ఎలా చేయగలం?"

"మీ స్థాయికి తగ్గట్టు మీరు మొదలెట్టండి. మీరు ఎంత పెట్టుబడి పెట్టగలరు?"

"ఓ లక్షరూపాయలు''

ప్రసాద్ లెక్కలు చెప్పాడు. "రూమ్ అడ్వాన్స్ పదివేలు, ఫర్నిచర్‌కి పాతికవేలు. మిగిలిన అరవైఅయిదువేలకు, మరో అరవైఅయిదువేలు సరుకు అప్పు దొరుకుతుంది. ఏదయినా మంచి సెంటర్ చూద్దాం. మా నాన్నకు హోల్‌సేల్ వ్యాపారులను పరిచయం చేయమని చెపుతాను''

వారింట్లో టిఫిన్ చేశాక రవి ప్రసాదుతో కలిసి బీసెంట్ రోడ్‌లోని వారి షాపుకి వెళ్లాడు. చాలా పెద్ద షాపు అది. ఎప్పుడూ రద్దీగా ఉంటుంది. ప్రసాద్ తండ్రి రఘురామయ్య కేష్‌కౌంటర్లో ఉంటాడు. సుమారు పదిమంది సేల్స్ కుర్రాళ్లున్నారు. ప్రసాద్ అన్న చంద్రశేఖర్ బయటి వ్యవహారాలు చూసుకుంటుంటాడు. కాలేజీ చదువు ఆపేశాక ప్రసాద్ కూడా ఎక్కువ సమయం షాపులోనే ఉంటున్నాడు.

రఘురామయ్య రవిని పలకరించాడు. "ఏమోయ్! ఎలా ఉన్నావ్?"

"బాగున్నాను అంకుల్''

"విజయవాడకు రావడం బాగా తగ్గించేసినట్టున్నావే''

"ఇకనుండి ఇక్కడే ఉండిపోవాలనే ఆలోచనలో ఉన్నారు వారు'' ప్రసాద్ అందుకుని చెప్పాడు.

"ఏమిటి నువ్వనేది?" కొడుకు వంక చూశారాయన.

రవి విజయవాడకు వచ్చిన కారణం చెప్పాడు ప్రసాద్.

ఉదయంవేళ కావడంతో షాపులో ఇంకా రద్దీ పెరగలేదు. కాస్త తీరికగా ఉండటంతో ఆయన ప్రశాంతంగా మాట్లాడగలుగుతున్నాడు.




ఆయన అన్నాడు. "ఆలోచన మంచిదే. కాని... వ్యాపారమంటే చాలా రకాలుగా ఆలోచించాలి. మొదట మనిషి సున్నితత్వం వదులుకోవాలి. గట్టిగా మాట్లాడగలగాలి. తర్వాత ఓర్పు, నేర్పు కావాలి. మాటకారితనం చాలా అవసరం. ఇవన్నీ ఉన్నా కాసింత అదృష్టం కలిసి రాకపోతే ఎంత చేసినా ఫలితం ఉండదు. మంచి సెంటర్, మంచి వెరైటీలు పెట్టినా జనం రారు''

రఘురామయ్య మాటలలో నిజం ఉంది. అయితే ప్రతి మనిషిలో ఆశావాదం ఉంటుంది. ఆ ఆశావాదమే లేకపోతే ఈ ప్రపంచంలో అభివృద్ధి ఏనాడో ఆగిపోయి ఉండేది.

ప్రసాద్ అన్నాడు. "పల్లెలో వాళ్ళ పరిస్థితి కూడా అంత బాగోలేదట. ప్రతిఏటా కష్టపడుతున్నారట. విజయవాడకు వస్తే బాగుపడతామేమోనన్న ఆశ వారిది''

"సరే చూడండి''

"అది కాదు నాన్నా! రవి మనసులో బట్టల వ్యాపారమే ఉంది''

"అలాగా''

"మీరు హోల్‌సేల్ వ్యాపారులను పరిచయం చేయాలి''

"దానికేం భాగ్యం! అలాగే చేస్తాను''

రవికి సంతోషం కలిగింది. సాయంత్రంవరకూ అతడు వారి షాపులోనే ఉన్నాడు. వ్యాపారాన్ని పరిశీలించసాగాడు.

సాయంత్రం ప్రసాద్ అతడిని స్కూటర్‌లో సెంటర్‌కి తీసుకెళ్లాడు. అక్కడి టీ సెంటర్‌లో సాయంత్రంవేళ ఫ్రెండ్స్‌ని కలుసుకోవడం అలవాటు.

రవిని చూసి మిత్రబృందం ఖుషీగా ఫీలయింది. "విజయవాడను అసలు మరచిపోయావనుకుంటున్నామోయ్'' అన్నాడు.

అతడు నవ్వాడు. "ఎలా ఉన్నారోయ్ మీరంతా?"

"మాకేం... టౌన్‌లో హేపీగానే గడిచిపోతుంది. నీ గురించే దిగులు మాకు. ఆ పల్లెటూర్లో ఎలా కాలం గడుపుతున్నావో-ఏమిటోనని''

ప్రసాద్ వారికి రవి విజయవాడకు రావాలనుకుంటున్న విషయం చెప్పాడు.

"ఇంకేం? మన గ్రూప్‌లో ఒక్కడు దూరంగా ఉన్నాడన్న బాధ ఉండింది. ఇప్పుడు అదీ లేకుండా పోతుంది'' చెప్పాడు కమలాకర్.

"ముందు మనవాడికి ఏదయినా మంచి సెంటర్‌లో ఒక షాపు చూడండ్రా''

"బట్టల వ్యాపారానికేగా?" అడిగాడు సురేష్.

"అవును''

"అయితే మార్కెట్ ఏరియాలో...' మా బంధువుల షాపు వారంక్రితమే ఖాళీ అయి వుంది. అంతకుముందు దాంట్లో ఏదో ప్రొవిజన్ స్టోర్ ఉండింది. అతగాడు బాగా అప్పులు చేసేసి ఐ.పి. పెట్టి షాపు మూసేశాడు.

"మరి వెళ్లి చూసివద్దాం పదా''

సురేష్‌కి స్కూటర్‌లేదు. అందుకే ఆలీని రమ్మనాడు. తలూపాడు ఆలీ.

ప్రసాదు, సురేష్ ఒక స్కూటర్ ఎక్కితే, రవి, ఆలీ మరో స్కూటర్ ఎక్కారు. కమలాకర్‌ని రమ్మంటే, పని ఉందంటూ వెళ్లిపోయాడు.

స్కూటర్ కొద్దిదూరం వెళ్ళాక ఆలీ రవిని అడిగాడు. "రవీ! నీకు విజయవాడకు రావాలని ఎందుకనిపిస్తోంది?"

"పల్లెటూర్లో సాధించవలసింది ఏమీ కనిపించట్లేదురా''

"సాధించేది కనిపించకపోయినా, కాస్త ప్రశాంతత ఉంటుందిరా మీ పల్లెల్లో కాని ఈ పట్టణాలలో ఏముంది? నిరంతరం టెన్షన్.

ఆలీ మాటలకు నిశ్శబ్దంగా తలాడించాడే గానీ, ఆ మాటలు బుర్రకెక్కించుకోలేదు అతడు. 'అందరి సలహాలు తీసుకోవాలి, కాని



అనుకున్నది చేయాలి' అనే మెంటాలిటీ అత డిది. ఆ రకమయిన మనస్తత్వం సైకలాజికల్ గా మంచిదే. బట్, అనుభవజ్ఞుల సలహాను పాటించడం ఒక్కోసారి చాలా మంచిది.

సురేష్ తన బంధువులతో మాట్లాడాడు. ప్రసాద్‌కీ ఆ సెంటర్ నచ్చింది. "ఈ ఏరి యాలో బట్టల వ్యాపారం బాగా జరుగు **తుందిరా**'' అన్నాడు రవితో

పదివేల రూపాయలు అడ్వాన్స్ అడిగాడు షాప్ ఓనర్. వారంరోజులు గడువు అడిగితే సురేష్‌మీద నమ్మకంతో ఒప్పుకున్నారు. వా రంవరకూ వారు షాపు మరెవరికీ ఇవ్వరు. వారంలోపు అతడు అడ్వాన్స్ ఇవ్వకపోతే మరొకరికి ఇచ్చేస్తారు. ఒప్పుకున్నాడు రవి. నెలకు నాలుగొందల రూపాయలు షాప్ రెంట్.

తను విజయవాడకు వచ్చిన పని చాలావ రకూ పూర్తయిందని సంతోషపడ్డాడు రవి. ఆ రాత్రి ఫ్రెండ్స్ అందరూ సినిమాకెళ్లారు.

రవి ప్రసాద్ ఇంట్లోనే ఉండిపోయి, మర్నా డు పల్లెకు వెళ్లాడు. శ్రీనివాసరావుకి విజయ వాడ కబుర్లు వివరంగా చెప్పాడు.

రెండురోజుల తర్వాత శ్రీనివాసరావు రవి చేతిలో పదివేలుంచి, రూమ్‌కి అడ్వాన్స్ ఇచ్చి రమ్మన్నాడు.

★ ★ ★

రవి హాలులోని కుర్చీలో కూర్చోబోతుంటే వరండాలో అన్న గొంతు వినిపించింది. ఎవరితోనో దీర్ఘసంభాషణ జరుపుతున్నట్టనిపించింది. అతడు అటువైపుగా నడిచాడు.

వరండాలో శ్రీనివాసరావుతోపాటు కూర్చుని ఉన్నది నారాయణ. అతడూ వెళ్లి వారి మధ్య కూర్చున్నాడు.

"ఎప్పుడొచ్చారన్నయ్యా?"

"ఒక అర్థగంటయిందిరా రవీ'' అనేసి నారాయణ, శ్రీనివాసరావు వంక తిరిగి పలికాడు. "రవికి కూడా నేను నచ్చచెపుతాను. పొలమంటే అమ్ముకున్నారు. నిలువనీడనిచ్చే ఇంటిని మాత్రం అమ్మకోకండి. భవిష్యత్‌లో ఏం జరగబోతుందో ఎవరు చెప్పగలరు? ఎప్పటికయినా కాస్త నిలువనీడ ఉంటే మంచిదని నా ఉద్దేశం"

"నాకు ఆ ఆలోచనేం లేదులే నారాయణా! ఏదో వ్యాపారం చేయాలని పొలం అమ్ముకున్నాంగానీ, ఇల్లు ఎందుకమ్ముకుంటాం. అయినా ఈ ఇల్లు అమ్మితే ఎంత వస్తుంది? ఓ పాతికవేలు వస్తుందేమో. అమ్మనులే. ఎప్పటికయినా ఇల్లు ఉండటం, నువ్వన్నట్టు మంచిదే కదా''

నారాయణ రవి వంక తిరిగాడు. "రవీ! నీకూ చెపుతున్నాను. ఈ ఇల్లు తాతలనాటి స్థలంలో మీ అన్న శ్రమపడి కట్టింది. ఎంత అవసరపడ్డా దీన్ని మాత్రం అమ్మాలని ప్రయత్నించకండి. మీరు ఎక్కడికెళ్లినా ఈ పల్లెతో కాస్తో కూస్తో సంబంధం ఉండాలంటే ఈ ఇల్లు ఉండాలి''

"ఈ ఇల్లు అమ్మే ఉద్దేశం మాకు లేదన్నయ్యా'' బదులు పలికాడు రవి.

"అదీ ఆ మాటమీదే ఉండాలి, మీ అన్నదమ్ములిద్దరూ''

ఆ ఊరిలో శ్రీనివాసరావు పెదనాన్న, చినాన్న బిడ్డలు పదిమందిదాకా ఉన్నారు. వారందరికీ సంబంధాలు బాగున్నాయి. అన్ని కుటుంబాల మధ్య రాకపోకలున్నాయి. అయితే వారందరిలో నారాయణకు, శ్రీనివాసరావుతో బంధుత్వంకన్నా దగ్గరయిన స్నేహం ఉంది. అందువల్లనే అతడు ఎక్కువగా శ్రీనివాసరావు సొంత విషయాలలో జోక్యం చేసుకుంటుంటాడు. తన దగ్గర ఉంటే అప్పోసప్పో ఇచ్చి సహాయపడుతుంటాడు.

"పద్మ పెళ్లిపనులు ఎంతవరకూ వచ్చాయన్నయ్యా?" టాపిక్ మారుస్తూ అడిగాడు రవి.

"మరోనెల టైముందికదరా! పనులు మెల్ల మెల్లగా అవుతున్నాయి. కట్టెలు కొట్టించేశాను. వంటవాడిని మాట్లాడేశాను. బంగారం ఆర్డరిచ్చి వచ్చాం. పదిమంది తలో చెయ్యి వేస్తే పనులదేముందిరా. అయిపోతాయిలే''

నారాయణకు తొలిసంతానం ఆడపిల్ల. మరో ఇద్దరు మగపిల్లలు కూడా ఉన్నారు. పద్మను ముప్ఫయ్‌వేల కట్నంతో ఊళ్లోనే ఇస్తున్నాడాయన. కుర్రాడు సేద్యం చేసుకుంటున్నాడు. ఆరెకరాల పొలం ఉంది. కుర్రాడు మంచివాడని ఊళ్లో పేరుంది.

ఆయనకు అంతలోనే ఏదో గుర్తుకు వచ్చినట్టుంది. "అరే! మర్చేపోయాను. మన అచ్యుతరామయ్య లేడూ! మిమ్మల్నోసారి కదిలించి చూడమన్నాడు. అమ్మాయి లావణ్య విజయవాడలో తాతగారింట్లో ఉండి ఇంటర్మీడియేట్ చదువుకుంటోందట. అమ్మాయిని మీరూ చూసేవుంటారు. చాలా బాగుంటుంది. ఓ నలభైవేలదాకా ఇవ్వగలనని అచ్యుతరామయ్య చెప్పాడు''

సరోజ అప్పుడే కాఫీ గ్లాసులతో వరండాలోకి వచ్చింది. ముగ్గురికీ గ్లాసులు అందించాక చెప్పింది. "మా రవికి ఇప్పుడే పెళ్లిచేయాలనుకోవడం లేదులే బావా! తనకి ఇప్పుడే వయసే




ముందని? ఇరవైరెండేళ్లు. మరో రెండేళ్లు ఆగాక చూద్దాంలే'

"అదికాదు సరోజా! అచ్యుతరామయ్య అంటే ఈ ఊళ్లో కాస్తో కూస్తో గౌరవం ఉంది. వారిది మంచి కుటుంబం. అమ్మాయి గుణగణాలు మంచివి. నలభైవేలు కట్నం కూడా ఇస్తానంటున్నాడు''

"ముష్టినలభైవేలు'' ఆయన మాటలు మధ్యలోనే తుంచేసింది సరోజ. "మేము విజయవాడలో కాపురం పెట్టబోతున్నాం. మా రవికి బట్టలకొట్టు ఉండబోతోంది. ఏదో పల్లెటూరివాళ్ళకిచ్చినట్టు నలభైవేలు మేము ఎందుకు తీసుకుంటాం? రవికి లక్ష రూపాయలు కట్నం తీసుకుని పెళ్లిచేస్తాం"

రవి ఆ అమ్మాయిని చాలాసార్లు చూసి ఉన్నాడు. 'అందమయిన అమ్మాయి' చూసినపుడు అనుకునేవాడు. ఆ అమ్మాయిని తన పక్కన ఊహించుకుంటుంటే ఆనందంగా ఉంది. కాని వదినగారి మాటకు అడ్డుచెపితే... పెళ్ళికి తొందరపడుతున్నట్టుగా ఉంటుందేమోనని మౌనం వహించేసాడు అతడు.

సరోజ మాటలకు నారాయణ బదులుపలకలేదు. "మీ ఇష్టమమ్మా! ఆయన కనుక్కోమంటే, మీ ముందు ప్రస్తావించాను. మీరు కాదంటే, ఆ విషయం ఆయనకు చెపుతాను''

మరి కాసేపు అవీఇవీ మాట్లాడాక "వెళ్లొస్తానురా శీనూ'' అన్నాడు.

"నేనూ ఇంటివరకూ వస్తానుండు. పద్మను పలకరించి చాలారోజులయింది. పిచ్చిపిల్ల ఎలా ఉందో, ఏమిటో టవల్ దులిపి భుజాన వేసుకుని నారాయణ వెంటే నడిచాడు శ్రీనివాసరావు.

వరండాలో రవి, సరోజలే మిగిలారు.

సరోజ అతడితో అన్నది "ఏదో నలభై వేలు ఇచ్చేసి, నిన్ను కొట్టేయాలని చూస్తున్నాడాఅచ్యుతరామయ్య. మనం రేపు విజయవాడలో పదిరూపాయలు సంపాదించడం మొదలుపెడితే లక్షలు కట్నం ఇస్తామని ఎంతోమంది వస్తారు, చూస్తుండు''

రవి నవ్వలేక నవ్వుతూ ఉండిపోయాడు సరోజ కాఫీగ్లాసులు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

★ ★ ★

'శ్రీనివాస సిల్క్స్'

ఆ షాపు ఓపెన్ చేయడంలో రవి స్నేహితుల సహకారం ఎంతో ఉంది. సురేష్ షాపు ఇప్పించాడు. ప్రసాదు హోల్‌సేల్ వ్యాపారులను పరిచయం చేయించాడు. షాపు ఫర్నిచర్ చేయించడానికి కమలాకర్ ఎంతో హెల్ప్ చేసాడు. తనకు తెలిసిన కార్పెంటర్ చేత పనిచేయించాడు. పని జరుగుతున్నంతకాలం రవి వెంట తనూ ఉండేవాడు. ఆలీ మాత్రం అంతగా పూనుకుని పనిచేయలేదు.

ఆ మాటే ఒకసారి కమలాకర్‌తో అన్నాడు రవి. "నేను జీవితంలో స్థిరపడాలని ఎంతో శ్రమపడుతుంటే, వాడు ఏవిధంగానూ సహాయపడలేదు కదరా''

"వాడు సాయబుల బిడ్డరా'' అన్నాడు కమలాకర్. "వాళ్ళు వారి స్వార్థం చూసుకుంటారేగానీ పక్కవాడి గురించి పట్టించుకోరు''

కమలాకర్‌కి తన హిందూమతమంటే చాలా అభిమానం "నేను హిందువుగా పుట్టినందుకు గర్వపడుతున్నాను'' అంటుంటాడు తను. రవికి కూడా ఆ మతాభిమానం కాస్త ఉంది. అయితే కమలాకర్‌లా అతడు మతతత్వ పార్టీలతో తిరగడం చేయడు.

"పోనీలే అతడొక్కడు సహాయపడకపోయినా, మీరంతా సహకరించారు అంతే చాలు'' చెప్పాడు రవి.

మరో వారంరోజులలో షాపు ఓపెన్ చేయబోయేముందు శ్రీనివాసరావు కుటుంబం ఉయ్యూరు నుండి విజయవాడకు షిఫ్ట్ అయింది.

షాపు ఓపెన్‌కి తన పల్లెలోని వారందరినీ

పిలిచాడు శ్రీనివాసరావు.

విజయవాడలో రామకృష్ణను, రవి స్నేహితులను ఆహ్వానించాడు.

సురేష్ తనకు తెలిసిన, స్థానికంగా బాగా పేరులోఉన్న రాజకీయ నాయకుని ప్రారంభోత్సవానికి, రిబ్బన్ కట్ చేసేందుకు ఒప్పించాడు.

వచ్చిన వారందరికీ బిస్కట్స్,కూల్‌డ్రింక్స్ అందించాడు రవి. రామకృష్ణ అతడికి సహాయం చేశాడు.

మధ్యాహ్నానికి జనం కలకలం కొద్దిగా తగ్గింది.

శ్రీనివాసరావు, రామకృష్ణతో మాటలు కలిపాడు.

"ఉన్నదంతా షాపు మీద పెట్టేసాను. ఏం జరగబోతోందో- ఏమిటో?" ఎంత నమ్మకం కుదిరినా, కొంత అపనమ్మకమూ ఉండడం మనిషిలోని సహజలక్షణం.

"అంతగా భయపడాల్సిన పనేంలేదు. బావగారూ! ఇది మంచి సెంటర్. బిజినెస్ బాగా జరిగే అవకాశం ఉంది''

"అవకాశం ఉండొచ్చు. కాని అదృష్టం ఉండాలి''

"మీరు అదృష్టవంతులే బావగారూ! వ్యాపారంలో కలిసివచ్చేది, లేనిదీ తొలిరోజే తెలిసిపోతుంది. ఈరోజు ఊపు చూస్తుంటే, అనుమానం లేదు. తప్పకుండా బాగా వ్యాపారం జరుగుతుంది''

"ఏదో మీ నోటిచలవ. అలా జరిగితే అంతకన్నా కావలసిందేముంది?" అన్నాడు శ్రీనివాసరావు.

రామకృష్ణది కంకిపాడుకు దగ్గరలోనేఉండే పల్లె. అతడు విజయవాడకు వచ్చి పదిసంవత్సరాలకు పైగా అయింది. ఆ టౌన్‌లోని పరిస్థితులన్నీ బాగా అర్థంచేసుకుని ఉన్నాడతడు. సూర్యారావుపేటలో చిన్న కిరాణాకొట్టు పెట్టుకుని ఉన్నా, బాగా సంపాదించేసాడు. కిరాణా వ్యాపారంతోపాటు పది రూపాయల వడ్డీకి అప్పులిచ్చి, ఇన్సూరెన్స్‌లు కట్టించి ఎన్ని రకాల అవకాశాలు అందుబాటులో ఉంటే ఆ అవకాశాలన్నింటినీ వినియోగించుకుంటాడు.

"వ్యాపారం బాగానే జరుగుతుంది. కాని మీరు కాస్త జాగ్రత్తగా ఉండాలి''

"అంటే''

"ఇది టౌన్! ప్రతివాడూ అవతలివాడిని ఎలా మోసంచేద్దామా అని ఆలోచిస్తుంటాడిక్కడ. అందరినీ నమ్మకుండా మన జాగ్రత్తలో మనం ఉంటే చాలు''

"అలాగే''

"అప్పులు కూడా ఎక్కువగా ఇవ్వకండి. అప్పుగా అయితే విజయవాడ మొత్తం కొనేసే వ్యక్తులున్నారిక్కడ... అప్పు ఇవ్వడంలో మాత్రం చాలా జాగ్రత్తగా ఉండండి''

శ్రీనివాసరావు నవ్వాడు "ఎక్కడయినా ఉండే వ్యవహారమేగా ఇది''

"అలా అనకండి. పల్లెల్లో అప్పు తీసుకున్నా పరువుకి భయపడతారు. ఇరుగుపొరుగు ఏమనుకుంటారోనని ఆలోచిస్తారు. కానిక్కడ పరువుకి భయపడేవారు ఎవరూ లేరు. పైసా వస్తుందంటే సిగ్గూ ఎగ్గులు వదిలేసి ఎంతకయినా దిగజారుతారు''

పల్లెకు, పట్నానికి మధ్య తేడా కొద్దిగా అర్థమయింది శ్రీనివాసరావుకి. "అలాగే! అప్పు విషయంలో జాగ్రత్తగా ఉంటాం"

రామకృష్ణ తనకు తెలిసిన వాస్తవాలు మరికొన్ని చెప్పాక, వెళ్తానంటూ పైకి లేచాడు. "నేను అప్పుడప్పుడూ ఇటు వస్తుంటాను. ఆదివారం చెల్లాయిని తీసుకుని మీరూ మా ఇంటికి రండి బావగారూ''

తలూపాడు శ్రీనివాసరావు. రామకృష్ణ వెళ్ళిపోయాడు.

★ ★ ★

మొదటిరోజు కావడంతో షాపు కళకళలాడుతూ ఉంది. రవి ఫ్రెండ్స్ వచ్చి పలకరిస్తున్నా




రు. వారిలో కొందరు బట్టలు కొనుగోలు చేస్తున్నారు, సాయంత్రమయింది.

స్ట్రీట్‌లైట్స్ వెలిగాయి.

రవి కౌంటర్‌లో ఉన్నాడు. శ్రీనివాసరావు షాపు ఇవతలకు వచ్చాడు. రోడ్డు దాటి మరో అంచున నిలబడి తలెత్తి తమ షాపు వంక చూసాడు.

ట్యూబ్ లైట్స్‌కాంతిలో మిలమిల మెరిసిపోయే ప్లాస్టిక్ బోర్డ్, జనంతో కళకళలాడుతున్న అంగడి... చాలా ఆనందంగా అనిపించింది అతడికి.

'ఈ ఆనందం ఇలాగే శాశ్వతమయితే బాగుణ్ణు', అనుకున్నాడు అతడు. అలా జరిపించమని దేవుడిని ప్రార్థించాడు.

షాపు మూసేసేముందు రవి కేష్ లెక్కపెట్టాడు. రెండువేలా చిల్లర తేలింది. అమ్మకం బాగా జరిగినట్టే లెక్క.

మొదటిరోజే కాదు, ఆ తర్వాత కూడా వ్యాపారం రోజురోజుకీ పెరగసాగింది. టౌన్‌కి వచ్చి తప్పు చేయలేదన్న భావం బలపడసాగింది.



ఆ రోజు ఆదివారం.

షాపుకి సెలవు కావడంతో సరోజ అన్నగారింటికి వెళ్దామని పోరుపెట్టింది. పిల్లలు కూడా సినిమాకెళ్దాం అంటుండడంతో తలూపాడు శ్రీనివాసరావు.

పదింటికి బయలుదేరి రామకృష్ణ ఇంట్లో మధ్యాహ్నం వరకూ గడిపి మ్యాట్నీ సినిమా చూసి సాయంత్రానికి వచ్చేయాలనుకున్నారు. రవిని రమ్మని పిలిచింది సరోజ.

"నేను రాలేను వదినా! ఈరోజు కమలాకర్ పెళ్ళి చూపులకు వెళుతున్నాడు. నన్నూ రమ్మన్నాడు. వెళుతున్నాను'' రవి చెప్పాడు.

"మధ్యాహ్నానికి వచ్చేస్తావా?" అన్నం వండిపెట్టి వెళ్ళేందుకు అడిగింది.

"రాలేను వదినా! సాయంత్రం వస్తాను''

"సరే... అయితే''

రవి స్నానం చేసి, టిఫిన్ తిని వెళ్ళిపోయాడు.

సరోజ పిల్లలకు స్నానాలు చేయించి, తయారుచేసింది. తను కంచిపట్టు చీర కట్టుకుని ఆడంబరంగా తయారయింది.

పదింటికి వారంతా రామకృష్ణ ఇంటికెళ్ళారు.

"రండి... రండి'' రామకృష్ణ వారిని సాదరంగా ఆహ్వానించాడు. బావ- బావమరిది ముందుగదిలో కూర్చుంటే, రామకృష్ణ భార్య వనజాక్షి ఆడపడుచుని వంటగదిలోకి తీసుకెళ్ళింది. పిల్లలిద్దరూ టి.వి.ముందు సెటిలయిపోయారు.

"ఎలా ఉంది బావగారూ బిజినెస్''

"రోజూ రెండువేలకు తగ్గడం లేదు''

"బిజినెస్ ఇంకా పెరుగుతుందని నా నమ్మకం"

"నా నమ్మకం కూడా అదే''

వనజాక్షి కాఫీ తెచ్చి వారిద్దరికీ అందించింది.

"ఏమ్మా వనజా! ఎలా ఉన్నావ్?"

"బాగున్నానన్నయ్యా''

"పిల్లలు స్కూల్‌కి వెళుతున్నారా?"

"ఆc! వెళ్తున్నారు'' జవాబిచ్చిందామె. "ప్రశాంత్, సతీష్‌లను స్కూల్‌లో చేర్చే

సారా?"

'చేర్చేసాను... మా ఏరియాకు దగ్గరలోనే 'ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు మీడియం స్కూల్' అని బాగా చెపుతున్నారట'

వనజాక్షి లోపలికెళ్ళిపోయింది. వారిద్దరూ తిరిగి మాటలలో మునిగిపోయారు.

"విజయవాడ వచ్చాక మీకెలా ఉంది బావగారూ''

"ఈ రెండు నెలలూ చాలా ప్రశాంతంగా గడిచాయి... మేము వచ్చిన వేళావిశేషమూ బాగున్నట్టుంది. అనుకున్నవి అనుకున్నట్టుగా జరిగిపోతున్నాయి. వ్యాపారం బాగా సాగుతోంది. పిల్లల్ని మంచి స్కూల్‌లో చేర్పించాం. వాళ్ళ భవిష్యత్తూ బాగుపడుతుంది''

"భవిష్యత్ బాగుపడటం, పదిరూపాయలు సంపాదించుకోవడం అవి పక్కనపెడితే- పల్లెల్లో ఉండే ప్రశాంతత పట్నాలలో రాదని నా నమ్మకం, అనుభవమూ''

శ్రీనివాసరావు రామకృష్ణ వంక వింతగా చూసాడు. "నేడు పల్లెల్లో ప్రశాంతత ఏముంది? వర్షం రాకపోతే ఎదురుచూపు, అకాలంలో మబ్బులు కమ్మితే భయం ఏమయినా ఇక్కడే కాస్త నిశ్చింతగా ఉంది''

రామకృష్ణ అన్నాడు. "అంటే అక్కడ మనల్ని భయపట్టేది ప్రకృతి. మనలను ఆదరించి పోషించే తల్లి అప్పుడప్పుడూ ఆగ్రహించొచ్చు. కాని ఇక్కడ... ఈ విజయవాడలో... కేవలం... కేవలం కొందరు వ్యక్తులు మనలను భయపెడతారు, బెదిరిస్తారు. మనలను నిర్దేశిస్తారు. వారు ఆగ్రహిస్తే మన బతుకులు రోడ్డునపడతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఇక్కడ మనం మన బతుకులు బతకడంలేదు. కొందరు వ్యక్తుల దయాదాక్షిణ్యాల మీద మనం బతుకుతున్నాం"

ఏదో కొత్త విషయం వింటున్నట్టుగా అనిపించింది. "మీరు చెప్పేదేమిటో నాకు అర్థంకావడంలేదు'' అయోమయంగా అన్నాడు శ్రీనివాసరావు.

"ఈ విజయవాడ నగరం రాజకీయాన్ని అండగా తీసుకున్న గూండాల చేతిలో ఉందన్నది, ఈ నగరంలో నివసించే ప్రతి పౌరుడికీ తెలుసు''

"నాకు తెలియదు'' వెంటనే అన్నాడు శ్రీనివాసరావు.

"మీకు వారితో సమస్య ఎదురుకాలేదు కాబట్టి, వారి గురించి తెలుసుకునే అవకాశం లేకపోయింది. నేను ఇక్కడి రౌడీలవలన చాలా నష్టపోయాను''

శ్రీనివాసరావు కుర్చీలో కొద్దిగా ముందుకు వంగాడు ''వివరంగా చెప్పండి''

రామకృష్ణ కొద్దిగా గొంతు సర్దుకున్నాడు. "నేను అంతకుముందు మెయిన్ సెంటర్‌లోనే కిరాణా షాపు పెట్టాను. అక్కడి లోకల్ రౌడీలు 'రౌడీ మామూలు' అంటూ రోజూ పీడించుకు తినేవారు. అప్పు ఇవ్వమంటూ కొందరు వేధించేవారు. వారిని కాదంటే ఏదయినా సందర్భం చూసి షాపులో దూరి నానా బీభత్సం చేస్తారు. అందుకే భయపడి కొద్దికాలం 'రౌడీ మామూళ్ళు, అప్పులు' ఇస్తుండేవాడిని. ఇక వారితో వేగలేక ఈ మారుమూల ఏరియాకొచ్చి స్థిరపడ్డాను''

"ఈ రౌడీ మామూళ్ళు, అప్పులకోసం బెదిరింపులు మాకు లేవు''

"అదే మీ అదృష్టం బావగారూ!" అతడు చెప్పాడు "ఒకప్పుడు ఈ టౌన్ మొత్తం ఒకే వర్గంకింద ఉండేది. అప్పుడు వారి ఆటలు యథేచ్ఛగా సాగేవి. ఆ వర్గంలోనుండి కొందరు బయటకివచ్చేసాక రెండు వర్గాలయ్యాయి. మీ షాపు ఉండే ఏరియాలో రెండోవర్గంవారి బలం ఎక్కువ. అయితే వారు రౌడీ మామూళ్లు వసూలు చేసేరకం కాదు''

అర్థమయింది శ్రీనివాసరావుకి. ఇంకా కొంత తెలుసుకోవలసింది ఉందనిపించింది.

"రౌడీలు... ఈ టౌన్‌లో వారి సంఖ్య చాలా ఎక్కువా?"




"చాలా తక్కువే! అయితేనేం, వారు పట్నం మొత్తం గడగడలాడించగలరు''

"వాళ్ళేం చేస్తారు?"

"ప్రతి షాపుకీ వెళ్ళి రౌడీ మామూళ్ళు వసూలు చేస్తారు. మరెవరయినా వందరూపాయలు చేతిలో పెడితే ముక్కూమొహం తెలియని వాడినయినా మక్కెలిరగతంతారు. వారిని ఎదిరించి మాట్లాడితే చెంపలు పగులకొడుతారు''

"మరి ఇంతమంది జనాన్ని ఆ కొద్ది మంది...?"

"అదే వారిలోని గొప్పతనం. ఈ జనంలోని వీక్‌పాయింట్'

"మన పోలీసులు ఏం చేస్తుంటారు?"

"వారూ రౌడీలకు భయపడతారు. అప్పుడప్పుడూ అమ్ముడుపోతారు''

శ్రీనివాసరావు బలంగా ఊపిరి వదిలాడు.

"పల్లెల్లో ఇలాంటి వెకిలిచేష్టలు అసలు ఒప్పుకోరు. ఎవడయినా ఒకడు మరొకడిని అన్యాయంగా బెదిరిస్తుంటే అందరూ కలసి దేహశుద్ధి చేస్తారు''

"అదే పల్లెకూ, పట్నానికున్న తేడా! అందువలననే పల్లెలు ప్రశాంతంగానూ, పట్నాలు రావణకాష్టంగానూ ఉండేది... ఒకరికి జరిగే అన్యాయాన్ని మరొకరు పట్టించుకోకపోవడం, అన్యాయాన్ని ఐక్యంగా ఎదిరించలేక పోవడం పట్నవాసులలో ఉండే ప్రథమలోపం"

శ్రీనివాసరావు నవ్వుతూ "పోనీలే! ఈ రౌడీల బెడద మా ఏరియాలో లేకపోవడం మా అదృష్టం" చెప్పాడు.

"అది చాలా నిజం బావగారూ! మీరు ఈ విషయంలో చాలా అదృష్టవంతులు''

వీరిద్దరూ ఇలా మాట్లాడుకుంటున్న సమయంలో, సరోజ వంట గదిలో వదినగారికుండే వస్తుసామగ్రి పరిశీలనగా చూస్తోంది. ఆమె అంతకు మునుపు కూడా ఏటా వారింటికి వచ్చేదిగానీ, ఇలా వస్తువులను పరిశీలనగా చూడలేదు. అప్పుడు ఆమెకు, కేవలం పట్నం వచ్చి కులాసాగా కాలం గడపాలనే కోరిక తప్ప, వస్తువులమీద మోజులేదు. మొదటి కోరిక తీరిపోయింది. ఒక కోరిక తీరాక మరో కోరిక జనించడం సహజం' ఆ ఇంట్లోని ఫ్రిజ్, టి.వి.,వి.సి.ఆర్, గ్రైండర్, డైనింగ్ టేబుల్ ఇవన్నీ చూస్తుంటే, తమకు అవి లేవన్న కొరత కొద్దిగా పుట్టి, మెల్లగా పెరిగి పెద్దదయి పోసాగింది.

'ఇన్ని వస్తువులు నేనూ కొనుక్కొని తీరాలి' మనసులోనే అనుకుందామె. అలా అనుకుంటూ ముందుగదిలోకి వస్తే వారిద్దరూ ఏదో విషయం దీర్ఘంగా చర్చించుకోవడం కనిపించింది.

"ఇద్దరూ అంత తీవ్రంగా చర్చించుకుంటున్నారు దేని గురించి?"

"ఇక్కడి రౌడీలు గురించి''

"రౌడీల గురించి, హంతకుల గురించి మనకెందుకండీ''

"ఏదో ఉబుసుపోని కబుర్లులే' నవ్వేసాడు శ్రీనివాసరావు.

ఆమె కూడా అక్కడే కూర్చుంది. టాపిక్ మారింది.

వనజాక్షి వచ్చి భోజనానికి పిలిచేవరకూ వారు అవీ ఇవీ మాట్లాడుకుంటూ గడిపారు.

అందరికీ భోజనాలు వడ్డించింది ఆమె.

భోజనాల మధ్య సరోజ రామకృష్ణతో అంది "మధ్యాహ్నం మనమంతా సినిమాకెళ్దాం"

"రాత్రి సెకండ్‌షోకి మేమంతా వెళ్ళాం. పిల్లలికి ఇంకా ఆ నిద్రమత్తు వదల్లేదు. ఇంతలోనే ఇంకో సినిమా అంటే... వద్దులే మీరెళ్ళి రండి''

మరో రెండుసార్లు పిలిచినా ఆయన అదే సమాధానం చెప్పడంతో కాసేపటి తర్వాత శ్రీనివాసరావు, సరోజ పిల్లల్ని తీసుకుని కదిలారు.

"అప్పుడప్పుడూ వస్తుండండి'' చెప్పింది

వనజాక్షి.

"రేపాదివారం మీరూ మా ఇంటికి రండి వదినా''

"అలాగే లేమ్మా''

వారు రిక్షా ఎక్కారు. రిక్షా కొద్దిదూరం పోయాక సరోజ భర్తతో అంది. "ఏమండోయ్! మా అన్నగారింట్లో ఎన్ని వస్తువులున్నాయో చూసారా! టి.వి. ఫ్రిజ్, గ్యాస్‌స్టవ్''

ఆమె మాటలు మధ్యలోనే కట్ చేస్తూ "చూసాను'' అన్నాడు అతడు.

"మనమూ అలాంటి వస్తువులు కొనుక్కోవాలండీ''

"ఇప్పుడేగా మనం వ్యాపారం మొదలెట్టింది. ఒక సంవత్సరంపాటు అలాంటి వాటి మీదకు మోజు పోనివ్వకు. ముందు మన వ్యాపారం కాస్త స్థిరపడాలి. అంగడిలో సరుకు మరికాస్త పెంచాలి. ఆ తర్వాతే ఇంటికి ఏ వస్తువు కొనడమయినా''

సరోజ మౌనంగా ఉండిపోయింది.

సినిమాహాలు మరో ఫర్లాంగుదూరంలో ఉండగా శ్రీనివాసరావు భార్యతో "మీ అన్న ఏమన్నాడో తెలుసా?" అన్నాడు.

"ఏమన్నాడు?"

"మనం చాలా అదృష్టవంతులమట. మంచి సెంటర్‌లో రూమ్ దొరికిందట. రౌడీలు బెడద తప్పించుకున్నామట. వ్యాపారం బాగా సాగుతుందట... నిజంగానే మనం అదృష్టవంతులం"

"అవును'' అందామె.

★ ★ ★

వర్షం జోరుగా కురుస్తోంది.

వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుని, పడుతున్న చినుకులను చూస్తూ ఆనందిస్తున్నాడు శ్రీనివాసరావు.

అతడికిప్పుడు ఏ టెన్షనూ లేదు. ఏదో నష్టపోతామన్న భయం లేదు... ఒకరకమయిన నిశ్చింత.

పదినిముషాలు తర్వాత రవి వచ్చాడు. "అన్నయ్యా షాపు తాళాలు నేను తీసుకు వెళ్ళేదా?"

"ఈ వర్షానికి పెద్దగా వ్యాపారం జరగదు కదరా! నువ్వెళ్ళి షాపు తియ్యి. నేను మధ్యాహ్నం అటు వస్తాను''

"రేడియోలో తుఫాన్ హెచ్చరికలు చెపుతున్నారు''

"అలాగా'' అన్నాడు శ్రీనివాసరావు. అది పెద్దగా పట్టించుకోదగ్గ వార్తలా అనిపించలేదు. తుఫాన్ వచ్చినా, వరదొచ్చినా తనకేం నష్టం. నిశ్చింతగా చేసుకునే వ్యాపారం తనది "మరీ గాలి విసురు ఎక్కువగా ఉన్నా, ఒకవేళ నేను షాపుకి రాలేకపోయినా షట్టర్స్ దించి వచ్చేసెయ్యి'' తమ్ముడికి చెప్పాడు శ్రీనివాసరావు. తలూపాడు రవి.

షాపుకి చేరుకునేసరికి ఇరవై నిముషాలు పట్టింది. అప్పటికే సేల్స్‌బాయ్‌లు వచ్చి, పక్కనే ఉన్న టీకొట్టు ముందు నిలబడి ఉన్నారు.

అతడు షాపు షట్టర్స్ తెరిచాడు. ఒక కుర్రాడు షాపు మొత్తం చిమ్మాడు. మరొకడు షోకేస్‌లు తుడిచాడు.

రవి కేష్ కౌంటర్‌లో కూర్చున్నాడు. కుర్రాడిని పంపి టీ తెప్పించుకున్నాడు.

వర్షం జోరు హెచ్చింది. రోడ్డు మీద జనం పెద్దగా తిరగట్లేదు. మరీ అత్యవసర పనులు ఉండేవారు మాత్రం గొడుగు లేసుకుని సాగిపోతున్నారు.

అది జూన్ మాసం... వర్షాలు చాలా ముందుగానే మొదలయ్యాయి అనుకున్నాడు రవి.

వర్షాకాలంలో వ్యాపారం చాలా డల్‌గా ఉంటుంది. అయితే వర్షాకాలంలోనయినా శ్రావణమాసంలో బిజినెస్ ఊపందుకుంటుంది. శ్రావణమాసంలో పెళ్లిళ్ల ముహూర్తా




లుంటాయి. పెళ్లిళ్ల సీజన్‌లో వ్యాపారం బాగుంటుంది.

అతడు టీ కప్పు టేబుల్ మీద పెట్టాడు. అప్పుడే గుర్తొచ్చిందేమో, కేలండర్‌లో డేట్ కాగితం చించేందుకు అటువైపు తిరిగేడు. జూన్ 15వ తారీఖు కాగితం చించుతూ అనుకున్నాడు అతడు 'ఈ షాప్ ఓపెన్ చేసి ఈ రోజుకి సరిగ్గా సంవత్సరం రెండు నెలలయింది'

ఆ క్షణం అతడికి చాలా తృప్తిగా అనిపించింది. చాలు తమకు ఈపాటి డెవలప్‌మెంట్ చాలు. మనసులోనే అనుకున్నాడు అతడు.

ఈ సంవత్సరం రెండు నెలల్లో బిజినెస్ బాగా పెరిగింది. షాపులో సరుకు రెట్టింపయింది. షాపుకి పర్మనెంట్ కస్టమర్లు ఏర్పడ్డారు. ఎప్పుడో వర్షాకాలం, మరీ అన్‌సీజన్ అయితే తప్ప బిజినెస్ రెండు వేలకు తగ్గడం లేదు. షాపు సంవత్సరం టర్నోవర్ ఆరు లక్షలు.

మొదటి సంవత్సరం లక్ష రూపాయలదాకా మిగిలింది. ఆ డబ్బు విచ్చలవిడిగా లగ్జరీస్ కోసం ఖర్చుచేయకుండా షాపులోని సరుకు పెంచేందుకు ఉపయోగించారు. బొంబాయి, సూరత్‌లనుండి కొత్తకొత్త వెరైటీస్ తెచ్చి పెట్టారు. దాంతో షాపుకి మంచి పేరు వస్తోంది. బిజినెస్ రోజు రోజుకీ పెరుగుతోంది.

బిజినెస్ ఇలాగే మరో సంవత్సరం జరిగిపోతే వదినగారి కోరికలు చాలావరకూ తీరిపోతాయి. ఇంట్లోకి టి.వి., ఫ్రిజ్ వచ్చి చేరతాయి. తనకూ స్కూటర్ కొనుక్కోవాలని మనసులో ఉంది.

మధ్యాహ్నం ఒకటి దాటుతుండగా శ్రీనివాసరావు కేరియర్ తీసుకుని వచ్చాడు. "కాస్త ఆలస్యమయిందిరా! ఉయ్యూరునుండి నారాయణ వచ్చాడు. వాడితో మాట్లాడుతున్నాను. మీ వదిన నన్నూ భోంచేసి కేరియర్ తీసుకెళ్లమంది''

"ఫర్వాలేదులే' అన్న చేతిలోని కేరియర్ అందుకున్నాడు అతడు. "ఎప్పుడొచ్చాడు నారాయణన్న?"

"నువ్విటు షాపుకి రాగానే, తనటు బస్సు దిగి వచ్చాడు. ఏదో బాంక్ పని ఉందట. పశువుల లోన్ కోసం ప్రయత్నిస్తున్నట్టుంది''

"ఈ రోజు ఉంటాడా?"

"రాత్రికి ఉండమని చెప్పి వచ్చాను. ఉంటానన్నాడు''

రవి కేరియర్ తీసుకుని షాపులో ఓ మూలకి వెళుతూ, సేల్స్‌కుర్రాళ్లను భోజనానికి వెళ్లమన్నాడు. వాళ్లు గొడుగులేసుకుని వెళ్లిపోయారు.

అతడు ఐదు నిముషాలలో భోజనం ముగించాడు.

ఒక అర్ధగంట షాపులో ఉన్నాడు. బిజినెస్ లేకపోవడంతో ఏమీ తోచలేదు. వర్షం కాస్త తెరిపి ఇచ్చింది.

సెంటర్‌వైపు వెళ్లి వారం రోజులయింది. కాసేపు అటు వెళ్లివద్దామనుకున్నాడు అతడు.

"అన్నయ్యా! అలా సెంటర్ వరకూ వెళ్లి వస్తాను''

తలూపాడు శ్రీనివాసరావు. రవి గొడుగు చేతిలోకి తీసుకున్నాడు.

సెంటర్‌కి చేరుకునేవరకూ గొడుగు తెరవవలసిన అవసరం పడలేదు. కమలాకర్, ఆలీ ఉన్నారు సెంటర్‌లో.

"ఈ వర్షంలో మనవారెవరూ ఉండరనుకుంటూ వచ్చాను'' వారితో అన్నాడు రవి.

"మేమూ ఇటుగా రాలేదు. ఈ దారిన వెళ్తూ ఐదు నిముషాలు ఆగి వెళ్దామని నిలబడ్డాం"

"ఎక్కడినుండి వస్తున్నారేంటి?"

బయట నిలబెట్టి ఉన్న కొత్త స్కూటర్‌ని చూపించాడు ఆలీ. "ఈ రోజే ఇప్పుడే కొని తీసుకు వస్తున్నాను. పాతది అమ్మేసాను''

బ్లూ కలర్ వెస్పా స్కూటర్ చాలా బాగుంది.

"ఎంతయిందేమిట్రా?" అడిగాడు రవి.

చెప్పాడు ఆలీ.

"లోపలికెళ్దాం పద" కమలాకర్ కేంటీన్ లోపలికి నడిచాడు. అనుసరించారిద్దరూ. టేబుల్ ముందు కూర్చున్నాక ఆలీ బిస్కెట్స్ తెప్పించాడు. "ఏమిటీ! బిస్కెట్స్ ఇచ్చి సరి పెట్టాలని చూస్తున్నావా? స్కూటర్ కొన్న సందర్భంగా బార్‌లో పార్టీ ఇవ్వాల్సిందే''

"అలాగేలేరా! ఆదివారం రోజు అందరం కలిసి మందుపార్టీ చేసుకుందాం. ప్రస్తుతం మీరిద్దరేగా! బిస్కెట్స్, టీతో సరిపెట్టుకోండి'' కమలాకర్‌కి చెప్పాడు ఆలీ.

బిస్కెట్స్ తింటూ రవి అడిగాడు కమలాకర్‌ని "అదిసరే! నిన్నేదో పెళ్లి చూపులకు వెళ్లి వచ్చావని తెలిసింది. ఇదయినా ఓకేనా! కాదా?"

కమలాకర్ 'ప్చ్' అనేశాడు.

"ఏం?! అమ్మాయి, నువ్వు కోరుకునేంత గొప్ప అందగత్తెకాదా?"

తలూపాడు కమలాకర్. "రంగు చామన ఛాయ! మనకి తెల్లటి తెలుపు, అందమైన ముఖం, చక్కని స్ట్రక్చర్ ఉన్న అమ్మాయి కావాలి. బ్లాక్ బ్యూటీలు, ఛామనఛాయ రంగులు... నో! నేను పెళ్లయినా చేసుకోకుండా ఉంటానుగానీ, అందంగా లేని అమ్మాయిని మాత్రం చేసుకోను''

"నీలా ప్రతిజ్ఞలు చేసినవాడే తర్వాత అడ్జస్ట్ అయిపోయి, ముక్కూమొహం సరిగాలేని అమ్మాయిలను పెళ్లి చేసుకుంటాడు. ఇలాంటి కేసులు చాలా చూశాను నేను'' నవ్వుతూ అన్నాడు రవి.

సప్లయర్ కుర్రాడు టీ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు. ముగ్గురూ కప్పులు అందుకుని సిప్ చేయసాగారు.

ఊహల్లో ఏదో ఆకారం కనిపిస్తే దాని గురించి ఆలోచిస్తూ టైం వేస్ట్ చేయడం పిచ్చితనమనిపించింది. ఆ ఆలోచనను క్షణాల్లో పక్కకు నెట్టేశాడు అతడు. మరునిముషం మరచిపోయాడు. తిరిగి మిత్రులతో మాటలలో పడిపోయాడు.

ఒక గంటసేపు వారు కేంటీన్‌లోనే కూర్చుని బాతాఖానీ కొట్టారు.

"నేనిక వెళ్తానురా. షాపులో అన్నయ్య ఒక్కడే ఉన్నాడు''

ఆలీ తలూపుతూ అన్నట్టు నేను రేపు మీ షాపుకి రావాలిరా. నాలుగు షర్ట్ పీసెస్ తీసుకోవాలి'' చెప్పాడు.

"రేపు ఉదయమే రా!. నేను ఉంటాను... మొన్ననే బొంబాయి నుండి సరుకు వచ్చింది. మంచి వెరైటీస్ వచ్చి ఉన్నాయి''

"అలాగే రేపుదయం వస్తాను''

రవి షాపు వైపు నడిచాడు.

ఆరోజు కాస్త ముందుగానే షాపు మూసేసారు వారు.

★ ★ ★

ఆరు నెలలు గడిచాయి.

వారి సంపాదనాగ్రాఫ్ మరికాస్త పైకి వెళ్లింది.

శ్రీనివాసరావు కాస్త లావయ్యాడు. సరోజ మరింత తెల్లగా, అందంగా తయారయింది. పిల్లలు బొద్దుగా ముద్దుగా పెరుగుతున్నారు.

తమ కృషి, పట్టుదలలకు కాసింత అదృష్టం కలిసివచ్చి ఆ స్థితికి చేరుకున్నామనుకున్నారు. కుటుంబం సుఖసంతోషాలతో సాఫీగా సాగిపోతోంది. అలా అలా ఇంకా... ఇంకా మెరుగయిన స్థితికి చేరుకుని ఉండేవారే... ఓ విపరీత పరిణామం జరిగి ఉండి ఉండకపోతే!!

ఆరోజు ఉదయం శ్రీనివాసరావు వరండాలో కూర్చుని పేపర్ తెరిచాడు. విజయవాడకు వచ్చాక అతడికి ఉదయాన్నే పేపర్ చూడటం అలవాటయింది.

అది డిసెంబర్‌మాసం. చలి కాస్త ఎక్కువగానే ఉంది.

అప్పటికే అతడు రెండుసార్లు కాఫీ తాగా




డు. కాఫీ తాగితే వంట్లో కాస్త వేడిగా ఉంటుంది. చలికి తట్టుకునే శక్తి వచ్చినట్టని పిస్తుంది.

అతడు పేపర్ తిరగేస్తుంటే మొదటిపేజీ లోనే ఓ మూలగా కనిపించిందా వార్త

విజయవాడలోని ఓ రాజకీయ నాయకుడు 'సత్యాగ్రహం' చేస్తున్నాడు. కారణం...? ఏదో 'రాజకీయం'?

టౌన్‌లో అతనికి అనుచరగణం ఉంది. రాజకీయంగా రాష్ట్రస్థాయిలో కొంత గుర్తింపు ఉంది. రాష్ట్రప్రభుత్వంపైనే అతడి పోరాటం.

శ్రీనివాసరావు ఆ వార్తను చదివాడు. పెద్ద గా పట్టించుకోదగ్గ వార్తలా అనిపించలేదు. ముఖ్యమైన వార్తలన్నీ చదివాక పేపర్ పక్కన పడేశాడు.

సూర్యుడు తూర్పుదిక్కున నెత్తురుతో తడి సివున్న పసికందులా ఉన్నాడు. ఆకాశం చూ డరాని దృశ్యం చూసి రక్తం లేకుండా పాలిపో యిన మనిషి ముఖంలా తెల్లగా ఉంది.

శ్రీనివాసరావు వరండాలోనుండి లేచి ఇంట్లోకి వెళ్లాడు. సరోజ పాలు పితికి లోపలికి తీసుకువస్తోంది.

అతడు పెరడులోనికి వెళ్లి పశువులకు ఎండుగడ్డి వేశాడు. దూడలకు కుడితి తాగించి కట్టేశాడు.

"స్నానానికి నీళ్లు తోడేదా?" అడిగింది సరోజ పెరట్లోకి వచ్చి.

"రవి స్నానం చేశాడా?"

"లేదు... ముందు మీరు కానివ్వండి''

"సరే' అతడు ఇంట్లోకి వెళ్లి బ్రష్ నోట్లో వేసుకున్నాడు.

బాత్‌రూమ్‌లో నీళ్లు పెట్టాక ఆమె గోడకు ఆనుకుని నిలబడింది. "నిన్న నారాయణబావ దగ్గరనుండి వచ్చిన లెటర్ గురించి రవితో మాట్లాడారా?"

"లేదు... ఇప్పుడు టిఫిన్ చేసేటప్పుడు మాట్లాడుతాను''

ఉయ్యూరుకు పక్కనే ఉన్న కాకర్లకొండలో ఒక మంచి సంబంధం ఉందట. అమ్మాయి పదోతరగతి వరకూ చదువుకుంది. అందంగా ఉంటుంది. వాళ్లు లక్షరూపాయలు కట్నం ఇవ్వగల స్థితిపరులు... అని రాశాడు నారా యణ.

ఆ ఉత్తరం చూసి దంపతులిద్దరూ సంతోష పడ్డారు. అయితే రవితో ఇంకా ఆ విషయం ప్రస్తావించలేదు.

టిఫిన్ దగ్గర కూర్చున్నప్పుడు శ్రీనివా సరావు తమ్ముడితో ఆ ప్రస్తావన తీసుకువచ్చా డు. లెటర్‌లోని విషయాలన్నీ చెప్పి, తన అభిప్రాయం అడిగాడు.

"నా అభిప్రాయం ఏముందన్నయ్యా! మీ ఇష్టమే నా ఇష్టం"

"అలాకాదు... నువ్వు సరేనంటే ఏదయినా ఆదివారం మనం వెళ్లి ఆ అమ్మాయిని చూసివ ద్దాం. నీకోమాట చెప్పి నారాయణకు జాబు రాద్దామనుకుంటున్నాను''

"మీ ఇష్టం" చెప్పాడు రవి.

"అయితే ఆదివారంరోజు మనం ఉయ్యూ రు వెళ్లి, అక్కడినుండి నారాయణను తీసుకుని కాకర్లకొండకు వెళ్దాం. ఈ విషయం నారాయ ణకు తెలియచేస్తూ ఈ రోజే జాబు రాస్తాను''

తలూపాడు రవి. ఆ క్షణం అతడి కనుల ముందు ఓ అందమైన రూపం, అలా అలా కదలాడినట్లయింది.

"సరే! నువ్వు షాపుకి వెళ్లు, నేనలా పోస్టాఫీ సుకి వెళ్లి జాబు రాసేసి తర్వాత షాపుకి వస్తాను''

"అలాగే' అని రవి టిఫిన్ ముగించి లేచాడు. డ్రసప్ అయి బీరువామీదున్న షాపు తాళాలు చేతిలోకి తీసుకున్నాడు.

సైకిల్ తీసుకుని షాపువైపు వెళ్తుంటే, సెంటర్‌వైపు నడిచి వెళ్తున్న కమలాకర్ కని పించాడు.

"సెంటర్‌వైపేనా?"

"అవును"

"అక్కడ నిలబడి ఏం చేస్తావుగానీ, మా షాపుకి వెళ్దాం పద"

"సరే" సైకిల్ ఎక్కాడు కమలాకర్.

షాపు తెరిచాక రెండు టీలు తెప్పించాడు.

టీ చప్పరిస్తూ "రవీ! ఇంకా ఈ డొక్కు సైకి లేనట్రా... మన ఆలీ స్కూటర్ అమ్మేస్తానంటు న్నాడు. కొనుక్కోకూడదూ?" అన్నాడు కమ లాకర్.

"ఆలీ స్కూటర్ అమ్మేస్తున్నాడా?... ఎందు కని?"

"వాడికి హీరోహొండా బైక్‌మీద మనసు పోయింది. ఫైనాన్స్‌లో పదిరూపాయలు సంపాదిస్తున్నాడు. ఏదయినా కొనుక్కోగల డు"

"కొన్న ఆరునెలలకే అమ్మేస్తున్నాడే"

"రేట్ కూడా తగ్గించే చెపుతున్నాడు. ఈ ఆరునెలలు వాడుకున్నందుకు నాలుగువేలు తగ్గిస్తానంటున్నాడు"

"అయితే మా అన్నతో మాట్లాడతాను. అంత తగ్గించి ఇస్తుంటే కళ్లు మూసుకుని కొనుక్కోవచ్చు"

"నేను చెప్పేదీ అదే"

పదకొండింటికి శ్రీనివాసరావు షాపుకి వచ్చాడు. కమలాకర్‌ని "బాగున్నావా?" అని పలకరించాడు.

తలూపాడు కమలాకర్.

పది నిముషాల తర్వాత అతడు శ్రీనివాసరా వుకి కమలాకర్ చెప్పిన విషయం చెప్పాడు.

"స్కూటరా?" శ్రీనివాసరావు కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాడు. "ఇప్పుడు అంత పెట్టుబ డి వృధాచేయడం ఎందుకురా రవీ?"

"రోజూ అంతదూరం నుండి సైకిల్‌మీద రావాలంటే కష్టంగా ఉంది. అదీగాక మనం స్కూటర్ మెయిన్‌టెయిన్ చేయగలిగిన స్థి తిలో ఉండీ చేయలేకపోవడం..."

శ్రీనివాసరావు కొద్దిక్షణాలు ఆలోచించుకుని చెప్పాడు, "సరే! ముందు ఆ స్కూటర్ చూ సిరా. రాత్రికి విషయం మాట్లాడుకుందాం"

రవి, కమలాకర్‌ని వెంటబెట్టుకుని ఆలీ దగ్గరకు వెళ్లాడు.

ఆఫీసులో కాస్త బిజీగా ఉన్నాడు ఆలీ. మిత్రులను చూసి కూర్చోమని చెప్పి కాఫీ తెప్పించాడు.

ఎదురుగా ఉన్న వ్యక్తులను మాట్లాడి పంపాక, వారివంక తిరిగి "ఏమిటిలా వచ్చా రు? ఏదయినా విశేషమా?"

"నువ్వు స్కూటర్ అమ్ముతానన్నావటక దా! దానికోసం వచ్చాను"

"అవున్రా! బైక్ కొనుక్కుందామని పించింది. అందుకే దీన్ని అమ్మకానికి పెట్టా ను... ఏం నీకు కావాలా?"

"కావాలనేకదా ఇటు వచ్చింది" అన్నాడు కమలాకర్.

"నువ్వు నోర్మూయ్" కమలాకర్‌ని కసిరి, రవివైపు తిరిగి "చెప్పురవీ! ఆ స్కూటర్ నీకు కావాలా?"

తలూపాడు రవి.

"నేను ఎప్పుడు కొన్నానో నీకు తెలుసు. సింగిల్‌హేండ్ మెయిన్‌టెనెన్స్. బండి సూపర్ కండిషన్ అయినా హీరోహొండా మీద మోజుపుట్టి దీన్ని అమ్మేస్తున్నాను" అంటూ రేట్ చెప్పాడు ఆలీ.

రవి ఆలీని అడిగి స్కూటర్ తాళాలు తీసుకుని ఒక రౌండ్ వేశాడు. బండి బాగా నచ్చింది అతడికి "ఆలీ! నేను రేపు ఏ విషయమూ చెపుతాను. రేపటిలోపు ఎవ్వరికీ మాట ఇవ్వకు"

తలూపాడు ఆలీ.

అతడు షాపుకి వచ్చేశాడు.

ఆ రాత్రి భోజనాలకు కూర్చున్నప్పుడు శ్రీనివాసరావు భార్యతో స్కూటర్‌విషయం ప్ర





స్తావించాడు.

"పోనీలేండీ! తనేదో స్కూటర్‌మీద మనసు పడ్డాడు. మనమూ కొనుక్కోగలిగిన స్థితిలోనే ఉన్నాము. అందులోనూ రవికి ఈ సంవత్సరం పెళ్లిచేయాలనే ఉద్దేశ్యం ఉందాయె. పెళ్లికొడుక్కి స్కూటర్ ఉందంటే కట్నం మరింత అడిగేందుకు కూడా మనకు అవకాశం ఉంటుంది''

భార్య మాటలు విన్నాడు కాని అవి చెవిన వేసుకోలేదు. కేవలం తన స్థితి ఏమిటా అని ఆలోచిస్తున్నాడు శ్రీనివాసరావు. స్కూటర్‌వలన ఇబ్బందిరాదుకదా అని లెక్కలు వేసుకుంటున్నాడు. స్కూటర్ కొంటే మరో ఐదు వందలు ఖర్చు పెరుగుతుందని తెలుసు. కాని... తమ్ముడంటే తనకు చాలా ఇష్టం. ఈరోజు తామిలా నిశ్చింతగా ఉండగలుగుతున్నామంటే అదంతా రవి ప్రోద్బలంవల్లనే సాధ్యమయింది. అలాంటివాడు కోరక కోరక ఒక చిన్న కోరిక కోరితే తీర్చలేకపోవడం... శ్రీనివాసరావు ఆ రాత్రికి ఒక నిర్ణయానికి వచ్చేశాడు.

ఉదయం తమ్ముడికి చెప్పాడు "మధ్యాహ్నం కొంత డబ్బు ఇస్తాను. తీసుకెళ్లి ఆలీకి ఇవ్వు. మిగిలింది వారంరోజుల్లో సర్దుతానని చెప్పు''

రవి ముఖంలో ఒకరకమయిన కాంతి కనిపించింది.

"పిచ్చి సన్నాసి'' మనసులోనే అనుకున్నాడు శ్రీనివాసరావు తమ్ముడి ముఖంలోని కాంతి చూశాక.

మధ్యాహ్నం అతడు ఐదువేలు ఆలీ చేతిలో పెట్టి స్కూటర్ హేండోవర్ చేసుకున్నాడు. స్కూటర్‌తో తిన్నగా షాపుకి వెళ్లాడు.

శ్రీనివాసరావు తమ్ముడి చేతిలోని స్కూటర్ తాళాలు తీసుకున్నాడు. ఒక సంతృప్తికరమైన ఫీలింగ్ మనసంతా నిండిపోయింది. పల్లెను వదిలినా ప్రయోజకులయ్యారు. పట్నం వెళ్లి పాడయిపోయారనే అపప్రదరానివ్వలేదు. వ్యాపారం రెండింతలు చేశారు. స్కూటర్ కొనుక్కున్నారు. రేపోమాపో ఇంటి స్థలం కొనుక్కోబోతున్నారు. అభద్రతాభావంనుండి స్థిరత్వం సాధించడంలో విజయం పొందడం ఆనందదాయకమేకదా!

షాపు క్లోజ్ చేశాక అన్నదమ్ములిద్దరూ స్కూటర్‌మీద ఇంటికెళ్లారు.

"ఏయ్ సరోజా! ఇటు చూడు..." స్కూటర్ దిగకుండానే అరిచాడు శ్రీనివాసరావు.

అప్పటికే ఆమె స్కూటర్ శబ్దం వింది. హడావుడిగా బయటకు పరుగెత్తింది. పిల్లలు కూడా పడకమీదనుండి లేచి వచ్చేశారు.

తెల్లని వెన్నెలకాంతిలో నీలిరంగు స్కూటర్ తళతళా మెరిసిపోతూ కనిపించిందామె కళ్లకు.

పల్లెలో ఉన్నప్పుడు కలలోనయినా ఊహించనిది, పట్నం వచ్చాక సంవత్సరం ఆరునెలల్లో కనులముందు నిలిచి ఉంది. సరోజ స్కూటర్‌ని తనివితీరా చూసుకుంది.

ప్రశాంత్, సతీష్‌లు స్కూటర్ దగ్గరకు పరుగెత్తి "బాబాయ్! మమ్మల్ని అలా తిప్పవూ..." మారాం చేశారు.

"తప్పకుండా'' రవి వారిని స్కూటర్ ఎక్కించి రెండు రౌండ్స్ వేశాడు.

స్కూటర్ వరండాలో పదిలంగా పెట్టి, అందరూ లోపలికెళ్లారు.

★ ★ ★

"రవీ''

అది పిలుపుకాదు, అరుపు... శ్రీనివాసరావు అంత పెద్దగా కేకవేయడం అతడు ఎన్నడూ వినలేదు.

రవి నిద్రలోనుండి ఉలిక్కిపడి లేచి, లుంగీ సర్దుకుంటూ హాలులోకి పరుగెత్తాడు. శ్రీనివాసరావు ముఖంలో నెత్తురుచుక్కలేదు.

"ఏమైందన్నయ్యా''

'నిరాహారదీక్షలో ఉన్న ఆ వ్యక్తిని ఎవరో

హత్య చేశారట. వారి గ్రూప్ టౌన్ మొత్తం నాశనం చేస్తోంది. షాపులన్నీ లూటీ చేస్తున్నారు. త్వరగా స్కూటర్ తియ్యి. మన షాపు ఎలా..." అతడు మాట్లాడలేకపోతున్నాడు.

ఇద్దరూ బయటకు పరుగెత్తారు. సరోజ ముఖంలో అప్పటికే రక్తం ఇంకిపోయింది.

విజయవాడ పౌరులకు అది చాలా భయంకరమైన ఉదయం. తెలుగుగడ్డమీద అంతకుముందు లేని చరిత్ర మొదలయి నరోజు.

వారు రోడ్డుమీదకు అడుగుపెట్టడంతోనే, పరిస్థితి చాలావరకూ అర్థమయిపోయింది.

జనం అటు ఇటు కకావికలై పరుగెడుతున్నారు. సెంటర్‌లలోని షాపుల తాళాలు పగలగొట్టి ఉన్నాయి. అందులోని సరుకు లూటీ చేయబడింది. మిగిలింది ధ్వంసం చేసేశారు. బట్టలషాపులు తగలబడుతున్నాయి. బ్రాందీ షాపులముందు సీసాలు పగిలిఉన్నాయి. టి.వి. షాపులలో టి.వి. సెట్‌లు మాయమయ్యాయి. ఎటు చూసినా వ్యాపారస్తులు గగ్గోలు.

కొన్ని గంటల వ్యవధిలోనే విజయవాడ విధ్వంసమైపోయింది. హింస రచన... దగ్ధగీతం. దారుణం... ఘోరం... బలిజీవులు... అమాయకులు.

ఒక్కో సెంటర్‌లో పరిస్థితి చూస్తుంటే అన్నదమ్ములిద్దరికీ అంత ఉదయంపూటే చెమటలు పడుతున్నాయి. రవికయితే చేతులు వణుకుతున్నాయి.

అప్పటికే విధ్వంసం వార్త పట్టణమంతా పాకిపోయినట్టుంది. షాపు యజమానులు పరుగెత్తుకొస్తున్నారు. ధ్వంసమయిన తమ ఆధారం ముందు హాహాకారాలు చేస్తున్నారు.

రవి స్కూటర్ వారి సెంటర్ చేరింది. దూరంనుండే కనిపించింది.

అతడు స్కూటర్‌కి స్టాండ్ కూడా వేయలేదు. అలాగే వదిలేశాడు. తడబడే అడుగులతో, కన్నుల రెప్పలు వాల్చకుండా అటు వెళ్లాడు.

రాత్రి వేసిన తాళాలు ఊడి పక్కన పడివున్నాయి. షట్టర్స్ సగం పైకిలేచి ఉన్నాయి.

లోపలికెళితే... షాపంతా బోసిగా...

సుమారుగా రెండు లక్షల రూపాయల సరుకు! కొంత లూటీ చేశారు. మరికొంత విస్కీపోసి తగలబెట్టారు.

శ్రీనివాసరావుకి నిలబడే ఓపిక లేకపోయిందేమో! అలాగే కింద కూలబడ్డాడు. కంటినీరు బుగ్గలమీదకు జారింది.

"నేను వారికి చేసిన ద్రోహమేమిటి? నేను ఏ వర్గానికీ చెందని వ్యక్తిని. నా షాపు ధ్వంసం చేయటమేమిటి? హే భగవాన్! ఇప్పుడు నా పరిస్థితి ఏమిటి?"

పక్కనే టి.వి. షాపు! ఆ షాపులో టి.వి.లన్నీ ఎత్తుకెళ్లిపోయారు. ఎదురుగా ప్రొవిజన్ స్టోర్! కందిపప్పు బస్తాలు, ఖరీదయిన సబ్బులు మాయమయ్యాయి. చెప్పులషాపు ముందు ఎటు చూసినా చెప్పులే. విధ్వంస దృశ్యం!

మానవుడిలో మృగం బయటపడినవేళ! సాటి మనిషి స్థితి ఆలోచించకుండా స్వార్థం విజృంభించిన సమయం. అవకాశం దొరికితే పట్టణ ప్రజలు ఎంత ఘోరం చేయగలరో నిరూపించిన క్షణాలు.

రవి పిడికిలి బిగించి నిస్సహాయంగా టేబుల్‌మీద కొట్టాడు. అంతకన్నా తను మరేం చేయగలడు. ఇంత ఘోరానికి కారకులయిన వ్యక్తులను ఏమీ చేయలేడు.

సూర్యుడు మెలమెల్లగా పైకి వస్తున్నాడు. అప్పటికే కొందరి జీవితాలకు చీకటి తెరపడిపోయింది.

అవసరానికి పనికిరాని పోలీసులు అప్పుడు రంగంలోకి దిగారు. ఇంకా విధ్వంసం సాగిస్తున్న అరాచకవాదుల్ని, అదుపులో పెట్టసాగారు. ఎంత అదుపు చేసినా ఏదో మూల విధ్వంసం జరుగుతూనే ఉంది. పట్టణమంతా భయంకర పరిస్థితి.




పదింటికి కూడా అన్నదమ్ములిద్దరూ ఇంటికి తిరిగి రాకపోయేసరికి సరోజ కంగారు మరింత ఎక్కువయింది. అప్పటికే ఇరుగుపొరుగువారి ద్వారా పరిస్థితి విన్నదామె. విధ్వంసంలో తమ షాపు కూడా ఒక భాగం కాకూడదని వేయిదేవుళ్లకు మొక్కుకుంది. తన వారు ఎంత సేపటికీ తిరిగిరాలేదని ఆమె షాపు దగ్గరకు బయలుదేరింది.

బస్సులు, ఆటోలు తిరగడంలేదు. కాలుతున్న శవాల కమురుకంపును అగరొత్తుల పొగలా ఆస్వాదించగలిగే జనాలు- పట్టణప్రజలు రోడ్డుమీద అటుఇటు పరిగెడుతూనే ఉన్నారు. అవకాశం దొరికితే సరికొంత దోచుకునే ఉద్దేశంతో ఉన్నారు.

ఆమె నడుచుకుంటూనే షాపువరకూ వెళ్లింది. అటు చూడగనే గుండె జారిపోయింది. మెదడు మొద్దుబారిపోయింది. ఏదయితే జరగకూడదని దేవుళ్ళందరికీ మొక్కుకుందో, అది జరిగిపోయింది. ఏ దేవుడూ ఆమె మొర ఆలకించినట్టులేదు.

తన భుజంమీద వాలిన చేతి సుపరిచిత స్పర్శకు శ్రీనివాసరావు తలెత్తి చూశాడు. భార్యను చూడడంతోనే అతడి కన్నులు మరింతగా వర్షించసాగాయి. ఆమె మాత్రం దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. భర్తను పట్టుకుని బావురుమంది.

తమ బతుకుకు ఆధారం, భవిష్యత్‌కు మూలం... ఒక్కరాత్రికే ధ్వంసమయిపోయింది.

షాపులో ఒక్క మీటరు గుడ్డ కూడా మిగల్లేదు.

"మనం... మనం ఎవరికేం అన్యాయం చేశామండి, మన బ్రతుకుని ఇలా నాశనం చేశారూ?"

ఆమె ప్రశ్నకు అతడు మాత్రం ఏం సమాధానం చెప్పగలడు. అతనికి అర్థమయిందొక్కటే- 'తమ బతుకు బజారున పడింది' అంతే! అందుకు కారణం ఎవరు ఏమిటి? అన్నది అతడిప్పుడు ఆలోచించడంలేదు.

మధ్యాహ్నంవరకూ ముగ్గురూ అక్కడే దిగాలుగా కూర్చున్నారు. అక్కడ అందరూ బాధితులే! ఒకరినొకరు ఓదార్చేవారెవరూ లేరు.

శ్రీనివాసరావుకి అప్పుడు గుర్తొచ్చింది. 'పిల్లలు ఇంటి దగ్గరే ఉన్నారు' అతడు చెప్పాడు. "సరోజా! నువ్వు ఇంటికెళ్లు''

"మీరు మాత్రం ఇక్కడ ఉండి చేసేదేముంది? రండి ఇంటికెళదాం?"

అతడు తల అడ్డంగా ఆడించాడు "నువ్వెళ్లు''

"మీరు ఉదయంనుండి ఏమీ తీసుకోలేదు. రవిని చూడండి. ముఖం ఎలా పీక్కుపోయిందో'

శ్రీనివాసరావు అప్పటివరకూ తన లోకంలో తను ఉన్నాడు. అప్పుడే తొలిసారిగా తమ్ముణ్ణి చూశాడు. రవి తనకన్నా ఎక్కువగా కుంగిపోయినట్టు అనిపించింది. 'పాపం! ఈ షాపుకోసం అనుక్షణం ఆలోచించిన కుర్రాడు. ఎక్కువగా శ్రమపడి వృద్ధిలోకి తెచ్చినవాడు... అతడికిది పెంచినబిడ్డ మరణంలాంటిది''

"రవీ! రా బాబూ ఇంటికెళదాం"

అతడు వారిద్దరివంకా అయోమయంగా చూశాడు. అతనింకా షాక్‌లోనుండి బయటపడలేదని అర్థమయింది వారికి. ఎలాగోలా అతడిని ఓదార్చి ఈ లోకంలోకి తీసుకొచ్చారు.

షాపు షట్టర్ దించేసి, తాళం తగిలించి ముగ్గురూ ఇంటిదారి పట్టారు. ఇంటికెళ్లాక అన్నదమ్ములిద్దరూ వారి గదుల్లోకి వెళ్లి మంచాలమీద వాలిపోయారు.

పిల్లలు ఆకలికి అల్లాడుతున్నారని తెలిసి, ఆమె మాత్రం వంట ప్రయత్నంచేసి పిల్లలకు రెండు ముద్దలు పెట్టింది.

వారిద్దరినీ పిలిచి పిలిచి అలసిపోయిందే



తప్పు, వారు గదిలోనుండి బయటకు రాలేదు. కనీసం ముఖం కూడా కడుక్కోలేదు.

ఆ రాత్రికి ఆమె మరీ బలవంతం చేయ డంతో ఏదో ఎంగిలి పడ్డామనిపించారు.

విజయవాడ పట్టణమంతా కర్ఫ్యూ పెట్టా రు. రోడ్డుమీద జనప్రవాహం తగ్గిపోయింది.

పోలీసు రిపోర్టులు, ఆస్తినష్టం వివరాలు.

ఎన్నికోట్ల ఆస్తి నష్టం జరిగిందో ప్రభుత్వం ప్రకటించిందిగానీ, ఎన్ని కుటుంబాలు జీవనా ధారం కోల్పోయి వీధినపడ్డాయో ఎవ్వరూ లెక్కించలేదు.

చిన్ని... చిన్ని.. ఆశలతో పల్లెనుండి పట్నం వచ్చి ఏదో పదిరూపాయలు గడించాలనుకు న్న ఆ కుటుంబం మాత్రం జీవనాధారం కోల్పోయి పూర్తిగా వీధినబడింది.

ఆ రాత్రి వారికి కాళరాత్రి అయింది. ఆ కుటుంబంలోని ముగ్గురూ ఆ రాత్రంతా ఆలో చనల్లోనే గడిపారు.

ఈ లూటీతో తమ పెట్టుబడి, ఆదాయం మొత్తం కోల్పోవడమే కాదు, సుమారుగా యాభైవేల రూపాయలకు అప్పు తేలుతుంది. ఈ యాభైవేలు ఎలా కట్టాలి?

షాపులోని సరుకు ఇన్సూర్ చేసిలేదు. లూటీ చేయబడ్డ సరుకు తిరిగి వస్తుందన్న ఆశలేదు. ఆ అప్పు మొత్తం తమ నెత్తిమీద బరువుగా మారిందిప్పుడు. వారిది జీవన్మరణ సమస్య!

★ ★ ★

కర్ఫ్యూ తొలగించబడ్డాక, విజయవాడలో ప్రశాంత పరిస్థితులు నెలకొన్నాక బొంబాయి, సూరత్‌లనుండి హోల్‌సేల్ వ్యాపారులు వచ్చి అక్కడ తిష్టవేశారు.

వారికి అక్కడి పరిస్థితి కనులముందు కనిపిస్తూనే ఉంది. అయినా వారు వ్యాపారు లు! శవంమీది బట్టలు కూడా జమ చేసుకోగలి గిన సమర్థులు. వారు స్థానిక వ్యాపారులను వత్తిడి చేయసాగారు. కొందరు 'ఇన్ సాపర్ పిటీషన్ పెట్టేశారు.

శ్రీనివాసరావుకి ఆ పని చేసేందుకు మన స్కరించలేదు. 'నేను దరిద్రుడినని' చాటింపు వేసుకోవలసి రావడం... ఆత్మాభిమానం ఉన్న వారు బాధపడే విషయమే. అయినా తన దగ్గర చెల్లించేందుకు ఏముంది? పక్క షాపుల వారి బలవంతంతో అతడూ ఐ.పి. పెట్టక తప్పలేదు. కట్టవలసిన పెద్ద మొత్తాలు ఆవి ధంగా కట్టకుండా తప్పిపోయాయి. ఇక చిల్లర అప్పులు.

రవి స్కూటర్‌ని తీసుకెళ్ళి ఆలీకి ఇచ్చేశాడు. "ఆలీ! జరిగిందేమిటో నీకు తెలుసు. మా బిజినెస్ పూర్తిగా దెబ్బతింది. ఈ దెబ్బనుండి మేము కోలుకోగలమన్న నమ్మకం కూడా కుదరట్లేదు. నేనిప్పుడు స్కూటర్ మెయిన్ టెన్ చేసే స్థితిలో లేను. నీ స్కూటర్ నువ్వు తీసేసుకో"

ఆలీ చాలా బాధపడుతున్నట్టు, ము ఖంలోని ఫీలింగ్స్ చూసి గుర్తించాడు అతడు.

"రవీ! స్కూటర్‌కి మిగిలిన డబ్బు చె ల్లించేందుకు, వారంరోజుల గడువు అడిగావు. వారం కాదు, నెలరోజులయినా ఫర్వాలా! నిన్ను ఇప్పుడు ఇబ్బంది పెట్టను సరేనా''

"నెలకాదు, రెండునెలలకయినా నాకు డబ్బు వచ్చేమార్గం ఏముంది 'ఆలీ? రేపటి నుండి మా కుటుంబం గడవడం ఎలా అన్న పెద్ద సమస్య ముందుంది. ఇక స్కూటర్ తీసుకెళ్ళినా నెత్తిన పెట్టుకోవలసిందే. పెట్రోల్ పట్టించే శక్తి కూడా లేదు నాకిప్పుడు''

ఆలీ దీర్ఘంగా నిట్టూర్చాడు.

రవి మిత్రుడి చేతిలో స్కూటర్ తాళాలు ఉంచాడు. వాటిని చాలా అయిష్టంగానే అందు కున్నాడు ఆలీ.

"ఏమిటో! ఏరోజు ఏం జరగబోతుందో, ఎవ్వరూ చెప్పలేరు''

'నిజమే' అనుకున్నాడు రవి. నాలుగురో జుల క్రితంవరకూ తనీస్థితి కలలో కూడా ఊహించలేదు. 'ఊహించనిది జరగడమే




జీవితం అని తనకిప్పుడే తెలిసివస్తోంది.

"అసలు మీరు ఆ పల్లె విడిచిరావడం నాకిష్టంలేదు. విజయవాడకు రావద్దని కూడా నీతో చెప్పాను. నువ్వు వినలేదు. నాకు తెలుసు- వ్యాపారమంటేనే రిస్కుతో కూడుకున్నది. ఏ క్షణం ఏం జరుగుతుందో ఊహించలేం. పల్లెజీవితంలో ఇలాంటి హఠాత్ పరిణామాలు సంభవించడం చాలా అరుదు. అసలు పల్లెజీవితమంటేనే ప్రశాంతమయింది. రిస్కులేనిదీనూ"

"కొన్ని నిజాలు చాలా ఆలస్యంగా అర్థమవుతాయి. అయితే అప్పటికే జరగవలసినదేదో జరిగిపోతుంది"

"ఇప్పుడేం చేయాలనుకుంటున్నారు? మళ్ళీ ఆ షాపు ఓపెన్ చేయాలనుకుంటున్నారా?"

"ఆ షాపు ఓపెన్ చేయాలంటే మళ్ళీ ఇప్పుడు లక్షరూపాయలు పెట్టుబడి కావాలి. మా దగ్గర అంత పెట్టుబడిలేదు"

"మరేం చేయాలని?"

"అది ఇంకా నిర్ణయించుకోలేదు"

ఆలీ కొద్దినిముషాలు నిశ్శబ్దంగా ఉన్నాక చెప్పాడు" రవీ! మీరు ఏదయినా బిజినెస్ చేయాలనుకుంటే నాకు చెప్పు. నీకు వీలయినంత సహాయం చేస్తాను. నా ఫైనాన్స్ కంపెనీలో పదివేలయినా, పాతికవేలయినా తీసి ఇస్తాను. ఏదయినా స్టార్ట్ చెయ్యి"

పదివేలతో పాతికవేలతో తిరిగి బట్టల వ్యాపారం స్టార్ట్ చేయలేమని అతడికి తెలుసు. ఆ డబ్బుకి ఏ కేంటీన్ పక్కనో బడ్డీకొట్టు పెట్టుకోవచ్చు. అయితే ఊహుఁ! పూలమ్మినచోట కట్టెలు అమ్మవలసిరావడం... తను చేయలేడా పని.

"సరే రవీ! రెండురోజులలో నీకు ఐదువేలు చేరుస్తాను. తర్వాత నీకెప్పుడయినా డబ్బు అవసరపడితే నన్ను అడుగు"

అతడు ఆలీవంక కొద్దిక్షణాలు అదోలా చూశాడు.

రవికి కాలేజీలో చేరినప్పుడే మతాభిమానం కొద్దిగా తలకెక్కింది. తన మతం అంటే అతడికి చాలా గర్వం కలిగింది. 'హిందువుగా పుట్టినందుకు నేను గర్వపడుతున్నాను' అనుకునేవాడు. అయితే ఎలా కలిసిందో- ఆ మిత్రబృందానికి ఆలీతో స్నేహం కుదిరింది. 'సాయబు' అని తొలుత సంకోచించినా తర్వాత బాగా దగ్గరకు తీశారు.

అయితే అప్పుడప్పుడూ వారిలో ఎవరో ఒకరు ఆలీ మతాన్ని ఎద్దేవా చేసేవారు.

"మీ సాయబులు మహా మొండివాళ్లు. తాము పట్టిన కుందేటికి మూడేకాళ్లు అంటారు"

"ఈ సృష్టిలో పుట్టిన ప్రాణులన్నీ మనుష్యులు తినేందుకే అనే భావాలున్న మతం మీది. కసాయితనం మీ సొత్తు"

"మా హిందువులు మంచివాళ్లు కాబట్టే మీరింకా ఈ దేశంలో ఉంటున్నారు. లేకపోతే మీరంతా ఈ దేశం వదిలి పాకిస్తాన్‌కి పోవలసినవాళ్లు తెలుసా?"

ఆలీ మిత్రుల ఎద్దేవాలను నవ్వుతూనే వినేవాడు. ఎప్పుడూ కోపగించుకునేవాడు కాదు. అలా ఎద్దేవా చేసినవారిలో తనూ ఉన్నాడు.

కాని ఇప్పుడు ఆలీ చూపిస్తున్న మానవత్వం... మతం అనేది మనిషి ధరించి ఉన్నపెఱుసు మాత్రమేనని అర్థమవుతూ ఉంది.

"ఏంటలా చూస్తున్నావు?"

రవి తల అడ్డంగా ఊపాడు. "ఏమీలేదు" అతడు అక్కడనుండి లేచి వచ్చేశాడు.

అక్కడినుండి కేంటీన్‌వైపు వెళ్ళాడు. సెంటర్‌లో తన మిత్రులెవరూ లేరు.

ప్రసాద్ కుటుంబం కూడా ఈ సంఘటనతో బాగా దెబ్బతిన్నది. బీసెంట్ రోడ్‌లోని వారి షాపు ధ్వంసమయిపోయింది. అందులోని బట్టలు రెండురోజులపాటు తగలబడుతూనే ఉన్నాయని చెప్పుకున్నారు. వారికి వేరే స్థిరా

స్తులున్నాయి. కొద్దికాలం తర్వాత కోలుకోవచ్చు. అయినా ఆర్థికంగా ఇది పెద్దదెబ్బ.

ఈ సంఘటనతో విజయవాడలోని కొన్ని వందల కుటుంబాలు బతుకుతెరువు కోల్పోయి వీధినపడ్డారన్నది మాత్రం వాస్తవం.

అతడు ఒంటరిగా కాసేపు కేంటీన్‌లో కూర్చుని ఇంటివైపు నడిచాడు.

గత పదిరోజులుగా ఇంట్లో శ్మశాన నిశ్శబ్దం కదలాడుతోంది. ఒకరినొకరు పలకరించుకోవడం అరుదయింది. ఏదో వేళకింత అయిష్టంగా తినడం, తోచినంతసేపు గదిలో పడుకుని ఉండడం- ఏమీ తోచకపోతే బజారువైపు వెళ్ళటం, అన్నదమ్ములిద్దరికీ అలవాటయింది.

రెండురోజుల తర్వాత ఆలీ డబ్బు తెచ్చిచ్చాడు. వాటిని చిల్లర అప్పులకు జమ చేసేశారు.

తమ షాపు లూటీ చేయబడ్డ విషయం ఉయ్యూరులోని బంధుమిత్రులందరికీ తెలిసిపోయింది. పరామర్శ కోసం ఒక్కొక్కరే రాసాగారు. వారి మాటలు, జాలిచూపులు కంపరం కలిగిస్తున్నా తప్పడంలేదు. వారి మనసులోని మాట అర్థమవుతూనే ఉంది వారికి. 'అత్యాశతో పట్నం వచ్చి నష్టపోయా'రని. దెబ్బతిన్న వ్యక్తిమీద సానుభూతి వ్యక్తం చేయడంతోపాటు, తప్పొప్పులు వేలెత్తి చూపించడం సహజమే! విచిత్రమేమిటంటే- వేలెత్తిచూపించే ఈ జనంలో ఒక్కరూ తప్పు సరిదిద్దుకునేందుకు ఏమాత్రం సహాయం చేయరు. చిత్రమయిన ప్రపంచం.

నారాయణ వచ్చాడు. అలాంటి ఘోరం జరిగినందుకు మనస్ఫూర్తిగా బాధపడ్డాడు. "మరేం చేయాలనుకుంటున్నారు?" అంటూ ఆరాగా ప్రశ్నించాడు. జవాబు వారి దగ్గర ఏముంది? తను కూతురి పెళ్ళిచేసి అప్పులపాలయి ఉన్నానని లేకుంటే, కొంత సహాయం చేసి ఉండేవాడినన్నాడు. నారాయణది సహాయం చేయగలిగిన పరిస్థితే అయితే, చేసి ఉండేవాడని వారందరికి తెలుసు.

ఆయన కాకర్లకొండ సంబంధం గురించి ఏమయినా చెపుతాడేమోనని ముగ్గురూ ఎదురుచూశారు. నారాయణ నోటివెంట ఆ టాపిక్ రానేలేదు.

ఆదివారంరోజు పెళ్లిచూపులకు వెళ్ళాలనుకుంటున్నప్పుడు, ఆ ఘోరం జరిగిపోయింది. విషయం వారికి తెలిసిపోయి ఉంటుంది. వ్యాపారం చేసుకునేవాడికయితే సరే, వీధిన నిలబడ్డవాడికి లక్షరూపాయలు కాదు, లక్ష పైసలయినా ఇచ్చి పిల్లనిచ్చేందుకు ముందుకు వచ్చేవారెవరు?

అంత బాధలోనూ రవికి నవ్వొచ్చింది. "తన పిచ్చిగానీ, దెబ్బతిని వీధినబడి ఉన్న తనకు పిల్లనిచ్చేవారున్నారా?"

సాయంత్రంవరకూ ఉండి, వెళ్లిపోయాడు నారాయణ.

తనకిప్పుడు పెళ్ళి-గిళ్ళీ ఇవి కాదు కావలసింది. కాళ్ళమీద నిలబడాలి. వీధినబడి ఉన్న కుటుంబానికి ఆశ్రయం కల్పించాలి. ఒకవిధంగా ఈ అనర్థానికి కారణం తనే! హాయిగా సేద్యం చేసుకుంటున్న అన్నయ్యకు లేనిపోని ఆశలు కల్పించి పట్నం తీసుకువచ్చాడు. ఆయనను, ఆయన పిల్లలను నడివీధిలో నిలబెట్టాడు... లేదు. వారు దరిద్రంతో బాధపడకూడదు.

అన్నయ్య మంచివాడు శ్రమజీవి కానీ ఆయనకు లోకజ్ఞానం తక్కువ. ఈ విశాల ప్రపంచంలో బతికేందుకు తొలుత ఆయనకు తెలిసింది వ్యవసాయం, ఇప్పుడీ బట్టల వ్యాపారం. కానీ ఈ వ్యాపారం ఇప్పుడు సాగించడం సాధ్యమయ్యే పని కాదు. తామిద్దరికీ ఇప్పుడు పని కావాలి. కనీసం తనకయినా ముందు ఏదయినా పని దొరికితే...

రవికి ఇంట్లో ఏమీ తోచలేదు.

అతడు దగ్గరలోనే ఉన్న పార్క్‌కి వెళ్లాడు. పచ్చికలో వెల్లకిలా పడుకున్నాడు.

ఆకాశం వంటికి ఎవరో మసి రాస్తున్నారు.




లేకపోతే విజయవాడలో ఎగసిన మంటలకు ఆకాశం కమిలి నల్లబడిపోతోందేమో!

అతడు ఆకాశంలోని నక్షత్రాలు లెక్కపెట్టేందుకు ప్రయత్నించాడు. ఎంతకూ లెక్కపూర్తికావడంలేదు. విసుగేసింది.

ఇంటికెళ్లాలని లేదు. కానీ వెళ్లక తప్పదు. అతడు పైకి లేచాడు. అడుగులు నీరసంగా ఇంటివైపు పడ్డాయి.

వరండాలో కూర్చుని ఉన్న శ్రీనివాసరావు పలకరించాడు "ఎక్కడికెళ్లావు రవీ?"

"అలా సెంటర్ వరకూ వెళ్లాను'' అతడు అన్న పక్కనే ఉన్న మరో కుర్చీలో కూర్చున్నాడు.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం! అది కొద్దిసేపే కావచ్చు. కాని వారికా స్థితి ఈమధ్య ఏర్పడలేదు.

"ఆ షాపు ఉంచుకుందామా, లేక...?"

"ఉంచుకుని చేయగలిగిందేముంది? బట్టల కొట్టు కాక కిరాణాకొట్టు పెట్టాలన్నా యాభైవేలు కావాలి. మన దగ్గర అంత డబ్బెక్కడిది? రేపెళ్లి కొట్టుకిచ్చిన అడ్వాన్స్ ఇచ్చేయమని చెప్పి వస్తాను ఏమంటారు?"

శ్రీనివాసరావు కొద్దిక్షణాలు ఆలోచించి "అదేమంచిది'' చెప్పాడు.

పదివేలు చేతికొస్తాయి. లక్ష రూపాయలు చేతపట్టుకుని విజయవాడ వచ్చి సంవత్సరం ఆరు నెలలకు పైగా లాభాలతో వ్యాపారం చేస్తే చివరికి మిగిలింది ఆ పదివేలు!... నవ్వాలో, ఏడవాలో తెలియని పొజిషన్ తమది... అనుకున్నాడు శ్రీనివాసరావు.

"నారాయణ వెళ్తూ ఒక సలహా చెప్పాడు''

రవి అన్నవంక చూశాడు. శ్రీనివాసరావు తడబాటుతో చెప్పాడు. "మనల్ని తిరిగి ఉయ్యూరు వచ్చేయమంటున్నాడు నారాయణ. జరిగిందేదో జరిగిపోయింది. విజయవాడకు వచ్చి ఒక లక్ష రూపాయలు పోగొట్టుకోవాలని రాసి ఉండింది. అదలా జరిగిపోయింది... మనం ఇప్పుడు ఉయ్యూరుకి వెళితే తను నాలుగెకరాలు కౌలుకి తీసిస్తాడట. మన ఇల్లు ఎలాగూ ఉంది. అది అమ్మకుండా ఉంచడం మంచిదయిందంటున్నాడు''

మాటల మధ్య తమ్ముడి ముఖంలోనికి చూశాడు శ్రీనివాసరావు. అతడి నోట మాటలు బయటకురాలేదు.

రవి పెదవులు బిగపట్టి ఉన్నాడు. తను పలికిన ప్రతిమాటా తమ్ముడి మనసుకు తూటాలా తగులుతోందని అర్థమయింది అతడికి.

అతడు మరింత తడబాటుతో "నేను నారాయణకు మాటేమీ ఇవ్వలేదు. వస్తానని, రానని చెప్పలేదు. తను చెపుతుంటే ఊం! కొడుతుండిపోయాను'' అన్నాడు.

రవి మాట్లాడలేదు. తనే తిరిగి చెప్పాడు "అయినా అంతా పోగొట్టుకుని సొంత ఊరు వెళితే, అందరూ మనవంక ఎగతాళిగా చూడరా. అంతకన్నా కష్టమో, నష్టమో ఇక్కడే తేల్చుకోవడం మంచిదని అనిపిస్తోంది. కానీ... నారాయణ చెప్పిన మాటలు నీకు చెపితే నువ్వేమంటావోనని చెప్పాను అంతే''

అన్న మనసులో ఎంత వ్యధ ఉందో అర్థం చేసుకోలేనంత మూర్ఖుడు కాడు రవి. శ్రీనివాసరావులోని మానసిక సంఘర్షణ అర్థమవుతూనే ఉంది. విజయవాడ పరిస్థితులకు ఆయన బాగా భయపడిపోయాడు. పల్లెకు వెళ్లి ప్రశాంతంగా బతకాలని మనసు పీకుతున్నట్టుంది. అయితే... తన ముఖంలోని బాధ చూసి మాట మార్చాడు.

పల్లెకు వెళ్లడం మంచిదేనని తనకిప్పుడు అనిపిస్తోంది. కానీ ఇలాంటి పరిస్థితులలో వెళ్లడం పరువు తక్కువ అని తన ఉద్దేశ్యం. అందుకే ఆ ఆలోచనను వ్యతిరేకిస్తున్నాడు.

"అన్నయ్యా! మరికొద్దిరోజులపాటు మీరేమీ ఆలోచించకండి. ఇంత పెద్ద పట్టణంలో మన బతుకు తెరువుకు ఏదో ఆధారం దొరక్కపోదు. కాస్త నిలదొక్కుకుంటే...త్వరలోనే మనం పోగొట్టుకున్నది మనం సంపా

దించుకోవచ్చు. కాస్త సంపాదించుకున్నాక ఆ రోజు పల్లెకే వెళ్లాలనిపిస్తే వెళ్దాం"

తమ్ముడి మాటలకు నిశ్శబ్దంగా తలూపాడు అతడు. అంతకన్నా చేయగలిగింది మరేం లేదని అతడికి అర్థమయింది.

సరోజకు కూడా విజయవాడ వదలడం ఇష్టంలేదని ఆ రాత్రి పడుకున్నాక, మాటలమధ్య తెలుసుకున్నాడు శ్రీనివాసరావు. ఈ పరిస్థితిలో పల్లెకు పోవడమంటే పరువు పోగొట్టుకోవడమేనని అతడికీ తెలుసు. ఏం చేయాలో పాలుపోని స్థితి! రవి చెప్పినట్టు కొద్ది రోజులపా



టు ఏమీ ఆలోచించకుండా కాలం గడిపేస్తే ఆ తర్వాత దైవనిర్ణయం ఎలా ఉంటే అలా సాగుతుంది.

గుండెను నిబ్బరపరచుకున్నాడు అతడు.

* * *

రవికి ప్రస్తుత సమాజ పరిస్థితి పూర్తిగా తెలియదనే చెప్పాలి. ఏదో అదృష్టం వెన్నంటి రావడంతో వ్యాపారంలో సక్సస్ అయ్యాడే. గానీ, వ్యవస్థ తీరుతెన్నులు బాగా అర్థం చేసుకోలేదు. ఇంత పెద్ద పట్టణంలో బతుకు



తెరువుకు ఆధారం దొరక్కపోతుందా?! అని విశ్వసించాడేగానీ, పట్టణంలోని యువత నిరుద్యోగంతో ఎంతగా క్రుంగిపోతోందో తెలుసుకోలేకపోయాడు.

పరిస్థితుల అవగాహనా లోపంతోపాటు, శృతిమించిన ఆత్మవిశ్వాసంతో అతడు తొలిసారిగా జీవనపోరాటంలో అడుగుపెట్టాడు. ప్రకటించిన ప్రతి ఉద్యోగానికీ అప్లయ్ చేశాడు. తన మిత్రులందరికి కూడా చెప్పాడు 'మంచి ఉద్యోగం ఉంటే చూడండి. నెలకో వెయ్యి రూపాయలొచ్చినా మా కుటుంబం జరిగిపోతుంది'. చూద్దాంలే అన్నారు వారు. అలా అన్న వారెవరికీ ఉద్యోగంలేదు. తమకి తామే వెతుక్కోలేనివారు మరొకరికి ఉద్యోగం చూపించడం... అదంతా ఆలోచించే స్థితిలో లేడు అతడు. తనకి అర్జంట్‌గా ఏదో ఒక పని కావాలి. దొరుకుతుందనే అనుకున్నాడు.

మరోపక్క-

రోజురోజుకి కుటుంబ పరిస్థితి దిగజారసాగింది. శ్రీనివాసరావుకి పనేం లేకపోవడంతో గోళ్లు గిల్లుకుంటూ ఇంట్లో కూర్చుని ఉన్నాడు. అతడి జీవితంలో అలాంటి స్థితి మునుపెన్నడూ లేదు. పల్లెలో ఎప్పుడూ ఏదో పని ఉంటుండేది. ఇప్పుడు ఒక్కసారిగా పనిలేకపోవడంతో చేతులు పడిపోయినట్లు ఫీలవసాగాడు. ఇంట్లోనే కూర్చుని ఉండడంతో పిచ్చిపట్టినట్టుంది అతడికి.

రూమ్ అడ్వాన్స్‌గా మిగిలిన పదివేలలో కొద్దికొద్దిగా తరిగిపోసాగింది. అప్పటికీ సరోజ పాడి మీద కొంత సంపాదిస్తూనే ఉంది. తమ స్థితి పట్ల బాధనో, ఏమీ తోచనితనంతో కూడిన భయమో తెలియదు- ఆమెకు ఈమధ్య తరచుగా కోపం వస్తోంది. ఆ కోపం భర్త మీదా, మరిదిమీద చూపించలేక పిల్లలమీద చూపిస్తోంది.

ఇరుగుపొరుగు వారివంక జాలిగా చూస్తున్నారు. పాపం! లూటీలో మొత్తం పోగొట్టుకున్నారు అనే సహాయపడని సానుభూతి బాధాకరమే.

పరిస్థితి మరీ దిగజారుతోందని గ్రహించిన శ్రీనివాసరావు ఒకరోజు తమ్ముడిని తన గదిలోకి పిలిచాడు. ఇద్దరూ మంచం మీద కూర్చున్నారు.

"ఎంతవరకూ వచ్చింది నీ ఉద్యోగం వేట?"

"ప్రయత్నిస్తూనే ఉన్నానన్నయ్యా''

అతడి ప్రయత్నలోపం లేదని తెలుసు. అయినా అడిగాడు. జవాబు విన్నాడు. మనసులోని మాట చెప్పాడు.

"నువ్వు ఎండమావుల వెంట పరుగు తీస్తున్నావేమోనని పిస్తోంది''

అతడు అన్నవంక దెబ్బతిన్నట్టుగా చూశాడు. బలంగా నిశ్వసించాడు. "కావచ్చు... కాని అంతకన్నా చేయగలిగిందేముంది''

శ్రీనివాసరావు తల నిలువుగా ఊపాడు. "నిజమే. అంతకన్నా నువ్వు చేయగలిగింది ఏమీలేదు. నువ్వు చదువుకున్న వాడివి. ఉద్యోగం వస్తేనే చేయగలవు. కాని నేను..." అతడు కొద్దిక్షణాలు మాట్లాడటం ఆపాడు. "నేను చదువుకోలేదు. పల్లెలో కూడా కష్టం చేయడం అలవాటయిన వాడిని. శ్రమ నాకు కొత్తకాదు. ఎక్కడయినా లేబర్ పని ఉంటే చూడు''

తను విన్నదేమిటో కొద్దిక్షణాలు అర్థం కాలేదు అతడికి. అర్థమయిన క్షణం తన నిస్సహాయత మీద తనకే అసహ్యం కలిగింది. 'అన్న... పల్లెలో గౌరవనీయమయిన రైతు కుటుంబంలో పుట్టి, అందరికీ తల్లో నాలుకగా పెరిగి, ఊరి ప్రజల గౌరవం అందుకుంటూ, గట్టుమీదనే ఉండి పొలం పనులు చేయించుకునే.. శ్రీనివాసరావు పట్నం వచ్చి లేబర్ పనికి వెళ్తాననడం' షాపు లూటీ చేయబడ్డప్పుడు తనకు కన్నీళ్లువచ్చాయో లేదో తెలియదు. ఆ క్షణం మాత్రం కన్నుల వెంట నీరు ధారగా కారాయి. కన్నీరు ఆపుకునే ప్రయత్నం




చేయలేదు అతడు.

తమ్ముడి కంటనొలికిన అశ్రువులు చూసి ఆ అన్నయ్య చలించిపోయాడు. అతడి బాధ అర్థమయింది కాబోలు "అది కాదురా రవీ! నీకు రేపోమాపో ఉద్యోగం దొరుకుతుంది. కానీ నువ్వు ఉద్యోగం చేస్తుంటే నేను ఇంట్లో కూర్చుని చేసేదేముంటుంది. గోళ్లు గిల్లుకోవాలసిందే. లేదా అప్పుడయినా ఏదయినా పని వెతుక్కోవాలి. ఆ వెతుక్కునేదేదో ఇప్పుడే వెతుక్కుంటే పోతుంది కదా అని''

అతడి మనసులోని అభిప్రాయం అది కాదని రవికి తెలుసు. తమ్ముడు అసమర్థుడయ్యాడు. క్రుంగిపోతున్న కుటుంబాన్ని కూలి పని చేసయినా నిలబెట్టాలని తాపత్రయం అర్థమయింది.

"అన్నయ్యా! నేటి మీ ఈ పరిస్థితికి కారణం నేను. నా ప్రోద్బలంతోనే మీరిక్కడికి వచ్చారు. ఆస్తి మొత్తం పోగొట్టుకున్నాం. ఇప్పుడు మిమ్మల్ని కూలివాడిగా మార్చి... ఆ స్థితి చూడవలసి వస్తే నేను చనిపోవడమే మేలు''

"రవీ'' కంగారుగా అన్నాడు అతడు.

"అన్నయ్యా! మీరు నాకింకో వారం రోజులు గడువివ్వండి. ఈలోపే నేను ఉద్యోగం సంపాదిస్తాను''

రెండు నెలల్లో సాధించలేనిది, వారం రోజులలో ఎలా సాధిస్తావని ఆ అన్నగారు ప్రశ్నించలేదు. తమ్ముడు ఆలోచించనూలేదు.

"అలాగే కానివ్వు'' అన్నాడు అతడు.

రవి మర్నాటి నుండి తన ప్రయత్నం మరింత ముమ్మరం చేశాడు. తెలిసిన వారందరిని పని చూపించమని ప్రాధేయపడ్డాడు. రకరకాల ప్రయత్నాలు లోపం లేకుండా చేశాడు. కాని ఉద్యోగమనేది అతడి చేతిలో లేనిది. అది సృష్టించదగినది కాదు. మరొకరు ఇస్తే పుచ్చుకోవలసింది.

వారం కాదు... పది రోజులు గడిచాయి. పది... పదిహేనురోజులయిపోయింది. పదిహేను... పదహారు... పదిహేడు.

అతడికి నీరసం వచ్చేసింది. స్తబ్దత మదిలో పేరుకోసాగింది. ఈ వ్యవస్థలోని ఒక సమస్య వికృతరూపం దాల్చి తన ముందు వికటాట్టహాసం చేయసాగింది. తనేమీ చేయలేని అశక్తుడయ్యాడు. కనీసం తన అన్నగారికి ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేని అసమర్థుడు.

ఆ రోజు అతడు మధ్యాహ్నం భోజనానికి వెళ్లినప్పుడు శ్రీనివాసరావు ఇంట్లో లేకపోవడం గమనించాడు. ఏమీ తోచక బయటకు వెళ్లి ఉంటాడనుకున్నాడు. భోంచేసి కాసేపు కునుకు తీశాడు. సాయంత్రమయినా అన్నగారి జాడలేదు.

అతడు వంట గదిలోకి వెళ్లాడు. సరోజ వంటపనిలో బిజీగా ఉంది. త్వరగా వంటపని పూర్తికానివ్వాలి. తర్వాత పశువుల పనీ, పిల్లల పని చూసుకోవాలి. వంట గదిలోకి వచ్చిన మరిదిని చూసిందామె. అతడు ఎప్పుడూ ఆ గదివైపు రాడు. "ఏం రవీ! ఏం కావాలి?" అడిగిందామె.

రవి కొద్దిగా గొంతు సర్దుకున్నాడు, "వదినా! అన్నయ్య కనిపించలేదు. ఎక్కడికెళ్లారు?"

ఆమె జవాబు చెప్పలేదు.

అతడికి అనుమానం వచ్చింది. "ఎక్కడికెళ్లారు వదినా?"

"ఆయన రైస్‌మిల్లులో పనికి కుదిరారు రవీ''

తన కాళ్లకింద భూమి కంపించినట్లనిపించింది అతడికి. తల తిరుగుతున్నట్లనిపించి ఆసరా కోసం గడపను పట్టుకున్నాడు.

ఆ రాత్రి రవి అన్నగారి గదిలోకి వెళ్లాడు. కన్నులు వర్షిస్తుండగా అతడి చెయ్యి పట్టుకున్నాడు. "దీనికంతటికీ కారణం నేనే'

"నువ్వేం చేశావు?! బాగుపడాలని పట్నం వచ్చాం. మన దురదృష్టం... నష్టపడిపోయాం. ఇప్పుడు మనం గతాన్ని తలచు

కుంటూ కూర్చుంటే ఎలా? ఏదో ఒకటి చేసి ముందు బతకాలి''

"అయితే రేపటినుండి నేనూ మీతోపాటే మిల్లుకి వస్తాను''

"అక్కడ బియ్యం బస్తాలు మోయడం నువ్వు చెయ్యలేవు రవీ! ఏదయినా ఉద్యోగం కోసం ప్రయత్నం చెయ్యి''

"బియ్యం బస్తాలు మోయడం..." తనకు తనివితీరా ఏడవాలనిపిస్తోంది. కానీ వయసు కారణమేమో ఏడుపు రావడంలేదు. "మీరు... మీరు బస్తాలు మోసి కూలిడబ్బులు సంపాది స్తున్నారా?"

శ్రీనివాసరావు పెదవులు వెడల్పు చేశాడు. ఆ నవ్వులో జీవితం కాచివడబోసిన అను భవం ఉంది. "ఒక్కొక్కప్పుడు మహారాజులు కూడా బిచ్చమెత్తిన చరిత్ర ఉంది. మన మెంత? ఈ మాత్రం పరిస్థితికి బాధపడవల సిన పనిలేదు''

అప్పుడు... అప్పుడు తన్నుకొచ్చింది దుఃఖం గుండెల మీద ఏర్పడిన వయసు పొరను చీల్చుకుని మహోద్రేకంగా, వరద పొంగులా... రవి అతడిని పట్టుకుని ఏడ్చాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. .

ఎందుకో అటుగా వచ్చిన సరోజ ఆ దృ శ్యం చూసింది. రవి చిన్నపిల్లాడిలా ఏడ వడం... కారణం ఆమెకు తెలుసు! ఆమె కన్నులు కూడా చెమర్చాయి. పిల్లలు కూడా బాబాయ్ ఏడుపు విని అటువైపు వచ్చారు. అతడిని ఆశ్చర్యంగా, భయంగా చూశారు. 'బాబాయ్ ఏడవడం...?!' మానసిక సంఘ ర్షణ, పరిస్థితులకు మనిషి లొంగుబాటు అర్థం చేసుకునే వయసుకాదు వారిది.

**"ఛీఛీ! ఏమిట్రా రవీ ఇది! చిన్నపిల్లాడిలా''** అతడు తమ్ముడి తల మీద చెయ్యేసి ఆప్యా యంగా నిమిరాడు. "అటు చూడు! మీ వదినా, పిల్లలు నీవంక ఎంత వింతగా చూస్తున్నారో''

ఆ మాటతో అతడు తెప్పరిల్లాడు. దుఃఖా న్ని దిగమింగుకుంటూ, కన్నులు తుడుచుకు న్నాడు.

అక్కడినుండి లేచి తన గదిలోనికి వెళ్లిపో యాడు. పక్కమీద వాలి మంచం కోడుకు తల కొట్టుకున్నాడు.

"హే ప్రభూ! ఏమిటయ్యా... ఏమిటయ్యా నా కుటుంబానికి ఈ పరిస్థితి? మేము చేసిన పాపం ఏమిటి?"

వదిన భోజనానికి పిలిచింది. ఆకలి లేదని చెప్పాడు. శ్రీనివాసరావు వచ్చి బతిమలాడినా అతడు భోజనానికి లేవలేదు. అతడి మొండిప ట్టు తెలియడంతో వారు పిలవడం మానుకు న్నారు. పిల్లలకు భోజనం పెట్టి భార్యా భర్తలి ద్దరూ అభోజనంగానే పడుకున్నారు.



**మా**రిన ఆదాయస్థితికి తగినట్టుగానే వారు పెద్ద ఇంట్లో నుండి చిన్న రేకులింట్లోకి మారా రు. ముందు వరండా, వెనుక ఒక పెద్ద గది. వరండాలో వంట చేసుకోవాలి. గదిలో కుటుంబం మొత్తం సర్దుకోవాలి. మూడు మంచాలు సరిపోయేవి.

రవి వరండాలో మంచం వేసుకునేవాడు. పిల్లల్ని సరోజ తన దగ్గర పడుకోవడం అలవా టు చేసింది.

దరిద్రచ్ఛాయలు ఇప్పుడిప్పుడే ఆ ఇంట కదలాడుతున్నాయి. శ్రీనివాసరావుకి ఆరొందల జీతం వస్తుంది. రైస్‌మిల్ కాబట్టి





కూలీలకు రోజూ తలో శేరు బియ్యం మిగిలేవి. అవి ఓ పూట తిండికి సరిపోయేవి.

కుటుంబ ఖర్చులు పూర్తిగా తగ్గించేశారు. పిల్లలకు రోజూ గ్లాసెడు పాలు ఇవ్వడం, మధ్యాహ్నం భోజనంలో పెరుగు బంద్ అయింది. గేదెలపాలు మొత్తం అమ్మేసేది సరోజ.

ఇంటి బాడుగ, పిల్లల చదువు, ఇంటి ఖర్చులు... సంపాదన బొటాబొటీగా సరిపోసా గింది. రవికి ఏదయినా ఉద్యోగం వస్తే ఆ కుటుంబం పరిస్థితి మెరుగువుతుంది. అతడు ఎక్కడయినా ప్రయివేట్ కంపెనీలలో ప్రయత్నిస్తే నాలుగు, ఐదొందలు ఇస్తామంటున్నారు. ఖాళీగా ఉండడంకన్నా ఆ సంపాదనకయినా చేరిపోదామంటే, వారు చెప్పే టైమింగ్స్ పరమదోపిడిగా అనిపించేది.

అతడు ఆ రోజు ఉదయమే స్నానం చే. స్తుంటే లోపల నుండి వదినకంఠం పెద్దగా వినిపించింది.

"చెపుతుంటే మీక్కాదూ... డబ్బులిప్పుడు లేవు. మీ నాన్నకు జీతం పదోతారీఖు వచ్చేది. అప్పటిదాకా మీ ఫీజులు ఇవ్వలేను''

"నిన్న కూడా టీచర్ మమ్మల్ని బెంచీ ఎక్కి నిలబడమన్నారు. ఒకటో తారీఖు కట్టాల్సిన ఫీజు.. ఐదో తారీఖు వచ్చేసింది''

"నేను చెప్పేది అర్థం కావడంలేదా? డబ్బులు లేవంటుంటే వినరేం? మీరు చదివితే చదవండి లేకపోతే మీ నాన్నలా కూలికి వెళ్లండి. అప్పుడయినా ఈ కష్టాలు తగ్గుతాయేమో''

"అయితే ఈ రోజు మేము స్కూల్‌కి వెళ్లం" చిన్నవాడి గొంతు అది.

"వెళ్లకపోతే మరీ మంచిది'' ఆమె నిక్కచ్చిగా చెప్పింది. అంతలోనే ఏం తోచిందో ఏమో! "ఇదంతా నా ఖర్మ! ఏదో మిమ్మల్ని పెద్ద చదువులు చదివించాలనే ఇక్కడికి చచ్చాం. మన బతుకులు బుగ్గి అయిపోయాయి. నీడపట్టునుండి పొలం పనులు చేయించుకునే ఆయన కూలి పనికి వెళ్లాల్సి వచ్చింది... ఎవర్ననుకుని ఏం లాభం?"

అతడి మనసు పరిపరివిధాలా ఆలోచించింది. తనను తాను తిట్టుకున్నాడు. నేను పనికిమాలిన వాడిని, అసమర్థుడిని, చాతకాని దద్దమ్మను, వెధవను

స్నానం ముగించి ఇంట్లోకెళితే ఓ మూలగా బిక్కుబిక్కుమంటూ కూర్చుని ఉన్నారు పిల్లలు. అతడిని చూసి కాబోలు సరోజ మాటలు ఆపేసింది. పిల్లల్ని చూస్తే అతడికి బాధేసింది. తాము ఏమయినా కావచ్చు, పిల్లల భవిష్యత్‌ని దెబ్బతీయడం న్యాయం కాదు.

అతడు డ్రసప్ అయ్యాడు.

"రవీ! ఎక్కడికో బయలుదేరినట్టున్నావు. టిఫిన్ తినివెళ్లు''

"వద్దు వదినా! ఇప్పుడాకలిగా లేదు. త్వరగా వచ్చేస్తాను''

రోడ్డు మీద అడుగుపెట్టగానే తనకు ఆలీ గుర్తుకు వచ్చాడు. బస్సు పట్టుకుని నాలుగు స్టాపింగ్స్ తర్వాత దిగాడు.అక్కడి నుండి రెండు సందులు దాటితే ఆలీ ఇల్లు వచ్చేస్తుంది.

మిత్రులను అప్పు అడగడం అతడికి అలవాటు లేదు. కాని ప్రస్తుత పరిస్థితి... అందులోనూ ఆలీ అవసరపడితే రమ్మని చెప్పి ఉన్నాడు కాబట్టి...

అతడు వెళ్లేసరికి ఆలీ ఆఫీసుకు బయలుదేరుతున్నాడు. రవిని చూసి "రావోయ్ రారా!" అన్నాడు ఆప్యాయంగా. ఇద్దరూ వరండాలో కూర్చున్నారు "టిఫిన్ చేశావా?"

"చేసి వచ్చాను''

"నీ ముఖం చూస్తేచేసినట్టుగా లేదే'' అంటూ లోపలికి తిరిగి భార్యను కేకేసాడు "టిఫిన్ పట్రా''

ఆమె ప్లేట్‌లో ఇడ్లి పెట్టుకు వచ్చి టీపాయ్ మీద పెట్టింది. "కాఫీ వేడి చేస్తున్నాను'' చెప్పింది.

"ఆలస్యమయినా ఫర్వాలేదులే"

ఆమె లోపలికెళ్లాక "తినవోయ్'' బల వంతం చేశాడు ఆలీ. మొహమాటంగా ప్లేట్‌లో చెయ్యి ఉంచాడు.

తినడం పూర్తయింది. కాఫీ ఇంకా రాలేదు. అప్పుడు అడిగాడు ఆలీ. "రవీ! నాతో ఏదయినా పని ఉండి వచ్చావా?"

అతడు గుటకలు మింగాడు. అడగటానికి నోరు రాలేదు.

అతడి ఇబ్బంది అర్థమయిందేమో "డబ్బులేమయినా కావాలా?"

తలూపాడు రవి.

"ఎంత కావాలి?"

"ఐదొందలు''

ఆలీ అతడివంక అదోలా చూసి "అంతమాత్రానికే మొహమాటపడటమేమిటి భాయ్... నాతో... ఆఫీసుకు రా ఇస్తాను'' అన్నాడు.

కాఫీ వచ్చింది. తాగాక ఇద్దరూ పైకి లేచారు. ఆలీ స్కూటర్ తీశాడు. రవి వెనుక కూర్చున్నాడు.

స్కూటర్ ఆఫీసుముందు ఆగింది. అప్పటికే గుమస్తా కుర్రాడు షట్టర్స్ తీసి శుభ్రంగా చిమ్మించిపెట్టాడు.

"ఒక అర్థగంట కూర్చో రవీ! బ్యాంక్‌నుండి డ్రాచేసి తెప్పిస్తాను''

"అలాగే"

ఆలీ చెక్‌మీద అమౌంట్ వేసి కుర్రాడిని బ్యాంక్‌కి పంపించాడు. కుర్రాడు వెళ్లిపోయాక తను సీట్లో వెనక్కువాలాడు. కొద్దిసేపు నిశ్శబ్దంగా కళ్లు మూసుకున్నాడు.

"రవీ! మీ ఇంట్లో పరిస్థితి నాకర్థమయింది. నీ ఇబ్బంది కూడా నేను గమనించగలను. అందుకే... నేను నీకో మార్గం చెపుతాను... వింటావా?"

"చెప్పు'' అతడు కుర్చీలో వెనక్కువాలాడు.

ఆలీ టేబుల్‌మీదకు మరింత ముందుకు వాలాడు.

"మా పెదనాన్న హైదరాబాద్‌లో కాంట్రాక్టు పనులు చేస్తున్నాడు. నేనీమధ్య హైదరాబాదు వెళ్లినప్పుడు తను, వర్క్‌లు చూసుకునేందుకు ఒక మంచి కుర్రాడు కావాలని, పరిచయస్తులుంటే పంపమని చెప్పాడు. నెలకో వెయ్యి రూపాయలు జీతం ఇస్తాడు. వారింట్లోనే భోజనవసతి ఏర్పాటు చేస్తారు. నీకిష్టమయితే లెటర్ రాసిస్తాను''

మంచి అవకాశంలానే అనిపించింది అతడికి. అయినా సాయబుల ఇళ్లల్లో... సాయబుల ఇళ్లు అపరిశుభ్రతకు పెట్టింది పేరు. వారు ఇంటిముందు కసవు ఊడ్చరు. కళ్లాపి చల్లరు. ముగ్గుపెట్టరు. అన్నం గిన్నెల్లో ఎంగిలిచెయ్యి పెట్టి తీసుకుంటుంటారు. వారానికోసారి కూడా స్నానంచెయ్యరు. అందుకే అత్తర్లు ఎక్కువగా వాడుతుంటారు. మరి అలాంటివారింట్లో భోజనవసతి...! అంతగా ఇష్టపడకపోతే అక్కడికెళ్లాక వేరేగా రూమ్ తీసుకుని స్వయంపాకం చేసుకోవచ్చు.

అతడు ఆలోచనల్లో పడటం చూసి "రవీ! నువ్వు వెంటనే జవాబు చెప్పనవసరంలేదు. ఆలోచించుకుని రేపయినా చెప్పు'' అన్నాడు ఆలీ.

"అలాగే ఆలీ'' చెప్పాడు రవి.

కుర్రాడు బ్యాంక్‌నుండి డబ్బు తెచ్చాక అందులో ఐదొందలు తీసి అతడికిచ్చాడు ఆలీ.

"నేను రేపు సాయంత్రం ఇక్కడికే వచ్చి విషయం చెపుతాను''

"హైదరాబాదు వెళ్లడమే మంచిదని నా అభిప్రాయం"

"నా అభిప్రాయం కూడా అదే''

"మరి ఆలోచన ఎందుకు?"

"ఇంట్లోవారి అనుమతికోసం"

"అదీ నిజమేకదా!"

"వెళ్లొస్తాను'' కుర్చీలోనుండి లేచాడు రవి. తలూపాడు ఆలీ.




ఇంటికెళ్లేప్పటికి పిల్లలు స్కూల్‌కి వెళ్లడం మానేసి, ఇంట్లోనే ఆడుకుంటున్నారు. సరోజ బట్టలు ఉతుకుతోంది.

అతడిని చూసి చెయ్యి కడుక్కువచ్చి "ఎక్కడికెళ్లావు రవీ...! టిఫిన్ నీకోసం అలాగే ఉంచాను'' ప్లేట్ బయటకు తీయబోయింది.

"బయట చేసి వచ్చాను వదినా'' అతడు జేబులోనుండి డబ్బు తీసి ఆమె చేతిలో పెట్టాడు. "పిల్లల ఫీజు ఇచ్చి, మధ్యాహ్నంనుండి స్కూల్‌కి పంపండి''

"ఎక్కడిదీ డబ్బు?"

"స్నేహితుడి దగ్గర అప్పుగా తీసుకున్నాను''

ఆమె మరేం మాట్లాడలేదు. పిల్లల ముఖంలో వెలుగు గమనించాడు అతడు. 'వంద రూపాయలకోసం వీరెంత అవమానపడ్డారోకదా!' అనుకున్నాడు. పట్నంలోని చదువులు పూర్తిగా కమర్షియల్ అయిపోయాయి. పిల్లల మనసులు పట్టించుకోకుండా మనీకోసం పీడించడం ఎక్కువయిపోయింది.

వారిద్దరూ అతడి దగ్గరకు వచ్చారు. "థాంక్స్ బాబాయ్'' ఒకటిగా పలికారు.

మధ్యాహ్నం వారు స్కూల్‌కి వెళ్లిపోయారు.

శ్రీనివాసరావు మధ్యాహ్నం భోజనానికి ఇంటికి రాడు. కేరియర్ తీసుకుని వెళ్లిపోతాడు ఉదయాన్నే.

అతడు మధ్యాహ్నం భోంచేసి కాసేపు పడుకున్నాడు. తర్వాత పుస్తకం తీసుకుని చదువుకోసాగాడు.

సాయంత్రం శ్రీనివాసరావు ఇంటికొచ్చాక, స్నానం కానిచ్చి, కాస్త విశ్రాంతిగా ఉన్నప్పుడు దగ్గరకెళ్లాడు. ఆలీ తనకు చెప్పిన అవకాశం గురించి అన్నయ్యకు వివరించాడు.

"హైదరాబాదుకా?" అయిష్టంగా అన్నాడు శ్రీనివాసరావు మొదట.

"బ్రతుకుతెరువుకోసం దేశం దాటిపోయే రోజులన్నయ్యా! మన రాష్ట్ర రాజధానికి వెళ్లడమేముంది''

"అందులోనూ ఒక సాయబు ఇంట్లో ఉండడం..." కాస్త ఇబ్బందిగా ముఖంపెట్టాడు.

"అన్నయ్యా! మతంకన్నా మానవత్వం గొప్పదనుకుంటున్నాను నేను. ఈరోజు నా స్థితి దిగజారితే ఏ హిందూమిత్రుడూ నాకు సహాయపడలేదు. ఓ సాయబయి ఉండి అతడు అవసరపడితే ఆదుకునేందుకు సిద్ధపడ్డాడు. మతందేముందన్నయ్యా''

"నీ ఇష్టం" చివరికి చెప్పాడు శ్రీనివాసరావు.

ఆ మర్నాడు సాయంత్రం రవి ఆలీని కలుసుకున్నాడు.

రెండురోజులలో వెళ్లేందుకు ఏర్పాట్లు చేసుకోసాగాడు అతడు. ఆలీ ఖర్చులకోసం ఉంచమంటూ మరో ఐదువందలు జేబులో పెట్టాడు.

హైదరాబాదు బస్సు ఎక్కించేందుకు స్టాండ్‌కి వచ్చిన శ్రీనివాసరావు తమ్ముడి చెయ్యి పట్టుకుని కన్నీళ్లు పెట్టుకున్నాడు.

"మనం దూరంగా ఉండటం కొద్దిరోజులే అన్నయ్యా... నేను అక్కడ మంచి ఉద్యోగంకోసం ప్రయత్నిస్తాను. దొరికిన వెంటనే అందరం హైదరాబాదుకి చేరిపోతాం"

బస్సు కదులుతుంటే ఎక్కి తన సీట్లో కూర్చుని "వెళ్లొస్తానన్నయ్యా'' చెప్పాడు.

కనిపించేవరకూ చెయ్యూపుతూనే ఉన్నాడు శ్రీనివాసరావు.

★ ★ ★

వేకువఝామునే బస్సు హైదరాబాదులో అతడిని దించేసింది. అతడు బస్టాండులోనే ముఖం కడుక్కున్నాడు. టీ తాగాడు. కాస్త ఎండబడ్డాకే వారింటికి వెళ్తే బాగుంటుందని, పేపర్ కొనుక్కుని హోటల్‌లో కూర్చుని చదువుకోసాగాడు.

సూర్యుడు కాస్త కనుపించాక, లగేజీ చేతప

ట్టుకుని సిటీబస్సు ఎక్కాడు "చార్మినార్" బస్సు కండక్టర్‌కి పైసలిస్తూ చెప్పాడు.

చార్మినార్ దగ్గర బస్సు ఆగింది.

బస్సు దిగి, ఇంటి నెంబర్ వెతుక్కుంటూ ముందుకు నడిచాడు. చార్మినార్‌కి కొద్దిదూరంలోనే ఆయన ఇల్లు అని ఆలీ చెప్పాడు.

అతడు తను వెళ్లవలసిన ఇంటి యజమాని పేరు మరోసారి చదువుకున్నాడు.

"ఆలీబేగ్'

ఆయన ఫోటో ఆలీ తనకు చూపించాడు. "యాభై సంవత్సరాలు ఉంటాయి. మీసాలు కత్తిరించి, గడ్డం వత్తుగా పెంచి, నెత్తిన టోపీ పెట్టి అసలు సిసలయిన ముసల్మానులా ఉంటాడు.

ఇంటినెంబర్ కనుక్కోవడం కొద్దిగా కష్టమయి, ఓ ఇంటిముందు నిలబడి ఉన్న ముసల్మాన్ కుర్రాడికి అడ్రస్ చూపిస్తే "ఆలీ బేగ్ సాబ్ ఇల్లా... అదిగో అల్లదే'' అంటూ చూపించాడు.

'ఆలీబేగ్‌కి ఆ ఏరియాలో మంచిపేరు ఉన్నట్టుంది' అనుకున్నాడు అతడు. ఆ ఇంటివైపు నడిచాడు.

పాతబస్తీలోని పాతకాలం బిల్డింగ్‌లలో అదీ ఒకటి. అయితే కాస్త భిన్నంగా ఇంటిముందు కాస్త ఆవరణ, వాకిటకు గేటు... కాస్త ప్రత్యేకంగా కనిపిస్తుందా ఇల్లు.

రవి గేటు తీసుకుని లోపలికి వెళుతుంటే, ఎందుకనో తెలియదు వళ్లు కాస్త జలదరించింది. ఆ వాకిటి మెట్టుతో ఏదో సాన్నిహిత్యం ఏర్పడబోతున్నట్టనిపించింది.

అతడు వరండాలోకి వెళ్లాడు. కాలింగ్‌బెల్ కోసం చూశాడు. కనుపించలేదు. "ఆలీబేగ్ సాబ్... ఆలీబేగ్‌సాబ్..." పిలిచాడు.

బదులుగా సన్నని స్వరం... చాలా మధురమయిన స్వరం... "నహీం! సాబ్ బాహర్‌గయా..." పలికింది.

అతడికి హిందీ, ఉర్దూ భాషలు రావు. అందుకే స్వచ్ఛమయిన తెలుగులో "ఏమండీ! మీరు కాస్త ఇలా వస్తారా?" పిలిచాడు.

ఈసారి మాట వినిపించలేదు. అరని మిషం తర్వాత తన ముందు ఒక మెరుపు మెరిసింది.

ఇరవై సంవత్సరాలుంటాయేమో ఆమెకు.

పసుపు, పాలు, గులాబీరేకులు కలిపి బంగారుపొడి అద్ది, ఆమెకు రంగునిచ్చినట్లున్నాడు దేవుడు. అరచేయంత పెద్ద కన్నులు. తీర్చిదిద్దినట్టున్న ముఖం. సన్నని నడుము...

అతడికి చప్పున తన ఊహాసుందరి గుర్తుకువచ్చింది. తన ఊహ కనులముందు నిలిచిందా?!!... ఈమె ముస్లిం అమ్మాయి. నుదుట బొట్టు, కాళ్లకు పారాణి... ఊహుఁ! లేవు.

రవి అనాలోచింతగానే చేతులు జోడించాడు. "నమస్తే! నా పేరు రవి. విజయవాడ నుండి ఆలీ పంపించాడు''

"ఓ ఆప్!..." ఆమె చిరునవ్వు నవ్వింది. "ఇప్పుడే బాబా బయటకెళ్తూ, మీరొస్తే కూర్చోనుండమని చెప్పి వెళ్లాడు''

అతడు కొద్దిగా స్థిమితపడ్డాడు. ఇటువంటి పరిస్థితి ఎదురవుతుందని ముందుగానే ఊహించి, ఆలీచేత తన రాక తెలియజేస్తూ ఫోన్ చేయించడం మంచిదయింది.

"అందర్ ఆయియే..." ఆమె వాకిలికి అడ్డు తప్పుకుంది. అతడు సూట్‌కేస్ తీసుకుని లోపలికి అడుగేశాడు.

ముందు పెద్ద హాలు, మూడువైపులా పెద్ద గదులు... ఇల్లు చాలా పెద్దది అనుకున్నాడు రవి.

హాలులోని పాతకాలంనాటి కుర్చీ చూపించిందామె. కూర్చున్నాడు.

"మీరు కాఫీ తాగుతారా, చాయ్‌నా?"

"హైదరాబాదులో ఎక్కువ చాయ్ తాగుతారనుకుంటాను. కాని నాకు కాఫీ అంటే ఇష్టం"




"అయితే కాఫీ ఇస్తాను'' నవ్విందామె. ఆ నవ్వు ఎంతో మనోహరంగా ఉన్నట్టని పించింది అతనికి.

ఆమె లోపలికి నడిచింది. ఆమె వెళ్తున్నంతసేపూ అటే కళ్లప్పగించి చూశాడు అతడు. తను ఇంతకుముందు ఎంతోమంది అందమైన అమ్మాయిలను చూసి ఉన్నాడు. కాని ఎన్నడూ ఇలాంటి స్పందన కలుగలేదు.

'ఛాఛా! ఒక ముస్లిం అమ్మాయిని చూసి నేను కంట్రోల్ తప్పడమేమిటి? నేను హిందువుని. స్వచ్ఛమయిన హిందువును...' తనను తాను స్థిమితపరచుకునే ప్రయత్నం చేశాడు. అయితే మనసు అతడి మాట వినడంలేదు. ఆవైపుకే లాగుతోంది చూపు.

"కాఫీ లీజియే''

అతడు ఉలిక్కిపడ్డాడు. ఆమె చేతిలోని కాఫీ అందుకున్నాడు. లోపలికెళ్లిపోయిందామె.

లోపలనుండి డెబ్బయ్ సంవత్సరాల ముసలామె తొంగిచూసింది.

ఆమె బహుశా ఆలీబేగ్ అమ్మగారయి వుండొచ్చు అనుకున్నాడు. ఆలీబేగ్ ఫొటో అతడు ఆలీ ఇంట్లో చూసి ఉన్నాడు. అందువలననే ఆయన ఆకారం వెంటనే గుర్తించగలడు.

పావుగంట తర్వాత బయట వరండాలో చప్పుడయింది. అతడు తల తిప్పి అటు చూశాడు.

ఆరడుగుల ఆకారం, మనిషి ఫొటోలోకన్నా ఠీవిగా ఉన్నాడు.

"మీరు... మీరు...?"

"ఆలీ పంపాడు సార్!" అతడు జేబులో నుండి లెటర్ తీసి ఆయనకు ఇచ్చాడు.

"ఓ! మీరేనా?!... వాడు రాత్రి ఫోన్‌లో మాట్లాడాడు. అందుకే ఉదయం ఇంట్లో చెప్పి వెళ్లాను. మీరొస్తే కూర్చోబెట్టమని..." కాస్త యాసగానయినా తెలుగు బాగానే మాట్లాడుతున్నాడాయన. బయటి ప్రపంచంలో బాగా తిరిగినట్టున్నాడు.

"నేను... మావాడికి మా ముసల్మాను కుర్రాడినెవరినయినా పంపమని చెప్పాను. వాడు హిందువుని పంపాడు..."

అతడు నిశ్శబ్దంగా నిలబడ్డాడు.

అంతలోనే ఆయన "సరేలే! ఎవరయితే ఏముంది? కావలసింది పని. ... మావాడు నీ గురించి వివరంగా చెప్పాడు. పాపం! మొన్నటి గొడవల్లో మీ షాపు కూడా లూటీ చేయబడిందట కదా!"

రవి తలూపాడు.

"ఏమిటో ఈ గ్రూపులు... మతా రాజకీయాలకు అమాయకులు బలయిపోతున్నారు''

అంతా ఆయనే మాట్లాడుతున్నాడు. తను మాట్లాడవలసిన అవసరం ఏమీలేనట్టుంది.

"నీకు తెలుసా?.. అసలు ఈ దేశంలో నిజమైన సమస్యలు, పట్టించుకోదగ్గ సమస్యలు ఎవ్వరూ పట్టించుకోవడంలేదు. ఆకలి, నిరుద్యోగం, పసిపిల్లల బాల్యాన్ని దోచుకోవడం, నైతిక విలువలు దిగజారుస్తున్న విద్యా వ్యవస్థ... వీటిని బాగుచేయాలని ఎవరూ అనుకోవడంలేదు. వీటికి వ్యతిరేకంగా ఎవరూ ఉద్యమాలు నిర్వహించడంలేదు. మతాల విద్వేషాలను రెచ్చగొడుతున్నారు. కులాలకు రిజర్వేషన్లంటూ చిచ్చుపెడుతున్నారు. అసలీ దేశం ఎటుపోతుందో అర్థంకావడంలేదు... ఎవరెవరో వారి స్వార్థంకోసం కొందరిని రెచ్చగొడితే, అందుకు మరికొందరు బలయిపోతున్నారు. మతం మనకు మంచినీళ్లిస్తుందా? కులం కూడుపెడుతుందా? ఏమిటో! మనిషికీ మనిషికీ మధ్య ఇన్ని అడ్డుగోడలు..."

ఒక ముసల్మాను ఈ దేశంగురించి, మతం గురించి అలా మాట్లాడుతాడంటే మరో సందర్భంలోనయితే అతడు నమ్మి వుండేవాడు కాదు. ప్రత్యక్షంగా చూస్తున్నాడిప్పుడు.

అంతలోనే ఆయనకు 'ప్రస్తుతం' గుర్తుకువ



చ్చినట్టుంది. "అరే! మిమ్మల్ని నిలబెట్టే మాట్లాడుతున్నాను. కూర్చోండి... కూర్చోండి''

అతడు కూర్చున్నాడు. ఆయన తను ఎదురు కుర్చీలో కూర్చుంటూ తల తిప్పి అరిచాడు, "నూర్జహాన్ బేటీ! దో చాయ్ లావో"

'ఓహెూ! ఆ అమ్మాయి పేరు నూర్జహాన్... ఆనాటి నూర్జహాన్‌తో పోటీపడేంత అందంగా ఉంది' అలా ఆలోచిస్తూనే "నాకు చాయ్ వద్దండి. రాగానే మీ అమ్మాయి కాఫీ ఇచ్చింది'' చెప్పాడు.

"చాయ్‌కేంలెండి. ఎన్నిసార్లయినా తాగొచ్చు''

పది నిముషాల తర్వాత ఆమె రెండు కప్పులు చాయ్ పట్టుకొచ్చి వారి ముందుంచింది.

ఆయన అతనికో కప్పు ఇచ్చి తనో కప్పు అందుకున్నాడు.

టీ తాగాక "లగేజీ తీసుకురండి, రూమ్ చూపిస్తాను'' లేచాడు ఆలీబేగ్.

అతడూ పైకి లేచి ఆయనను అనుసరించాడు.

వరండా పక్కనే గోడ అంచుగా ఉన్న దారివెంబడి పెరట్లోకి తీసుకువెళ్లాడు. బాత్‌రూమ్, పక్కనే స్టోర్‌రూమ్, ఆనుకునే ఉన్న రూమ్ తలుపు తెరిచాడు.

లోపల వసతికి అనువుగా ఉంది. మంచం, పరుపు - కూర్చునేందుకు రెండు కుర్చీలు, టేబుల్.. తన ఇంట్లో తనకు ప్రత్యేకంగా గది అంటూ లేదు.

ఆ గది బాగా నచ్చింది అతనికి.

"మీరు స్నానం చేయండి. నాస్తా తయారు చేయిస్తాను''

"నేను బస్టాండ్‌లోనే చేసి వచ్చాను''

"అయితే కాస్త విశ్రాంతి తీసుకోండి. మధ్యాహ్నం మనం సైట్‌కి వెళ్దాం"

లగేజీ సర్దుకున్నాక లుంగీ చుట్టుకుని మంచంమీద వాలాడు. నిద్ర పట్టలేదుగానీ బడలిక కాస్త తగ్గింది.

ఆలీబేగ్‌గారు ఎక్కడికో వెళ్లినట్టనిపించింది. బహుశా సైట్‌కి వెళ్లివుంటారు.

వంటగది, అతడుండే గదికి ఆరడగుల దూరంలోనే ఉంటుంది. వంటగదిలో పాత్రల చప్పుడు వినిపిస్తోంది. ఆ అందమయిన అమ్మాయి... నూర్జహాన్... అక్కడ... వంట చేస్తోంది. అతనికి ఆ అమ్మాయిని వెంటనే చూడాలనిపించింది. అంతలోనే భయమేసింది. వారసలే సాయబులు, కసాయితనంతో నరికిపారేసినా, నరికిపారేయగలరు. వారితో ఆటలాడడం... మహా డేంజర్!

మధ్యాహ్నం ఆలీబేగ్ వచ్చారు. ఆయన వచ్చేసరికి అతడు నిద్ర నటించాడు. ఆలీబేగ్ తలుపు దగ్గరే నిలబడి, "రవీజీ... రవీజీ..." పిలిచాడు.

"వస్తున్నాను సార్' లేచి వెళ్లాడు.

"భోజనం రడీగా ఉంది'' చెప్పి వెళ్లిపోయాడు.

భోజనాలయ్యాక ఆయన చెప్పాడు, "మరో గంట తర్వాత మనం సైట్‌కి వెళ్దాం"

అతడు తన గదిలోకి వెళ్లాడు. గంట తర్వాత ఆలీబేగ్ పిలుపు వినబడి డ్రసప్ అయి బయటకు వచ్చాడు.

రోడ్డుకు అవతలివైపు నిలబెట్టబడి వుంది జీపు. ఆయన వెళ్లి డ్రైవింగ్‌సీట్లో కూర్చున్నాడు. రవి పక్కనే కూర్చున్నాడు.

సాలార్‌జంగ్ మ్యూజియం మీదుగా జీపు పోతుంటే ఆయన అతనివంక చూసి ప్రశ్నించాడు, "మీకు డ్రైవింగ్ వచ్చా''

"స్కూటర్ మాత్రమే తెలుసు'' బదులిచ్చాడు.

"అయితే మీరు త్వరగా డ్రైవింగ్ నేర్చుకోవాలి... కాంట్రాక్ట్ పనులలో డ్రైవింగ్ తెలిసి ఉండటం చాలా అవసరం"

"నేర్చుకుంటాను సార్'




పఠాన్‌చెరువునుండి శంకరపల్లె వెళ్లే రోడ్డు రీకన్‌స్ట్రక్షన్ వర్క్ ఆయనకు వచ్చింది. వర్క్ ఓ నెలక్రితమే స్టార్టయింది. రోడ్ వైడనింగ్ జరుగుతోంది. ఓ ముప్పయ్‌మంది మహబూబ్‌నగర్ పాలమూరోళ్లు పనిచేస్తున్నారు. ఓ సూపర్‌వైజర్ కూడా ఉన్నాడక్కడ.

ఆయన వర్క్ గురించి చెప్పాడు. "ఇది అరవైలక్షల రూపాయల వర్క్. వైడనింగ్, స్ట్రెంగ్తనింగ్ అండ్ రీకన్‌స్ట్రక్షన్ ఆఫ్ ది రోడ్. మొత్తం ఆరుకిలోమీటర్లు. సంవత్సరం ఆరునెలలలోపు మనం వర్క్ కంప్లీట్ చేయాలి. ఆ తర్వాత సంవత్సరం రోజులు మనమే రోడ్ మెయిన్‌టెనెన్స్ చేయాలి. అంటే రోడ్డుమీద ఎక్కడయినా గుంటలుపడ్డా, రోడ్డు కొట్టుకుపోయినా మనమే రిపేర్ చేయాలన్నమాట. పోతే, డిపార్ట్‌మెంట్ వర్క్ ఇన్‌స్పెక్టర్లు, జె.ఇ.లు చూసుకుంటారు. అయినా మనం దగ్గరుండి లేబర్‌చేత త్వరగా పని చేయించుకోవాలి. వర్క్ ప్లానింగ్ వేసుకోవాలి. ఆఫీసుల్లో బిల్లులు చేయించుకోవాలి. మిషనరీ మెయిన్‌టెనెన్స్ చేసుకోవాలి... ఏం చేసినా ఈ వర్క్‌మీద మనకు కొంత లాభం మిగలాలి... వింటున్నారా?"

అతడు తలూపాడు. తనకు ఆ ఫీల్డ్ కొత్త. అందుకే ఆయన చెప్పేది అర్థమయీ కానట్టుంది.

"ఇక్కడ లేబర్‌మీద ఒక కుర్రాడున్నాడు. మనం అతనికి లేబర్‌చేత సాయంత్రానికి ఈ పని పూర్తిచేయించమని చెప్పడమే! తను చేయిస్తాడు. మీరు చేయవలసిందల్లా వర్క్ ప్లాన్ చేసుకుని, మెయిన్‌టెనెన్స్ చేయడం. వర్క్ దగ్గర లారీలు, ట్రాక్టర్లు, ఇతర మిషనరీ ఉంటుంది. వాటికి పని చూపించాలి. అలాగే వారి పేమెంట్స్ విషయం మీరే చూసుకోవాలి..." ఫీల్డ్‌వర్క్ చూసుకునేందుకు సివిల్ ఇంజనీరింగ్ కుర్రాడిని కూడా మనం అపాయింట్ చేసుకుందాం..."

కాంట్రాక్ట్‌ఫీల్డ్ చాలా రఫ్‌గా ఉంటుందని అతడు విన్నాడు. తనిప్పుడు ఆ ఫీల్డ్‌లోకే ఎంటరవుతున్నాడు.

వారిద్దరూ లేబర్ దగ్గరగా వెళ్లారు. వర్క్ సూపర్‌వైజర్ "సలాంలేకుం సాబ్" అన్నాడు.

"పని బాగా సాగుతోందా తాహిర్'

"సాగుతోంది సాబ్'

"ఈయన పేరు రవి... రేపటినుంచి వర్క్ ఈయన హేండోవర్‌లోనే ఉంటుంది''

అతనికి సలాంచేశాడా కుర్రాడు.

కాసేపు అక్కడే నిలబడ్డాక "వెళ్దాం పదండి'' అన్నాడాయన. ఇద్దరూ ముందుకు నడిచారు.

ఓ అరకిలోమీటరు నడిచాక రోడ్డు పక్కగా నాలుగు పూరిగుడిసెలు కనిపించాయి. మరికాస్త దూరంలో పది, పదిహేను టెంట్‌లున్నాయి. ఆయన అటువైపు నడుస్తూ చెప్పాడు.

"ఇదే మన కేంప్! డిపార్ట్‌మెంట్‌వాళ్లుగానీ, మనంగానీ ఇక్కడ విశ్రాంతి తీసుకోవచ్చు. వర్క్ ఇంకా స్పీడప్ కాలేదు కాబట్టి ఇలా ఉంది. రేపు ఇక్కడ లారీలు, ట్రాక్టర్లు... మెషినరీ మొత్తం ఉంటుంది..." ఆయన టెంట్‌లవైపు చెయ్యి చూపించాడు "అవి లేబర్ ఉండే గుడిసెలు''

ఆయనను చూడటంతోనే వాచ్‌మెన్ పరిగెత్తుకొచ్చి నమస్కరించాడు. కాస్త నీడగా ఉన్న చోట కుర్చీలు వేశాడు.

"ఏమిటి పాపయ్యా విశేషాలు?"

"ఏమున్నాయి బాబయ్యా!..." వాచ్‌మెన్ చేతులు నులుముకుంటూ నిలబడ్డాడు.

ఆలీబేగ్ తన దగ్గరుండే వర్కర్స్‌ని బాగా చూసుకుంటాడని అర్థమయింది రవికి. ఎలాగయితేనేం తనకో మంచి యజమాని దొరికాడు.

"రవీజీ! మీరు ఇక్కడ కూడా ఉండొచ్చు. కాని తిండి సమస్యవుతుంది. అదీగాక నేను రోజూ సైట్‌కి రాలేను. ఏరోజు ప్రోగ్రెస్ ఆరోజు నాకు తెలియాలంటే మీరు ఇంటికి రావడమే మంచిది... మీరు ప్రతిరోజూ ఉదయమే స్కూటర్‌లో సైట్‌కి వచ్చి, సాయంత్రంవరకూ ఉండి

ఇంటికి వచ్చేయండి. మధ్యాహ్నం మీకు కూడా రోటీ తెమ్మని తాహిర్‌కి చెపుతాను''

తలూపాడు అతడు.

సాయంత్రంవరకూ వారు సైట్‌లోనే ఉన్నారు.

జీపులో ఇంటికి తిరిగివస్తుంటే, ఏదో మాటల మధ్య ఆయన "రవీజీ..." అంటూ చెప్పసాగాడు.

"సార్' పిలిచాడు అతడు. ఆయన తలతిప్పి అతడివంక చూశాడు. "సార్! నేను వయసులో మీకన్నా చాలా చిన్నవాడిని అందులోనూ మీ దగ్గర ఉద్యోగం చేస్తున్న వాడిని. నన్ను 'మీరు, రవీజీ' అంటూ పిలవడం నాకే ఏదోలా ఉంది. మీరు నన్ను రవి అని పిలవండి చాలు''

ఆయన అతడివంక క్షణకాలం తదేకంగా చూసి, చప్పున చిరునవ్వు పెదాల మీదకు తెచ్చుకుని "అలాగే రవీజీ... సారీ... రవీ'' అన్నాడు.

★ ★ ★

"ప్రియమైన అన్నగారికి,

నేను ఇక్కడ క్షేమము. మీరంతా క్షేమమని తలుస్తాను.

నేనిక్కడ పనిలో ప్రవేశించాను. నా యజమాని ఆలీబేగ్ చాలా మంచివారు. వారింట్లోనే నాకు భోజనవసతి ఏర్పాటు చేశారు. ఆయన నాకు ఊహించిన దానికన్నా ఎక్కువ బరువు బాధ్యతలు అప్పగించారు. చాలా సంతోషంగా ఉంది. మరికొద్ది రోజులు కష్టపడి ఆయనను మెప్పిస్తే మనకు ఎంతో సహాయం చేయగలరాయన. అందుకోసమే నేను ఎక్కువగా శ్రమపడుతున్నాను. వీలయినంత త్వరలో మిమ్మల్ని హైదరాబాదుకి తీసుకు రాగలనను కుంటున్నాను.

వదినగారికి నా నమస్కారములు. పిల్లలికి నా ముద్దులు... "

శ్రీనివాసరావు ఉత్తరాన్ని పెద్దగా చదివి భార్యకు వినిపించాడు. చాలాకాలం తర్వాత అతడి ముఖంలో సంతోషఛాయలు కనిపించాయి సరోజకు.

"మనవాడు అక్కడ సంతోషంగా ఉన్నాడట" అన్నాడాయన.

"ఎవరయినా, ఎక్కడయినా సంతోషంగా ఉండటమేగా కావలసింది'' ఆమెకది సంతోషమో, బాధో అర్థం కాలేదు అతడికి.

"త్వరలోనే మనలను హైదరాబాదు తీసుకెళతాడట"

"విజయవాడకు వచ్చి సాధించిందేమిటి? హైదరాబాదు వెళ్లి సాధించడానికి'' ఆమెకు మెల్లగా జీవితమంటేనే విరక్తి పుడుతోంది. ఈమధ్య ఆమె తరచుగా పిల్లల్ని కొట్టడం, తనతో దెబ్బలాడినట్టుగా మాట్లాడటం అతడు గమనిస్తూనే ఉన్నాడు.

విజయవాడకు రావాలని తను కోరుకోలేదు. అది ఒకవిధంగా ఆమె ఇష్టప్రకారమే జరిగింది. కానీ ఆమె ఇప్పుడు తప్పు తన మీద నుండి పక్కవారి మీదకు నెట్టేస్తోంది.

శ్రీనివాసరావు నిశ్శబ్దంగా బయటకు నడిచాడు.

పట్టణం మీద చీకటి తెర ముసిరి చాలాసేపయింది. వీధిలైట్లు మసకగా వెలుగుతున్నాయి.

అతడు కాళ్లునొప్పులు పుట్టేవరకూ రోడ్డమ్మటే నడిచాడు. బాగా నీరసంగా అనిపించాక ఇంటికి తిరుగుముఖం పట్టాడు.

★ ★ ★

"చాయ్ లీజియేం"

తలుపు దగ్గర సుపరిచిత సుమధుర స్వరం వినపడి నిద్రలోనుండి ఉలిక్కిపడి లేచాడు.

నూర్జహాన్ వాకిట నిలబడి ఉంది. అతడు లేచి వెళ్లి ఆమె చేతిలోని టీ కప్పు అందుకున్నాడు.

"సార్ ఊరెళ్లారా?"




"వేకువనే వెళ్లిపోయారు'' ఆమె వెళ్లిపోయింది.

వరంగల్‌లో ఏదో పని ఉందని ఆలీబేగ్ రాత్రి చెప్పాడు. జరగాల్సిన పనులు చెప్పేసే వెళ్లాడు.

అతడు స్నానం చేసి ఆమె పెట్టిన నాస్తా తిని స్కూటర్ తీసుకుని సైట్‌కి వెళ్లిపోయాడు.

పాలమూరోళ్లు అప్పటికి పనిలోకి వంగి మూడు గంటలయిపోయి ఉంటుంది. వారు చాలా కష్టజీవులు.

ఈదేశంలో కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకూ ఏ మూలనయినా కాంట్రాక్టుపని ఉంటే అక్కడ పాలమూరోళ్లు తప్పక ఉంటారు. రాష్ట్రంలోపలా ఇతర రాష్ట్రాల్లో కన్‌స్ట్రక్షన్ చేసే తెలుగువారికి ఈ లేబరే మూలాధారం.

వారు వేకువనే ఐదింటికి పనిలోకి వస్తారు. సాయంత్రం కను చీకటి పడేవరకూ పనిచేస్తారు. పదిహేను రోజులకొకసారి ఒకరోజు శెలవు తీసుకుంటారు.

వీరు తినేది నూకల సంకటి. బతికేది చిన్న గుడారాల్లో. వాన వచ్చినా, ఎండకాసినా, ఎముకలు కొరికే చలి అయినా లెక్కపెట్టరు.

వారిని చూస్తుంటే రవికి ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ, బాధగానూ రకరకాల భావాలు కలుగుతాయి.

తాహిర్ అతడి దగ్గరకు వచ్చాడు, "లేబరంతా పనిలో దిగారా?"

"ఇద్దరు బీమార్‌గుందని ఎగేసింన్రు సాబ్'

"సరే! రేపటినుండి మనం గిట్టి తోలడం మొదలెడుతున్నాం. కేంప్‌లో ట్రిప్ షీట్ బుక్ ఉంది తీసుకో. అది ఫిలప్ చేసి లారీ డ్రైవర్‌కి ఒక కాగితం ఇవ్వు. డూప్లికేట్ ట్రిప్లికేట్ బుక్‌లోనే ఉంచు''

మరోగంట తర్వాత అజయ్ వచ్చాడు. అతడు కొత్తగా అపాయింట్ అయిన సివిల్ ఇంజనీర్. తన వయసే ఉంటుంది.

"గుడ్మార్నింగ్ రవిసాబ్'

"గుడ్మార్నింగ్ అజయ్'' అతడు అడిగాడు "ఎంతవరకూ వచ్చింది మీ వర్క్?"

"సుమారుగా రెండు కిలో మీటర్లు లెవల్స్ తీశాము. రాత్రులు ఇంటి దగ్గర యల్.యస్.లు, సి.యస్‌లు గీస్తున్నాను'' అతడు కొద్ది క్షణాల తర్వాత అన్నాడు. "ఈ డిపార్ట్‌మెంట్‌వాళ్లలో హుషారు లేదు. లేకుంటే ఈసరికి మరో కిలో మీటరు లెవల్స్ తీసేసి ఉండొచ్చు''

అతడూ నవ్వుతూ "ప్రభుత్వ ఉద్యోగులెవరూ వంటిని అలసిపోనివ్వరు'' అన్నాడు.

వారిద్దరూ కేంప్‌వైపు వెళ్లారు.

అజయ్ సిన్సియర్‌గా వర్క్ చేస్తాడు. బీ.ఇ. చదివిన అతడికి ఆలీబేగ్‌గారు ఇచ్చేది ఎనిమిది వందల రూపాయలు మాత్రమే! నిరుద్యోగం తీవ్రతను రవి ఇప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నాడు. ఇంజనీరింగ్ చదివించేందుకు లక్షరూపాయలు పైగానే ఖర్చవుతాయి. అంత ఖర్చుపెట్టి చదివిస్తే వారు ఏడెనిమిది వందల రూపాయలకు ఉద్యోగం చేయడం. ఈ దేశంలో చదువుకి విలువ ఎప్పుడోపోయింది.

"ఇంత తక్కువ జీతానికా...?!" అంటూ తను మొదట ఆశ్చర్యపోతే, అజయ్ అన్నాడు కదా, "ఎనిమిది వందలు... ఇది మంచి జీతమే రవిసాబ్! సైట్ వర్క్ కాబట్టి ఇంతయినా ఇస్తున్నారు. అదే ఏ ఆర్కిటెక్ట్ దగ్గరో డిజైన్స్ గీసిస్తే ఇచ్చేది ఆరువందలు..."

తన పొజిషనే మేలనుకున్నాడు రవి.

కేంప్‌కెళ్లాక కాసేపు ప్రశాంతంగా కూర్చున్నారు వారు. అర్ధగంట తర్వాత అజయ్ పాపయ్య చేత ఇన్‌స్ట్రుమెంట్స్ పట్టించుకుని తీసుకెళ్లిపోయాడు.

అతడు అక్కడనుండి గిట్టి క్వారీకి వెళ్లాడు. లేబర్ కంకర పగల గొడుతున్నారు. మేస్త్రీతో మర్నాటి నుండి లారీలు వస్తున్నాయి నింపమని చెప్పి వచ్చేశాడు.

కేంప్‌కి వచ్చి తాహిర్ తెచ్చిన కేరియర్‌లో నుండి రెండు రోటీలు తీసుకుని తిన్నాడు. కాసేపు లేబర్ దగ్గర, మరికాసేపు లెవల్స్ దగ్గర ఉండి షెడ్ దగ్గరకు వెళ్లాడు. అక్కడ లారీ రిపేర్ జరుగుతోంది. అతడు పొద్దుపోయేవరకూ అక్కడే కూర్చున్నాడు. తెల్లవారేసరికి బండి రెడీ కావాలి. మర్నాటి నుండి గిట్టీ తోలాలి. మెకానిక్‌లను తొందరపెట్టాడు. డ్రైవర్‌తో గట్టిగా చెప్పాడు, "తెల్లారేసరికి ఎట్టి పరిస్థితుల్లోనూ బండి సైట్‌లో ఉండాలి'' అని.

ఈ పనులన్నీ ముగించుకుని ఇంటికి చేరుకునేసరికి ఎనిమిదయింది.

స్కూటర్‌ని వరండాలో పెట్టేసి, తన రూమ్‌లోకెళ్లాడు.

అతడి రాకను చూడడంతోనే నూర్జహాన్ వేణ్ణీళ్లు బాత్‌రూమ్‌లో పెట్టి అతడికి చెప్పింది.

రవి స్నానం ముగించాడు.

ఈమధ్య అతడి పనులన్నీ ఆమే చూస్తోంది. అతడు కూడా వారిలో ఒకడిగా కలిసిపోయాడు.

నూర్జహాన్ మరోసారి వచ్చి పిలవకముందే అతడు భోజనానికి వెళ్లి టేబుల్ ముందు కూర్చున్నాడు. ఆమె అతడికి వడ్డించసాగింది.

"బాబా రాత్రికి వస్తారా'' ప్రశ్నించాడు అతడు.

"రారు... రేపు వస్తానని చెప్పి వెళ్లారు''

ఆలీబేగ్ లేకపోతే ఆ ఇంట్లో సందడి ఉండదు. ఇంట్లో ఉండేది ఇద్దరూ ఆడవారే! అందులోనూ ఆ ముసలామె మూలగది దాటి బయటకు రాదు. ఇల్లంతా తిరుగాడేది ఆ అమ్మాయి ఒక్కతే.

అతడు భోంచేసిన తర్వాత తన రూమ్‌కి వెళ్లిపోయాడు.

★ ★ ★

కమలాకర్ పెళ్లి ఫిక్స్ అయింది. విజయవాడలోనే పెళ్లి, వెడ్డింగ్ కార్డ్‌తోపాటు తనను రమ్మన్న పర్సనల్ రిక్వెస్ట్ కూడా అందింది.

విజయవాడకు వెళ్లి ఏడెనిమిది నెలలయిపోయింది. ఆ పట్టణానికి వెళ్లాలంటే అతడికి అదోరకమైన నిరాసక్తత. అది అసహ్యంనుండి జనించిందో, భయంనుండి పుట్టుకొచ్చిందో తెలియదు. తమ కుటుంబం వీధులపాలయింది ఆ చోటనే! అందువల్లే తనకు అక్కడికి వెళ్లాలని ఎప్పుడూ అనిపించదు.

శ్రీనివాసరావు తమ్ముడిని రమ్మని తరచుగా జాబులు రాస్తుంటాడు. తనకు తీరికలేదని రాలేనని బదులిస్తుంటాడు అతడు.

కాని ఇప్పుడు, చాలా దగ్గర మిత్రుని పెళ్లి. ఒకప్పుడు తాను వారి సహాయం పొందినవాడు. తనా పెళ్లికి అటెండ్ కాకపోతే వారు బాధపడవచ్చు. అందుకే విజయవాడకు వెళ్లాలనే నిశ్చయించుకున్నాడు.

ఆలీబేగ్‌గారిని అడిగితే, రెండు రోజులు కాదు వారం రోజులు ఉండి రమ్మన్నాడు. గత ఏడెనిమిది నెలల్లో అతడు ఒక్కరోజు కూడా సైటుకి వెళ్లకుండా మానలేదు. అలాంటివాడిని వారంరోజులు ఫ్రీగా వదిలేస్తే బాగుంటుందని ఆయన అభిప్రాయం!

కమలాకర్ పెళ్లికి ఒకరోజు ముందు అతడు సూట్‌కేస్‌లో రెండు జతల బట్టలు సర్దుకుని విజయవాడకు బయలుదేరాడు. వెళ్లేముందు అన్నావదినలకు బట్టలు కొన్నాడు. ప్రశాంత్, సతీష్‌లకు రెడీమేడ్ దుస్తులు తీసుకున్నాడు.

రాత్రి పదింటికి హైదరాబాదులో బస్సెక్కితే, వేకువ ఝామున నాలుగింటికి బస్సు విజయవాడలో ఆగింది.

ఇంటికెళ్లి తలుపు తట్టాడు. శ్రీనివాసరావు తలుపు తీశాడు. తమ్ముడిని చూసి ముఖం చాటంతయింది శ్రీనివాసరావుకి.

"ఇప్పుడేనా రావడం?"

అతడు తలూపాడు.

"కమలాకర్ పెళ్లి అని తెలుసు. ఇక్కడ కార్డ్ ఇచ్చి వెళ్లాడు. కాని నువ్వీ పెళ్లికి వస్తావో, రావో అనుకుంటున్నాను''

సరోజ నిద్రలోనుండి లేచింది. మరిదిని




ఆప్యాయంగా పలకరించింది "ఎలా ఉన్నావు రవీ?"

"బాగున్నాను వదినా''

'మనిషి లావు కాస్త తగ్గినా, తెల్లగా చలాకీగా తయారయ్యాడు' మరిదిని చూసి అనుకుందామె.

రవి పిల్లల్ని నిద్రలేపాడు. వారు బాబాయ్‌ని చూసి సంబరపడ్డారు.

"ఏరా ప్రశాంత్! స్కూల్‌కి వెళుతున్నారా?"

తలూపాడు పెద్దవాడు.

"రేయ్ సతీష్! ఇవిగో మీకు బట్టలు..." సూట్‌కేస్‌లోని బట్టలు తీసి వారికి అందించాడు.

మాటల మధ్యనే తెల్లవారిపోయింది.

అతడు స్నానపానాదులు ముగించాడు.

పెళ్లి ఎనిమిదిన్నరకు! కల్యాణమండపం తనకు తెలిసిందే!

ఎనిమిదింటికే అతడు తయారయి శ్రీనివాసరావుకి చెప్పాడు. "నేను పెళ్లికి వెళ్లొస్తాను'' తలూపాడు శ్రీనివాసరావు.

అతడు రిక్షా ఎక్కి కల్యాణమండపం వైపు వెళ్లాడు.

పందిట్లోనే నిలబడి ఉన్నారు మిత్ర బృందం! అతడిని చూసి కౌగిలించుకున్నంత పని చేశారు.

అప్పుడే మంగళవాద్యాల జోరు పెరిగింది. పురోహితుడి వేదమంత్రాలు హోరు పెరిగింది.

"మాంగల్యం తంతునానేనా మమజీవన హేతునాం..."

కమలాకర్ పెళ్ళికూతురు మెడలో మాంగల్యధారణ చేస్తున్నాడు. మిత్రులంతా అక్షితలు చల్లారు.

"అయిపోయింది. మనవాడి జీవితంలో బ్రహ్మచారి ఘట్టం పూర్తయిపోయింది. ఇక నుండి వాడి నెత్తిన బరువు బాధ్యతలు పడిపోతాయి. అల్లరి చిల్లర తిరుగుళ్ళు పూర్తిగా తగ్గిపోతాయి'' ఆలీ నవ్వుతూ పలికాడు.

"పెళ్ళయితేనే బరువు బాధ్యతలు తెలుస్తాయనడం నాన్సెన్స్‌రా! పెళ్ళిపెటాకులు లేకుండానే నేను కుటుంబ బరువు బాధ్యతలు మోయడం లేదా?" రవి చెప్పాడు.

"అదీ నిజమేననుకో' ఆలీ ఒప్పుకున్నాడు.

కమలాకర్ మిత్రులందరినీ దగ్గరికి పిలిచాడు. వారితో గ్రూప్ ఫోటో తీయించుకున్నాడు.

"మేమింక వెళ్తాం" రవి తనతో అన్నాడు... సందడి కాస్త తగ్గాక.

"నువ్వు విజయవాడలో రెండురోజులు ఉంటున్నావా, లేదా?" రవిని అడిగాడు కమలాకర్.

"రేపు సాయంత్రం వరకూ ఉంటాను''

"రేపు రాత్రికి ఉండిపో, మనవాళ్ళందరికి పార్టీ ఇస్తున్నాను''

"చెప్పాక తప్పుతుందా?"

కమలాకర్ ఆడపిల్ల ఇంటికి వెళ్ళేందుకు బయలుదేరుతున్నాడు. వారు మిత్రుడి దగ్గర సెలవు తీసుకుని వచ్చేసారు.

అందరూ వెళ్ళి 'ఇండియా కాఫీ హౌస్'లో కూర్చున్నారు. "చాలా కాలమయింది కదూ మనమంతా ఇలా కూర్చుని?" అన్నాడు సురేష్.

"అవును. ఆ ఘోరం జరిగాక మనమంతా చెల్లాచెదరు అయ్యాం... చాలా భయంకరమయిన సంఘటన అది''

"నిజం"

టీ తాగాక వారంతా విడిపోయారు.

రవి ఇంటికి వెళ్లాడు.

శ్రీనివాసరావు మిల్లుకి వెళ్ళలేదు. తమ్ముడితో గడపాలని కాబోలు ఆగిపోయాడు.

"పెళ్ళి ఎలా జరిగిందిరా?"

"బాగా జరిగింది''

అతడు ఇంటి వాతావరణాన్ని పరిశీలనగా చూసాడు. తను నెలనెలా వెయ్యిరూపాయలు

పంపిస్తున్నాడు. అన్నయ్య మిల్లులో పనిచేసి వెయ్యి రూపాయలు దాకా సంపాదిస్తున్న ట్టుంది. అయినా ఆ ఇంట్లోని వారి బ్రతుకు చాలీ చాలని బతుకులానే ఉన్నట్టు కని పిస్తోంది. విజయవాడలో రెండువేల రూపాయ లతో ఒక కుటుంబం గడవడమంటే మాటలు కాదు. అసలే అద్దెకొంప, ఆపై ఇద్దరు పిల్లల ఇంగ్లీషు మీడియం చదువు.

ప్రశాంత్ ఎనిమిదో తరగతికి వచ్చేసాడు. సతీష్ ఆరు చదువుతున్నాడు. పిల్లలు మునుప టంత బొద్దుగా లేరు. కొద్దిగా సన్నబడ్డారు. దరిద్ర ప్రభావం పిల్లలమీద పడటం బాధాకర మయిన విషయం.

చాల్హాకాలానికి ఇంటికొచ్చిన మరిదికి రుచి గా వండిపెట్టింది సరోజ.

రెండురోజులు రెండు గంటల్లా గడిచిపో యాయి.

రెండోరోజు సాయంత్రం కమలాకర్ పార్టీ ఇచ్చాడు.

ఆ రాత్రికే అతడు హైదరాబాదు బయలు దేరాడు. శ్రీనివాసరావు మరోరోజు ఉండి వెళ్ళ మన్నా అతడు వినలేదు.

శ్రీనివాసరావు బస్టాండ్ వరకూ వచ్చాడు.

హైదరాబాదు వెళ్ళే బస్సులు ఒక్కటీ స్టాండ్‌లో లేవు. వారిద్దరూ ఓ పక్కగా నిలబ డ్డారు.

"రవీ! నువ్వు అక్కడ, మేము ఇక్కడ... మనం ఇలా దూరంగా బ్రతకడం నాకిష్టంలే దురా''

"నాకూ ఇష్టంలేదు'' రవి చెప్పాడు. "నేనూ మరో మంచి జాబ్‌కోసం ప్రయత్నిస్తున్నాను. కాని నా ప్రయత్నాలు ఫలించడంలేదు. నేను అక్కడ కాస్త స్థిరపడితే, మనమంతా దిగులు లేకుండా బతకగలిగే పొజిషన్ వస్తే తప్ప కుండా మిమ్మల్ని తీసుకువెళతాను''

శ్రీనివాసరావు మరేం మాట్లాడలేదు.

బస్సు వచ్చింది. "వెళ్ళొస్తాను'' తలూపాడు శ్రీనివాసరావు.



వాటర్ బౌన్‌డెడ్ మెకడమ్ సంక్షిప్తంగా చెప్పాలంటే డబ్ల్యూ. బి.యమ్. ముందుగా ఉన్న రోడ్‌ని స్కారిఫైయింగ్ చేస్తారు. దాని మీద గ్రావెల్ పరచడం, దానిపై కంకర వేసి, పైన మళ్ళీ గ్రావెల్ చల్లి వాటర్‌తో తడిపి రోలింగ్ చేయడం ఇదే డబ్ల్యూ.బి.యమ్.

ఆ రోజుతో డబ్ల్యూ.బి.ఎమ్. అయిపో తుంది. ఇక తారు వేసే పని స్టార్ట్ కావలసి ఉంది. అది కోల్డ్‌మిక్స్ కాబట్టి, హాట్‌మిక్స్ ప్లాంట్ అవసరంలేదు. హాట్‌మిక్స్ ప్లాంట్ చాలా ఎక్కువ పెట్టుబడితో కూడుకున్నది.

ఒక పెద్ద ప్లాంట్ ఉంటుంది. రెండు మూ డు కన్వేయర్ బెల్ట్స్‌ద్వారా చిప్స్ డ్రమ్ములలో పడతాయి. ట్వల్వ్ యమ్.యమ్, సిక్స్ యమ్. యమ్, టస్ట్- మొత్తం పెద్ద డ్రమ్ములోకి వెళుతాయి. మరో పైప్ ద్వారా బిటుమిన్ ఆ డ్రమ్‌లో పడుతుంది. చాలా హైటెంపరేచర్‌లో డ్రమ్ తిరుగుతూ ఉంటుంది. ఆ మిక్స్ మరో కన్వేయర్ బెల్ట్‌ద్వారా డైరెక్ట్‌గా టిప్పర్‌లో పడుతుంది. ఆ మిక్స్‌ని మరో మిషన్‌ద్వారా రోడ్‌మీద లెవల్ చేసి రోలింగ్ చేయించడం హాట్‌మిక్స్ విధానం!

అలాకాకుండా రోడ్డుపక్కనే తారు డ్రమ్ము లలో వేడిచేసి చిల్లుడబ్బాలతో ముంచి రోడ్డు మీద చల్లి చిప్స్‌పరచి, రోలింగ్ చేయడం




కోల్డ్‌మిక్స్ విధానం.

ఆ రోడ్ బిటుమిన్ వర్క్ కోల్డ్‌మిక్స్‌తో జరగబోతోంది.

అజయ్ లెవల్స్ చూసుకుంటున్నాడు. తాహిర్ పాలమూరోళ్ళ పక్కనే నిలబడి గ్రావెల్ చల్లిస్తున్నాడు. ఎక్కడ లెవల్ తక్కువగా ఉందో చెపుతున్నాడు అజయ్.

వాటర్ టాంకర్ నీళ్ళు వదులుకుంటూపోతోంది. వెనుకే రోలర్ రోలింగ్ చేస్తుంది. ఒకవైపు లారీ సిక్స్ యమ్.యమ్. కంకర రోడ్ అంచున అన్‌లోడింగ్ చేస్తుంటే ఆలీబేగ్ అక్కడే నిలబడి ఉన్నారు.

"అరే మస్తాన్! లోడ్ మరీ తక్కువ ఉందే మిత్రా. మనం క్రషర్ వాళ్ళకు ఇచ్చేది డబ్బులా చిల్లపెంకులా?... లోడ్ బాగా చేసుకురా'' డ్రైవర్‌మీద ఎగురుతున్నాడు ఆయన.

"అలాగే సాబ్! ఈ లోడ్ నేను చూడకుండా లాగించేసాను. ఈసారి దగ్గరుండి లోడ్ చేయిస్తాను''

"జాగ్రత్త! ఈసారి లోడ్ తక్కువ వస్తే మాత్రం, రెండు తగిలిస్తాను''

మస్తాన్ నవ్వుకుంటూ తలూపాడు.

ఆలీబేగ్ తన వర్కర్స్‌ని తిడతాడు కొడతాడు, వెంటనే దగ్గరికి తీసి అడిగింది ఇస్తాడు. అందువలననే ఆయన తిట్టినా, కొట్టినా వర్కర్స్‌కి కోపం రాదు.

ఎప్పుడూ లేనిది ఆయన ఆరోజు ఉదయం నుండి సైట్‌లోనే ఉన్నారు. మధ్యాహ్నం జీప్ పంపి కేరియర్ సైట్‌కే తెప్పించాడు.

ఆలీబేగ్‌కి ఆనందంగా ఉంది. సకాలంలోనే వర్క్ పూర్తయిపోతోంది. అందులోనూ కనీసం రెండు లక్షల రూపాయలు లాభం మిగిలేలా ఉంది. ఇందులో రవి కష్టం, తెలివితేటలు, నేర్పు చాలా ఉన్నాయనీ, అవే తనకు లాభం సంపాదించి పెట్టాయనీ ఆయనకు తెలుసు.

సంవత్సరంక్రితం రవికి కాంట్రాక్ట్ ఫీల్డ్ అంటే ఏమిటో అసలు తెలియదు. అయితే రెండు మూడు నెలల్లోనే అతడు అంతా తెలుసుకున్నాడు. లారీ మెకానిజం నుండి, క్రాస్ సెక్షన్స్ గీయడంవరకూ నేర్చుకున్నాడు. అజయ్ సైట్‌కి రాకపోయినప్పటికీ తనే లెవల్స్ చూడగలడు.

పైగా, అతడిది చక్కటి ప్లానింగ్! వృధాఖర్చులు ఎక్కువ కానివ్వలేదు. అనవసరమైన పనులేవీ చేయించలేదు. అందువలననే తనకు అంత లాభం రావడం... ఇదంతా రవి ప్రయోజకత్వమే అనుకున్నాడాయన.

కాంట్రాక్ట్ వర్క్స్‌లో ఆయనకు పదిహేను సంవత్సరాల అనుభవం ఉంది. లక్షా, రెండు లక్షల రూపాయల నామినేషన్ వర్క్‌లతో ఆయన ఈ ఫీల్డ్‌లోకి వచ్చాడు. ఇప్పుడు యాభై, అరవైలక్షల ఎస్టిమేషన్ వర్క్స్ తీసుకుంటున్నాడు. కొన్ని వర్క్స్‌లో ఆయనకు చేతులు కాలాయి. కొన్ని వర్క్‌ల్లో కాసింత లాభం మిగిలింది. కాని పెద్ద లాభం వచ్చిన వర్క్ ఇదే!

రవిలోని సమర్ధతను ఆయన ఏనాడో గుర్తించాడు. అందువలననే రవిని ఎన్నటికీ వదలకూడదన్న ఆలోచన ఆయనకు ఇప్పుడిప్పుడే వస్తోంది. జీతం మరికాస్త పెంచి, వసతి సౌకర్యాలు కలిపించి, అతడిని తన దగ్గరే ఉంచుకోవాలి.

సూర్యుడు అలసిపోయి పశ్చిమాన కొండలలో విశ్రమించే నిమిత్తం జారుకుంటున్నాడు. పగలంతా శ్రమపడిన జనం విశ్రాంతి కోరుకునే సమయం అది.

ఆలీబేగ్ రవి దగ్గరకు నడిచాడు. ఆ సమయానికి రవి తాహిర్‌కి చెపుతున్నాడు. "లేబర్‌ని వెళ్ళిపొమ్మను. రేపు వాళ్ళను జీరో పాయింట్ దగ్గర సైడ్ బరమ్స్ పని మొదలు పెట్టమని చెప్పు'' తాహిర్ తలూపి వెళ్ళిపోయాడు.

అజయ్ అతడి దగ్గరగా వచ్చి "రవిసాబ్! నేను రేపు చాలా ఉదయమే సైట్ దగ్గరకు రావాలిసి ఉంటుంది'' అన్నాడు.




"అవును... రేపు యస్.ఇ. ప్రోగ్రాం ఉంది కదా! నువ్వు ముందుగా వచ్చి ఇన్‌స్ట్రుమెంట్స్ రడీ చేసి పెట్టాలి''

"కాని... అంత ఉదయమే ఇక్కడికి బస్సు లేదు''

రవి ఆలోచనలోపడటం గమనించి "దాన్దే ముంది రవీ! అజయ్‌కి స్కూటర్ ఇచ్చెయ్యి. మనం జీపులో వెళ్దాం. రేపు మనిద్దరం జీపులో వచ్చేయొచ్చు'' చెప్పాడు ఆలీబేగ్.

రవి తలూపి స్కూటర్ తాళాలు అజయ్ చేతిలో పెట్టాడు.

అందరికీ పనులు అప్పగించాక, రవి జీపు ఎక్కాడు. ఆలీబేగ్ జీపు ముందుకి పోనిచ్చాడు.

జీపు ఒక కిలోమీటర్ ప్రయాణించాక ఆలీ బేగ్ సంభాషణ ప్రారంభించారు.

"రవీ! మీ అన్నగారి కుటుంబం విజయవాడలో ఉందనీ, వారిని హైదరాబాదు తీసుకొచ్చి నీతో ఉంచుకోవాలని... నాతో చాలాసార్లు చెప్పావు''

ప్రస్తుతం ఆ ప్రస్తావన అవసరమేమిటో అతడికి అర్థంకాలేదు. తల తిప్పి ఆయన వంక చూడసాగాడు.

"మనకి ఇబ్రహీంపట్నం, మైసారం రోడ్ వర్క్ వచ్చింది కదా! ఆ వర్క్ కూడా నీకే అప్పగించాలనుకుంటున్నాను. అలాగే, మీ అన్నగారిని తీసుకొచ్చి ఆ వర్క్‌మీది మెషినరీ మెయిన్‌టెన్ చేసుకోమను... మన స్టోర్ రూం కూడా ఖాళీ చేయిస్తాను. మీ అన్నగారి కుటుంబం అందులో ఉండొచ్చు. నెక్స్ట వర్క్ నుంచి నీకు మరో ఐదువందలు జీతం పెంచుతాను''

రవికి చాలా ఆనందం కలిగింది. ఓ 'మూడు నెలల్రకితం' తను విజయవాడ వెళ్ళినప్పుడు అన్నయ్య కాస్త దిగాలుగా కనిపించాడు. బహుశా అతనికి ఆ రైసుమిల్ ఉద్యోగం తప్పుదనుకున్నాడేమో! తమ్ముడు తనను మరచిపోయాడని భావించాడేమో! అనుక్షణం తన మనసులో ఇంటి స్థితిగతులే మెదలాడుతున్నాయన్న విషయం ఆయనకెలా చెప్పాలో తనకు అర్థంకాలేదప్పుడు.

"ఈరోజే వారికి జాబు వ్రాయి. వీలయినంత త్వరగా అక్కడి వ్యవహారాలు చక్కబెట్టుకోమని చెప్పు. డబ్బు అవసరమవుతుందేమో రేపు కొంత ఇస్తాను. పంపించు''

అతడి మనసు ఆయనపట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. అదే సమయంలో అతడి కనులముందు తమ కుటుంబమంతా కలసి ఉండబోయే సన్నివేశం కదలాడింది. చాలాకాలం తర్వాత తామంతా ఒకచోట ... అతడు ఆ ఊహాప్రపంచంలో ఉండగానే జీపు ఓ ఇంటిముందు ఆగింది. అది ఏ ఏరియానో అతడికి తెలియదు.

"లోపలికెళ్దాం రా రవీ''

అతడు ప్రశ్నార్థకంగా ఆలీబేగ్‌వంక చూసాడు "ఇది నా మిత్రుడి ఇల్లు. చాలారోజులయింది మాట్లాడుకుని! కాసేపు కూర్చుని వెళ్దామని ఆగాను''

ఆలీబేగ్ కాలింగ్‌బెల్ కొట్టారు. అరని ముషం తర్వాత తలుపు తెరుచుకుంది. ఇంచుమించు ఆలీబేగ్ వయసే ఉన్న వ్యక్తి తల బయటకుపెట్టి ఆయనను చూసి చిరునవ్వు నవ్వాడు "ఆయియే సాబ్!... చాలా రోజులకు కనిపించామన్న మాట"

వారిద్దరూ లోపలికి నడిచారు "ఈయన..." రవిని చూస్తూ ప్రశ్నించాడా వ్యక్తి

"మా సైట్ ఇన్‌ఛార్జ్! పేరు రవి..." అని రవితో చెప్పాడు. "ఈయన నా స్నేహితుడు. పేరు రామచంద్రరావు. ఉస్మానియా యూనివర్సిటీలో పనిచేస్తున్నారు''

ఆయన చేయి చాపాడు. రవి చేయి కలిపాడు.

"మీది ఏ సబ్జెక్ట్?"

"సోషియాలజీ' ప్రస్తుతం "'భారతదేశం మతం ఇతర దేశాలతో పోలిక అనే

అంశంమీద రీసెర్చి చేస్తున్నాను''

రవి కాస్త ఇంటరెస్ట్‌గా ముందుకు వంగాడు. ఆ వయసులో ఆయన ఒక రీసెర్చి స్కాలర్‌గా... ఆశ్చర్యమేసింది.

"వన్ మినిట్' ఆయన లోపలికి వెళ్ళాడు. నిముషం తర్వాత ఆయన మిసెస్ కాబోలు అక్కడికి వచ్చి ఆలీబేగ్‌కి నమస్కరించింది "మీరిటు రావడమే లేదు భాయీసాబ్' అంది.

ఆలీబేగ్ నవ్వి ఊరుకున్నారు. "కాఫీ తీసుకు వస్తాను'' ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

రామచంద్రరావు వారి ఎదురుగా కూర్చున్నారు.

మిత్రులిద్దరూ కాసేపు అవీఇవీ మాట్లాడుకున్నాక, రవి ఆయనను అడిగాడు.

"మీరు రీసెర్చి చేసే సబ్జెక్ట్ గురించి చెప్పండి''

ఆయన కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

సూర్యాస్తమయ కిరణాలు కిటికీలోనుండి లోపలికి జాలువారుతున్నాయి. ఆయన పడమటి వైపే కూర్చుని ఉన్నారు. ఆయన వెనుకే ఆ కిరణాలు... ఎందుకనో ఆ దృశ్యం రవి మనసుకు హత్తుకుపోయింది. ఆయన చెప్పిన మాటలు కూడా!

"భారతదేశం... ఒక పవిత్రదేశం! ఈ దేశానికి ఆ పవిత్రత ఎవరివల్ల వచ్చింది. హిందువుల వల్లనా- ముస్లింల వల్లనా?! తరతరాలుగా ఈ దేశంలో రెండు జాతుల మధ్య, రెండు మతాలమధ్య పోరాటాలు జరుగుతూనే వచ్చాయి. ఈ దేశంలోనే కాదు ఏ దేశంలోనయినా, ఏ కాలంలోనయినా రెండు వేర్వేరు జాతులు లేదా మతాలు ఉంటే వారి మధ్య ఘర్షణ తరచుగానో అప్పుడప్పుడూనో తప్పక వస్తుంది. అది దక్షిణాఫ్రికాలోని తెల్లవారు, నల్లవారు కావచ్చు. రువాండాలోని హుటులు, టుట్సీలు కావచ్చు లేదా భారతదేశంలోని హిందూ, ముస్లింలు కావచ్చు. రెండు బలమయిన వర్గాలమధ్య ఘర్షణ అనివార్యం... అని చెప్పడమే నేను చేయబోతున్నది. కొన్ని చారిత్రిక ఆధారాలాధారంగా నేను ఆ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాను''

ఆయన చెప్పే సిద్ధాంతం భయంకరంగా తోచింది రవికి.

"అంటే ఈ దేశంలో కూడా రెండు బలమయిన మతాలమధ్య ఘర్షణ ఏనాటికయినా అనివార్యమని మీ అభిప్రాయమా?"

"అభిప్రాయం కాదు. అక్షరసత్యం"

అలీబేగ్ వారిద్దరి సంభాషణ యధాలాపంగా వింటున్నారు.

"భారతదేశంలో మతఘర్షణలకు ఆస్కారమేముంది. ఇక్కడ హిందూ, ముస్లింలు కలసి మెలసి జీవిస్తున్నారు కదా?"

"ఎక్కడ జరుగుతోందలా?" ఆయన ఎదురు ప్రశ్నవేశారు. "ఈ దేశంలోని మతకల్లోలాల వార్తలు మీరు చూడడం లేదా?"

"అవి..." జవాబు చెప్పేందుకు అతడు కొద్దిగా ఆలోచించుకోవలసి వచ్చింది. "ఎవరో, ఎక్కడో, ఏదో రెచ్చగొడితే కొందరు రెచ్చిపోయి''

ఆయన వెంటనే చెప్పాడు. "చరిత్రలోని ప్రతి ఘర్షణా ఎవరో రెచ్చగొడితే జరిగినదే! నిన్నటికినిన్న సద్దాంహుస్సేన్ రెచ్చగొట్టబడిన వ్యక్తికాదా? నేడు రామాలయ నిర్మాణం అనేది స్లోపాయిజన్‌లా మతావేశాన్ని కల్గించడం కాదా? అంటే 'ఇక్కడ కూడా ఘర్షణకు అంకురార్పణ జరిగిందంటారా' లేదా?"

రవి కొద్దిక్షణాలు ఆలోచిస్తూ గడిపాడు. ఆయన చెప్పే మాటలలో వాస్తవం లేకపోలేదు.

"... మరి ఇతర దేశాలతో పోలిక...?!"

"ఇతరదేశాలలో కూడా... జాతి, మత వైషమ్యాలున్నాయి. శ్రీలంక, అంగోలా, రువాండా... దక్షిణాఫ్రికా, బోస్నియా...! కొన్ని దేశాలలో నిజంగానే జాతుల అణచివేత




ఉంది. మరికొన్ని దేశాలలో అణచివేత లేకున్నా అసంతృప్తి! అణచివేతకు దక్షిణాఫ్రికా ఉదాహరణయితే, అసంతృప్తికి శ్రీలంక రువాండా, భారతదేశాలు నిదర్శనం. అణచివేత లోనుండి విప్లవం పుట్టుకొస్తుంది. అసంతృప్తి లోనుండి వచ్చేది ఘర్షణ. శ్రీలంకలో అల్పసంఖ్యాకులయిన తమిళియన్లు అసంతృప్తి ఫీలవుతున్నారు. అదే రువాండాలో, భారతదేశంలో అధికసంఖ్యాకులు అసంతృప్తిపాలవుతున్నారు.

"నాకెందుకో భారతదేశానికి, రువాండాకి మధ్య కొన్ని పోలికలు కనిపిస్తున్నాయి. భారతదేశంలోలానే అక్కడ అధిక సంఖ్యాకులయిన హుటులు ఎనభై శాతం మంది. ఇక్కడి ముస్లింలలానే ఆ దేశంలో టుట్సీల జనాభా పధ్నాలుగు శాతం. అధిక సంఖ్యాకులయిన హుటులు, అల్పసంఖ్యాకులయిన తమను అణచివేస్తున్నారని టుట్సీల ఆరోపణ! హుటులకేమో టుట్సీలను చూస్తే ఈర్ష్య, కాస్త అసంతృప్తి! అక్కడ కూడా ఇక్కడిలానే అప్పుడప్పుడూ ఘర్షణలు తలెత్తుతుంటాయి. సమసిపోతుంటాయి... నా ఊహ సరయితే... చాలా కొద్దికాలంలోనే ఈ దేశాలలో పెద్ద ఎత్తున ఘర్షణ జరుగుతుంది. ఆ పోరాటంలో మూర్ఖంగా ఒకరినొకరు చంపుకుంటారు. ఆ మరణాల సంఖ్య ఊహాతీతంగా ఉంటుంది..." ఆ ఊహ ఆయనకే భయం కలిగించినట్టుంది. కొద్దిక్షణాలు కన్నులు మూసుకుని తపస్సమాధిలోలా ఉండిపోయాడు. ఆ గదిలో భయంకరమయిన నిశ్శబ్దం కదలాడింది.

ఆ నిశ్శబ్దం మరింతసేపు ఉండేదేమో, ఆయన మిసెస్ కాఫీ ట్రేతో వచ్చింది. "కాఫీ తీసుకోండి'' చెప్పింది.

రామచంద్రరావు కన్నులు తెరిచాడు. రవికి కాఫీ అందిస్తూ "తీసుకోండి'' చెప్పాడు.

ఒక చేదునిజం విన్న మనసు కుదుటపడేందుకు కొంతసమయం అవసరం. అతడు పరధ్యాసగానే కాఫీ అందుకున్నాడు.

ఆమె లోపలికెళ్ళిపోయింది.

"భవిష్యత్ గురించి ఇంత విపులంగా చెపుతున్న మీరు, ఇలాంటి ఘర్షణలు తలెత్తకుండా నివారణోపాయాలు ఏవయినా చెపుతున్నారా?"

ఆయన నవ్వాడు. ప్రపంచ చరిత్ర అర్థంచేసుకున్న విజ్ఞానం ఆ నవ్వులో ప్రస్ఫుటించింది.

"రెచ్చగొట్టేవారు ఉన్నంతకాలం, రెచ్చిపోయేవారు మిగిలినంత కాలం... ఏ దేశంలోనయినా 'ఘర్షణ' తప్పనిసరి''

మాట్లాడేందుకు ఏమీ మిగిలిలేదని తెలుస్తోంది. రవి మౌనంగా ఉండిపోయాడు.

ఆలీబేగ్ మరికాసేపు మాట్లాడాక లేచారు. "వెళ్లొస్తాను''

ఆయనను జీప్‌వరకూ వదిలేందుకు రామచంద్రరావుగారు కూడా పక్కనే రాసాగారు. వారిద్దరూ అలా పక్కపక్కనే నడుస్తుంటే అతడికి ఒక సుందరదృశ్యం చూస్తున్నట్టు అనిపించింది. ఒక హిందూ, ముస్లిం అభిమానంగా మనసులో ఏ కల్మషాలూ లేకుండా... వాస్తవంలో దేశమంతా ఇలాగే ఉంది. అయితే రెచ్చగొట్టబడ్డప్పుడు మాత్రం... సోదరులుగా మెలిగేవారే బద్ధశత్రువులుగా మారుతూ విధ్వంసం సృష్టిస్తారు.

జీప్ బయలుదేరింది.

రోడ్డు అంచునే జనం! హిందూ, ముస్లిం, క్రైస్తవ, జైన... అన్ని మతాలవారు కలసి నడుస్తూ.

అతడికి రామచంద్రరావుగారి మాటలు గుర్తుకువచ్చాయి.

"రెచ్చగొట్టేవారు ఉన్నంతకాలం, రెచ్చిపోయేవారు మిగిలినంతకాలం ఏ దేశంలోనయినా 'ఘర్షణ' తప్పనిసరి''

"భారతదేశం... రువాండా... చాలా కొద్దికాలంలోనే ఈ దేశాలలో పెద్దఎత్తున 'ఘర్షణ' జరుగుతుంది. ఆ పోరాటంలో ఒకరినొకరు

మూర్ఖంగా చంపుకుంటారు. ఆ మరణాల సంఖ్య ఊహాతీతంగా ఉంటుంది''

వారు- వీరేనా?! రేపటి ఘర్షణకు బలిజీవులు... అతడికెందుకో ఎన్నడూ లేనంత భయం కలిగింది.

అతడు మౌనంగా ఉండడం గమనించాడు ఆలీబేగ్. "ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"రేపు... రేపు గురించి! రామచంద్రరావుగారన్నట్టు... మనిషిని మనిషి చంపుకునే రోజు మరెంతో దూరంలేదేమోననిపిస్తుంది''

"మనం ఎంత ఆలోచించినా చేయగలిగింది ఏమీలేదు. నిమిత్తమాత్రులం"

"నిజమే'' తలూపాడు అతడు. మనసులో మాత్రం పార్థించాడు 'దేవుడా! రక్షించు నా దేశాన్ని స్వార్థపరులనుండి...' అని కాదు. మానవుడిని ప్రార్థించాడు. 'మానవుడా! సాటి మనిషిని రెచ్చగొట్టవద్దు. మారణహోమాన్ని సృష్టించవద్దు'

★ ★ ★

రవి రైల్వేస్టేషన్‌కి జీపు తీసుకెళ్ళాడు.

అర్థగంట ఆలస్యంగా వచ్చింది చార్మినార్ ఎక్స్‌ప్రెస్. అతడు ప్లాట్‌ఫారం టిక్కెట్ కొనుక్కుని స్టేషన్ లోపలికి వెళ్ళాడు.

రైలు ఆగింది. జనరల్ కంపార్ట్‌మెంట్‌లో నుండి శ్రీనివాసరావు, సరోజ పిల్లలు దిగారు. పిల్లలు అతడిని చూడడంతోనే "బాబాయ్'' అంటూ చేతులు పట్టేసుకున్నారు. శ్రీనివాసరావు, సరోజ లగేజీ పట్టుకుని అతడి దగ్గరగా వచ్చారు. పిల్లలు బాగా చిక్కిపోయి ఉండడం గమనించాడు రవి. శ్రీనివాసరావుకి కళ్ళ చుట్టూ నల్లని వలయాలు ఏర్పడి ఉన్నాయి. 'పాపం! ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపాడో ఈయన' అనుకున్నాడతడు. వదినగారు శల్యమైపోయి ఉన్నారు. అంతకన్నా ముఖ్యంగా... వారెవరి ముఖాలలోను 'జీవకళ' లేదు. ఏదో ప్రాణముంది కాబట్టి బతుకుతున్నట్టున్నారు.

"ఏరా రవీ! బాగున్నావా?"

"బాగున్నాను'' అతడు వారి చేతిలోని లగేజీ అందుకున్నాడు "ఎలాసాగింది ప్రయాణం?" వదినగార్ని అడిగాడు.

"వరంగల్ వరకూ కూర్చునేందుకు సీటు కూడా లేదు రవీ! నిలబడే వచ్చాం"

"రిజర్వేషన్ చేయించుకుని ఉండాల్సింది''

"నేనూ అదే చెప్పాను. ఆయన వింటే కదా! 'విజయవాడ నుండి హైదరాబాదు వరకూ రిజర్వేషన్ ఏమిటే' అంటూ విసుక్కున్నారు''

"రిజర్వేషన్‌కి యాభై, వందా... ఎందుకు అనవసరంగా ఖర్చుచేయడం, రెండు గంటలు నిలబడితే సరిపోయేదానికి''

"ఇలాంటివన్నీ మిగిలిస్తే మనం మిద్దెలు కట్టి ఉండేవాళ్లం"

"నువ్వు నోర్మూసుకో' కసురుకున్నాడు శ్రీనివాసరావు. సరోజ మాటలు ఆపేసింది.

"రండి'' రవి ముందుకు నడిచాడు. అతడి పక్కనే పిల్లలు, వెనుకే పెద్దలు అనుసరించారు.

జీపులో లగేజీ వేసి డ్రైవింగ్‌సీట్లో కూర్చున్నాడు అతడు. "ఎక్కండన్నయ్యా'' ముందు సీటు చూపించాడు చేత్తో. శ్రీనివాసరావు, పిల్లలు ముందు కూర్చుంటే, వెనుక సీట్లో సరోజ కూర్చుంది.

"ఎక్కడిది బాబాయ్ ఈ జీపు?" పెద్దవాడు ఉత్సాహంగా అడిగాడు.

"నా యజమానిది''

మరిది స్టేషన్‌కి జీపులో వస్తాడని ఊహించలేదామె. ఒక కొత్త వెలుగు సరోజ కన్నులలో కదలాడింది.

జీప్ కొద్దిదూరం పోనిచ్చాక, ఒక హోటల్ ముందు ఆపాడు అతడు.

"మీరంతా ముఖాలు కడుక్కుని ఉన్నారు కదా!"

తలూపారు వారు.




"ఇంటికెళ్లి వంట చేయడం ఇప్పుడు కుదర దు. ఇక్కడే కాస్త టిఫిన్ చేసి వెళ్దాం"

తలలూపారు వారు.

హొటల్‌లో టిఫిన్ తిన్నాక, ఇంటివైపు పోనిచ్చాడు జీపు.

ఆలీబేగ్ వరండాలోనే ఉన్నారు. నూర్జహాన్ తలుపుచాటున ఉంది.

వారిని చూసి ఆలీబేగ్ వాకిటవరకూ వచ్చి "రండి... రండి'' అన్నాడు. నూర్జహాన్ వారి వంక ఆసక్తిగా చూసింది.

రవి వారికి రూమ్ చూపించాక జీపులో లగేజీ అక్కడ పడేశాడు.

ఆలీబేగ్‌గారు లోపలికొచ్చి శ్రీనివాసరావుని ప్రయాణ విశేషాలు అడిగారు. రవివంక తిరిగి "ఈ మధ్యాహ్నం మీరు భోజనం వండనవస రంలేదు. మేమే పంపిస్తాం" చెప్పాడు.

"మీకా శ్రమ ఎందుకండి?" మొహమాటప డ్డాడు శ్రీనివాసరావు.

"ఫర్వాలేదులెండి'' అన్నాడాయన. "రవీ! జీప్ తీసుకువెళుతున్నాను. ఈరోజు నువ్వు సైట్‌కి రానవసరంలేదులే. మీవారికి కావల సినవేవో చూసి తెచ్చివ్వు''

"అలాగే సార్''

ఆలీబేగ్ వెళ్లిపోయారు.

తనవాళ్లకు ఆ ఇంటి వాతావరణం, వ్యవ హారం నచ్చాయని కొద్దిసేపట్లోనే అర్థమయిపో యింది రవికి.

ఆ మధ్యాహ్నం భోంచేశాక అతడు పార్సి లాఫీసుకి వెళ్లి ఇంటి సామాను ట్రక్‌లో వే యించుకొచ్చాడు. అదంతా సర్దేసరికి రాత్ర యింది.

మర్నాడు అన్నయ్యను తీసుకుని సైట్‌కి వెళ్లాడు అతడు. శ్రీనివాసరావుకి వర్క్ గు రించి కొంత వివరించి చెప్పాడు. మరో నాలుగయిదు రోజుల్లో ఆ కొత్తవర్క్ స్టార్ట్ కాబోతుంది. ఆ వర్క్ బరువుబాధ్యతలు ఎక్కువగా అన్నయ్యమీదనే ఉంచాలని రవి కోరిక. ఆలీబేగ్ అభిప్రాయం కూడా అదే!

మధ్యాహ్నం ఆలీబేగ్ సైట్‌కి వచ్చారు.

"ఏమిటి ప్లానింగ్'' రవిని ప్రశ్నించాడు.

"శంకరపల్లె వర్క్ దగ్గరుండే లేబర్‌ని రేపు ఇక్కడికి షిఫ్ట్ చేయాలి. అక్కడి కేంప్ ఇక్కడి కి మార్పించేస్తాను''

"వర్క్ బిగినయ్యాక కాకుండా, ముందుగా నే లారీలకు రిపేర్స్ ఉంటే చేయించెయ్యి. ఎలాగూ మీ అన్నగారున్నారుకదా! ఆయనకు చెప్పేస్తే తనే దగ్గరుండి పనులు చేయించు కుంటారు''

తలూపాడు అతడు.

ఆయన వెళ్లిపోయిన అర్ధగంట తర్వాత అజయ్ అక్కడికి వచ్చాడు. ఉదయంనుండి సైట్‌కి రాలేదు అతడు. తనకు పెళ్లిచూపులనీ, రాలేనని ముందురోజే చెప్పాడు. ఇప్పుడు కూడా టైంపాస్‌కోసమే ఇటు వచ్చినట్టున్నా డు.

"ఎలా జరిగాయి పెళ్లిచూపులు?"

"ఎలా ఏమిటి? అమ్మాయి నచ్చిందా లేదా? అని అడగాలి''

"అదే... అమ్మాయి నచ్చిందా?"

"అమ్మాయి నచ్చింది. నేనూ వారికి నచ్చా ను. కాకపోతే..."

"ఊఁ! కాకపోతే ఏమిటి?" రవి ప్రశ్నించా డు.

"నేను ఇంజనీరుననగానే వారు సంబరప డ్డారు. తీరా మన జీతం వెయ్యిరూపాయలనేస రికి ఆలోచనల్లో పడ్డారు'' బలవంతంగా నవ్వాడు అజయ్.

రవి ఏమీ మాట్లాడలేదు. ఏదయినా మాట్లా డాలంటే ఇక వ్యవస్థ గురించి మాట్లాడాలి. 'ఈ వ్యవస్థలో...' అంటూ మొదలుపెట్టడం అతడికిష్టంలేదు. ఏదో చెప్పాలి కాబట్టి "మ నకు ఎక్కడ రాసిపెట్టివుందో అక్కడ జరుగు తుంది'' అంటూ మాట దాటేశాడు.

అజయ్ అతడిపక్కనే ఉన్న శ్రీనివాసరా వుని చూసి, "ఈయన..." అడిగాడు.



"మా అన్నయ్య..." అజయ్‌ని చూపించి చెప్పాడు అతడు. "అన్నయ్యా... మా సైట్ ఇంజనీర్... అజయ్''

"నమస్కారం సార్..." చేతులు జోడించాడు అజయ్.

తనూ చేతులు జోడించాడు శ్రీనివాసరావు.

"చూడగానే మీ అన్నయ్యానే అయివుంటారనుకున్నాను. అయినా కన్‌ఫర్మేషన్‌కోసం అడిగాను''

అతడు నవ్వి ఊరుకున్నాడు.

"ఈయన మన సైట్‌మీదే ఉంటారుకదూ?"

తలూపాడు రవి.

వారిద్దరూ వర్క్ గురించి మాట్లాడుకుంటుంటే, శ్రీనివాసరావు ఆలోచనల్లోకి జారిపోయాడు. అజయ్ పెళ్లిచూపుల ప్రస్తావనతోనే అతడికి తమ్ముడి పెళ్లి గుర్తుకువచ్చింది.

అప్పుడెప్పుడో వ్యాపారం బాగా సాగుతున్నప్పుడు అచ్యుతరామయ్య సంబంధంకోసం ప్రయత్నించారు. అంతలోనే అన్ని ఉపద్రవాలు... ఆ ప్రయత్నం చేసి రెండేళ్లయిపోయింది. ఇప్పుడు రవి కాస్త స్థిరపడ్డాడు. వయసు కూడా ఇరవై అయిదేళ్లొచ్చేశాయి. ఇహ పెళ్లిప్రయత్నాలు చేయడం మంచిది. గొప్ప సంబంధాలు కాకపోవచ్చు... ఏదో గంతకు తగ్గ బొంత...

"నేను శంకరపల్లె సైట్‌కి వెళ్లొస్తాను''

"కాసేపు ఉంటాను.. రేపు ఉదయమే సైట్‌కి వస్తాను''

అతడు స్కూటర్ స్టార్ట్ చేశాడు. శ్రీనివాసరావుని వెనక కూర్చోమని పాత సైట్‌వైపు పోనిచ్చాడు.

అక్కడి కేంప్‌లో కూర్చుని పాపయ్యను పంపి పాలమూరు మేస్త్రిని పిలిపించుకున్నాడు. మర్నాడు ఉదయాన్నే టెంట్‌లు విప్పి ఉంచుకోమని, లారీ పంపుతానని చెప్పాడు.

"మన కేంప్ కూడా విప్పేయాలా సారూ?" అడిగాడు పాపయ్య.

"మిషనరీ మొత్తం షిఫ్ట్ అయిపోయేవరకూ నువ్విక్కడే ఉండాలి పాపయ్యా'' చెప్పాడు.

పాపయ్యకు అరవై సంవత్సరాలుంటాయి. ఒంటరివాడు! ఐదారు సంవత్సరాలనుండి ఆలీబేగ్ దగ్గరే ఉంటున్నాడు. నమ్మకస్తుడు. ఎక్కడ కేంప్ ఉంటే అక్కడే ఉంటుంటాడు. స్వంతంగా వండుకుని తింటాడు.

పాలమూరు మేస్త్రి బట్వాడా విషయం ప్రస్తావించాడు. టెంట్‌లు షిఫ్ట్ అయ్యాక నూకలు, బట్వాడా ఇస్తానని చెప్పాడు. మేస్త్రి వెళ్లిపోయాడు.

అన్నదమ్ములిద్దరూ కుర్చీలలో వెనక్కువాలారు.

"చాయ్ కాసుకువచ్చేదా బాబయ్యా?" పాపయ్య అడిగాడు.

"ఇవ్వు పాపయ్యా''

చుట్టుపక్కల కిలోమీటరు దూరంలో చాయ్ దుకాణం లేదక్కడ. అందువలననే పాపయ్యను పాలు ఎక్కువ తీసుకుని, అక్కడ వచ్చినవారికి చాయ్ ఇవ్వమని ఆలీబేగ్ చెప్పి ఉన్నారు. పాలఖర్చు కంపెనీయే భరిస్తుంది.

పాపయ్య గుడిసెలోకి దూరాడు. అన్నదమ్ములిద్దరూ ఒకరి ఎదురుగా ఒకరు మిగిలారు.

"ఈ వర్క్ మొత్తం నేనే మెయిన్‌టైన్ చేశాను'' అన్నాడు రవి.

"ఆలీబేగ్‌గారు కూడా చెప్పారు... చాలా త్వరగా పూర్తయిపోయిందని అన్నారు''

"రెండులక్షల దాకా లాభం మిగిలిందీ వర్క్‌లో''

"ఆ విషయం చెప్పలేదాయన"

"వ్యాపారస్తులు లాభాల విషయం పనివాళ్లముందు బయటపెట్టరు'' నవ్వుతూ చెప్పాడు రవి.

శ్రీనివాసరావు నవ్వాడు. 'అదీ నిజమే' అనుకున్నాడు మనసులో.

పాపయ్య చాయ్ పట్టుకుని వచ్చి వారికి అందించాడు.




చాయ్‌కప్పులు కిందపెట్టాక "వెళ్దామా అన్నయ్యా'' రవి పైకిలేచాడు. శ్రీనివాసరావు కూడా లేచాడు.

స్కూటర్ స్టార్ట్ అయిన చప్పుడుకు పాపయ్య లోపలనుండి వచ్చి "వెళ్తున్నారా బాబయ్యా'' అన్నాడు.

"ఆc!" అనేసి స్కూటర్ ముందుకు పోనిచ్చాడు.

నల్లని తారురోడ్డు... వారు వేసినదే! స్కూటర్ వేగంగా పోతోంది.

"ఏమయినా ఆలీబేగ్‌గారు మంచివారు'' వెనుకనుండి చెప్పాడు శ్రీనివాసరావు.

"కాబట్టే ఇంతకాలం ఆయన దగ్గర ఉండగలిగాను''

"అయినా ఒక వ్యక్తిని నమ్ముకుని, ఆయన మీదనే ఆధారపడి ఉండడం... అంత మంచిది కాదు. మనుషులన్నాక ఎప్పుడోకప్పుడు మన స్పర్థలు రాక మానవు. మనం మరోసారి రోడ్డుమీద నిలబడకూడదని చెపుతున్నాను. దెబ్బతిన్న మనుష్యులం! కీడెంచి మేలెంచడం మంచిది''

"నాకూ తెలుసన్నయ్యా ఆ విషయం! నేనూ మరో మంచి అవకాశంకోసం ప్రయత్నిస్తున్నాను''

"... అలా అని ఆశ్రయం ఇచ్చిన వ్యక్తిని నట్టేట ముంచిపోవడం మంచిదికాదు. ఒకరు ఆయనకు ఆసరాగా ఉండి, మరొకరు మన భవిష్యత్తుని వెతుక్కోవడం మంచిది''

"నేను ఒకవేళ మరో కంపెనీలోకి వెళ్లిపోయినా మీరు ఆలీబేగ్‌గారి దగ్గరే ఉండండి. ఆ ఆలోచనతోనే కొత్త వర్క్ బరువుబాధ్యతలు మీకే ఎక్కువ అప్పగించాలనుకుంటున్నాను. మీరు కాస్త అన్నింటా అనుభవం సంపాదించుకున్నాక నా ప్రయత్నాలు మొదలుపెడతాను''

స్కూటర్ ఇల్లు చేరింది.

వారు ఇంట్లోకెళ్లేసరికి నూర్జహాన్ సరోజ పక్కనే కూర్చుని ఉంది. ఏవో కబుర్లు చెప్పుకుంటున్నట్టున్నారు. వారిని చూడటంతోనే ఆమె లేచి నిలబడింది. ఓరగా రవివంక చూసింది.

"నువ్వు కూర్చోమ్మా'' నూర్జహాన్‌తో చెప్పాడు శ్రీనివాసరావు.

ఆమె కాస్త సిగ్గుపడుతూ అక్కడినుండి తప్పుకుంది.

"మంచిపిల్ల'' మెచ్చుకుంది సరోజ.

"ఇంతకీ ఏం మాట్లాడుకున్నారేమిటి?" అడిగాడు శ్రీనివాసరావు.

"ఏముంది! హైదరాబాదులో చూడదగ్గవి ఏమున్నాయని అడిగాను. తను చెపుతూ వుంది. ఇంతలో మీరొచ్చారు''

"పిల్లలేరి?"

"వాళ్ల బాబాయ్ గదిలో చదువుకుంటున్నారు''

ఆమె లేచి వేణ్ణీళ్లు స్నానానికి పెట్టసాగింది.



ఉదయమే బ్రష్ చేసుకుంటుంటే ఆలీబేగ్ కూడా బ్రష్ నోట్లో వేసుకుని పెరట్లోకి వచ్చారు. రవిని చూసి "ఈరోజు పేపర్ చూశావా?" ప్రశ్నించాడు.

"చూడలేదు'' అతడి జవాబు.

ఆయన ముఖం కాస్త ఆందోళనతో నిండి వుంది.

"పాతబస్తీలో ఒక మూల ఓ హిందువుని ముస్లిం చంపాడుట"



యథాలాపంగా విన్నాడు అతడు. ఆ వార్తలో పెద్ద విశేషమేమీ కనిపించలేదు. నోట్లోని ఉమ్మి కాలువలో వదిలాడు.

ఆలీబేగ్ అక్కడే ఉన్న చప్టామీద కూర్చున్నారు. "హైదరాబాద్‌లో మతఘర్షణలు ఆగిపోయి చాలాకాలమయిపోయింది. ఈరోజు ఈ వార్త చూస్తుంటే గతం పునరావృతమయ్యేట్టు కనిపిస్తోంది..." దిగులుగా పలికాడు.

ఎందుకనో ఆ క్షణం రవికి రామచంద్రరావు గుర్తుకువచ్చాడు. 'రెండు వేర్వేరు జాతులు, మతాలు ఒకచోట కలిసి జీవిస్తున్నప్పుడు 'ఘర్షణ' తప్పనిసరి! ఇక్కడ జరిగింది, జరగబోయేది అలాంటి ఘర్షణే!

ఆ వార్తపట్ల పెద్దగా స్పందించాల్సిన అవసరం కనిపించలేదు అతనికి. ఇక ఎంత పెద్ద ఘర్షణలు జరిగినా తను కోల్పోయేదేముంది? తనకు జరగాల్సిన అన్యాయం రెండు సంవత్సరాలక్రితమే జరిగిపోయింది... ఇప్పుడిక్కడ ఏ ఘర్షణ జరిగినా తను పోగొట్టుకునేది ఏమీ ఉండబోదు. ఆ ఆలోచనే అతడికా నిశ్చింత కలుగజేసింది.

అతడు ఆయన మాటలు పట్టించుకోకుండా "సార్! ఈరోజు అజయ్‌చేత బిల్లు తయారుచేయిస్తున్నాను'' చెప్పాడు.

ఆయన కూడా 'సమాజం'లోనుండి 'ఇంటికి' వచ్చాడు.

"ఇప్పటివరకూ మూడులక్షల రూపాయల వర్క్ జరిగింది''

"అయితే బిల్ చేయమని చెప్పు. సైట్‌మీదకు జె.ఇ. వస్తే సంతకం కూడా పెట్టించేసెయ్యి''

అతడు తలూపాడు.

"అన్నట్టు క్వారీలో మనం లేబర్‌ని పెంచవలసి వస్తుంది. మెటల్ మనకు ఉండే ఆ కొద్దిమంది అందించలేరు. మరో పది, పదిహేనుమందిని మాట్లాడాలనుకుంటున్నాను''

"అవసరమనుకుంటే అలాగే చెయ్యి''

ఆయన ముఖం కడుక్కునేందుకు బాత్‌రూమ్‌లో దూరారు.

అతడింకా నోట్లో బ్రష్ ఆడిస్తూనే ఉన్నాడు. ఆ ఇంటి తలుపు దగ్గర చప్పుడయితే అతడు కళ్లెత్తి చూశాడు. తలుపు దగ్గర చేరి నూర్జహాన్ నవ్వుతూవుంది. రవి తనవంక చూడడంతో కన్నులు తమాషాగా మూసి, తెరిచింది.

కంగారుగా చుట్టూ చూశాడు అతడు. తమను ఎవరయినా గమనిస్తున్నారేమోనని! శ్రీనివాసరావు గదిలో షేవింగ్ చేసుకుంటున్నాడు. సరోజ పొయ్యిముందు సెటిలయిపోయింది. పిల్లలు పుస్తకాలు తిరగేస్తున్నారు.

అతడికామె మనసు పూర్తిగా అర్థమయిపోయింది. కాని అతడు ముందడుగు వేయలేకున్నాడు. కారణాలు అనేకం. తమవి వేరువేరు మతాలు, అందులోనూ తమ కుటుంబం ఒక భయంకర ఘోరానికి గురయి ఇప్పుడిప్పుడే కోలుకుంటోంది. తనిప్పుడు ఇలాంటి ఘనకార్యానికి దిగితే జరగబోయే ఘోరానికి కుటుంబం మొత్తం బలికావల్సి వస్తుంది... ఏదేమయినా తనిప్పుడు చాలా జాగ్రత్తగా మసలుకోవడం మంచిది.

రవి కళ్లతోనే ఆమెను బెదిరించాడు. నూర్జహాన్ భయపడలేదు. పైగా నాలుక బయటపెట్టి వెక్కిరించింది. చేతులు చెవులదగ్గరపెట్టి ఆడించింది.

సరిగ్గా ఆ క్షణమే - సరోజ ఇంట్లోనుండి బయటకు వచ్చింది. వారిద్దరి చేష్టలు చూసింది.

ఆమెను చూడడంతోనే నూర్జహాన్ లోపలకు తప్పుకుంది. ఆమె హఠాత్తుగా మాయమవడానికి కారణమేమిటా అని తలతిప్పి చూసిన అతడికి వదిన కనిపించింది. అతడు తడబడ్డాడు... ఏదో తప్పుచేసిన ఫీలింగ్!

స్నానంచేసి, టిఫిన్‌ముందు కూర్చుంటే వదిన తన ముఖంలోకే చూస్తున్న భావన! అతడి ముఖం మరింత కిందకి దిగిపోయింది.

చాలా త్వరగా సైట్‌కి వెళ్లేందుకు రడీ




అయ్యాడు అతడు. శ్రీనివాసరావు తమ్ముడి తొందర చూసి ఏదో అవసరమయిన పని ఉంది కాబోలుననుకుని, తనూ త్వరగా తయారయ్యాడు.

పిల్లల్ని బడికి పంపించేశాక ఆమె నీరసంగా మంచంమీద వాలింది. తను ఒంటరిగా ఉంటే వచ్చివాలే నూర్జహాన్, ఎంతసేపటికీ రాలేదు. భయపడిపోయినట్టుంది పిల్ల!

ఆమెకు మొదటిరోజే' అనుమానం వచ్చింది. ఈరోజు అనుమానం నిజమని నిర్ధారణ అయింది. వయసులోవున్న ఒక ఆడపిల్ల, మగపిల్లాడు సైగలు చేసుకోవడం...!

నూర్జహాన్ అందమైన అమ్మాయి. లక్షలకొలదీ ఆస్తికి ఏకైక వారసురాలు. ఆ అమ్మాయికి రవి అంటే ఇష్టం. రవి కూడా ఆ అమ్మాయిని ఇష్టపడ్డట్టే ఉన్నాడు. అయితే... వారివి వేరువేరు మతాలు. ఒకరు ధనవంతులు, మరొకరు నిరుపేదలు... ఆలీబేగ్‌గారు ఎట్టిపరిస్థితుల్లోనూ ఒప్పుకోరు. తనకిమాత్రం... ఎంత అందం, ఆస్తి ఉన్నా ముసల్మానుల అమ్మాయిని ఇంటికోడలుగా ఆహ్వానిస్తే.. బంధువులంతా నవ్విపోతారు.

అంతకన్నా ముందు వీరిద్దరి సైగలు ఏ ఉపద్రవాన్ని తెచ్చిపెడతాయోనని ఆమెకు భయం పట్టుకుంది. ఆలీబేగ్‌గారు ఇంతవరకూ వీరి చేష్టలు గమనించినట్టులేదు. ఒక ముసలామె ఉంటే ఆమె మంచందిగలేదు. ఆయన గనుక వీరిని గమనిస్తే...?!

అసలే హైదరాబాదు... అందులోనూ చార్మినార్ ఏరియా. పైగా ముసల్మానుల అమ్మాయి. ఈ ప్రాంతంలో వారి మెజారిటీనే ఎక్కువ. సాయిబులకు మతపిచ్చి ఎక్కువని ఆమె విన్నది. తమ మతంలోని అమ్మాయిని వేరేవారు కన్నెత్తి చూసినా కళ్లు పీకేసేంత క్రూరులట వారు. ఈ విషయం బయటకు పొక్కితే...? రవి గతి ఏమవుతుందో?! తమను కూడా వీరు తన్ని వీధిలోకి నెడతారు.

సరోజకు బతుకుభయం పట్టుకుంది. ఒకనాటి దరిద్రం మళ్లీ మమ్మల్ని చేరబోతోందా?... దిగులేసింది.

లేదు... ఈ విషయం ఆలీబేగ్‌గారికి తెలియకముందే కంట్రోల్ చేయాలి. ఆ నిర్ణయానికి వచ్చాక ఆమె లేచి ఆలీబేగ్‌గారి ఇంట్లోకి వెళ్లింది. నూర్జహాన్ వంటగదిలో రోటీ చేస్తోంది.

సరోజను చూడడంతోనే ఆమె ఉలిక్కిపడింది. రాని నవ్వును పెదాలమీదకు తెచ్చుకుని "రండి... రండి'' అంది ఉర్దూలో. సరోజ వెళ్లి ఆమె పక్కనే నిలబడింది.

"ఏమిటి చేస్తున్నావు?"

"రోటీ''

"కూరలు చేసేశావా?"

"ఆఁ!... అయిపోయాయి''

కాసేపు అలాంటి సంభాషణ జరిపాక ఆమె అసలువిషయంలోకి వచ్చింది. "చూడమ్మా నూర్జహాన్! మీరు సాయిబులు, మేము హిందువులం. మీ ఆచారాలకు, మా పద్ధతులకు చాలా తేడా ఉంది. మేము ఆవుని పూజిస్తే, మీరు ఆవుమాంసం తింటారు. మీకో దేవుడు, మాకోదేవుడు..."

ఆమె ఏ విషయం చెప్పబోతోందో నూర్జహాన్‌కి తెలిసిపోయింది. మౌనంగా వినడం తప్ప మరేం చేయలేనని తెలిసిపోయింది.

"... అన్నింటికన్నా ముందు ఒక సాయిబుల పిల్లను మా అబ్బాయి పెళ్లిచేసుకున్నాడంటే 'కుర్రాడు చెడిపోయాడని' మా బంధువులు ఎగతాళి చేస్తారు. వాడికి పుట్టే పిల్లలు కులంలేనివాళ్లవుతారు. అలాగే... మీ నాన్నగారూ, మీ మతస్తులు ఈ విషయం బయటకు పొక్కిన వెంటనే మమ్మల్ని తరిమి, తరిమి చంపుతారు... అమ్మాయీ! మేము ఇప్పుడిప్పుడే దెబ్బతిని కోలుకుంటున్నాం. నీవల్ల మా బ్రతుకులు బజారున పడేట్టున్నాయి. ఆ పరిస్థితి రాకుండా చూడమ్మా! ఆ అల్లా నిన్ను కాపాడుతాడు''

నూర్జహాన్ పెదవులు బిగబట్టింది. ఆమెకు కన్నీళ్లు ఉబికి వస్తున్నాయి.

తనటు తప్పుకోగానే ఆ పిల్ల ఏడ్చేస్తుందని ఆమెకు తెలుసు. తప్పు చేసి బాధపడటంకన్నా, ముందుగానే ఏడ్చి ఆ తప్పునుండి తప్పించుకోవడం మంచిది.

సరోజ అక్కడనుండి వచ్చేసింది. ఇక ఆ పిల్ల కాస్త భయంగా ఉంటుందని ఆమెకు తెలుసు.

వ్యవహారాన్ని ఒకవైపునుండి కట్‌చేయడంకన్నా రెండువైపులా కత్తిరించడం బాగుంటుందని అనిపించిందామెకు. 'ఇది తమ జీవనోపాధికి సంబంధించిన విషయం... ప్రాణాలు గల్లంతయినా కావచ్చు...' అందుకే ఈ వ్యవహారాన్ని సీరియస్‌గా తీసుకుందామె.

సాయంత్రం రవి, శ్రీనివాసరావులు సైట్ నుండి వచ్చారు. రవి కాస్త బిడియంగా ఉన్నాడు. వదిన ముఖంలోకి సూటిగా చూడలేకున్నాడు.

స్నానం అయిపోయింది. అతడు పిల్లలను దగ్గర కూర్చోబెట్టుకుని కాసేపు చదువు చెప్పాడు. తొమ్మిదిగంటలయ్యాక అందరూ భోజనానికి కూర్చున్నారు.

భోంచేశాక పిల్లలు పక్కగదిలోకి వెళ్లి పడుకున్నారు. రవి కూడా వారి వెనుకే వెళ్లిపోయాడు.

ఆమె గిన్నెలన్నీ సర్దింది. శ్రీనివాసరావు అప్పటికే మంచమెక్కి గుర్రుపెడుతున్నాడు. ఈమధ్య అతడు భోజనం చేయగానే మంచమెక్కి నిద్రలోకి జారుకుంటున్నాడు. సైట్‌మీద శ్రమ ఎక్కువయిందో లేక దిగులు తీరి నిశ్చింత ఏర్పడిందో!

సరోజ అతని పక్కనే పడుకుని "ఏమండీ... ఏమండీ..." తట్టి లేపసాగింది.

"ఏమిటే'' విసుక్కున్నాడు శ్రీనివాసరావు.

"మీతో కాస్త మాట్లాడాలి''

"ఏమిటి మాట్లాడేది?" మత్తులోనే అడిగాడు.

"రవీ, నూర్జహాన్‌ల గురించి''

అతడి మత్తు కొద్దిగా వదిలింది. "రవి... నూర్జహాన్... ఏమిటి?" ప్రశ్నార్థకంగా ముఖంపెట్టాడు.

ఆమె అతడిని లేపి కూర్చోబెట్టింది. తనూ అతని ఎదురుగా పద్మాసనం వేసుకుని కూర్చుంది.

ఉదయం తను చూసిన సంఘటననుండి, మధ్యాహ్నం నూర్జహాన్‌తో చెప్పిన మాటలువరకూ యథాతథంగా భర్తముందుంచింది.

ఆమె చెపుతూవుంటే అతను అదిరే గుండెతో విన్నాడు, 'బాప్‌రే' అన్నాడు ఆఖరున భయంగా!

"ఈ వ్యవహారం ఆలీబేగ్‌గారికి తెలిసిందంటే రవిని ఏదయినా చేయిస్తాడు. మనల్ని ఇంట్లోనుండి వెళ్లగొడతాడు''

"నిజమే'' ఒప్పుకున్నాడు అతడు.

"అందుకే నూర్జహాన్‌ని నేను మందలించాను. రవికి చెప్పడం... అది మీరయితే...

అతడు తలాడించాడు. "అయినా రవి ఇంత అమాయకంగా ప్రవర్తిస్తున్నాడంటే నాకు... ఊహూఁ! నమ్మబుద్ధికావట్లేదు''

"అంటే నేను అబద్ధం చెపుతున్నాననా?"

"ఛీఛీ! వాడిమీద అబద్ధాలు చెప్పవలసిన అవసరం నీకేముంది?... నా ఉద్దేశ్యం అదికాదు... వాడికి మన పరిస్థితులు బాగా తెలిసీ..."

"... ఎంత తెలిసినా, వయసు అలాంటిది'' మధ్యలోనే అందుకుందామె.

"వాడిలో వయసుకు మించిన ఆలోచన ఉంది''

"ఒక్కొక్కసారి మహా తెలివయినవారు కూడా చిన్న వ్యవహారాల్లోనే దెబ్బతింటుంటారు''

అతడు బలంగా నిశ్వశించాడు.

"సరే! రేపు సైట్‌లో ఈ వ్యవహారం కదిలి




స్తాను''

"అతడి మనసు నొచ్చుకునేలా మాట్లాడకండి''

"అలాగే''

ఒక 'కొత్త ప్రమాదం' తనముందు నిలిచినట్లు వ్యథపడసాగాడు అతను. అతనిలోని నిశ్చింత ఎగిరిపోయింది. ఆలోచనలు నిద్రను దూరంచేశాయి.

మర్నాడు తామిద్దరే ఉన్నప్పుడు సైట్‌లో ఈ విషయాన్ని ప్రస్తావించాడు శ్రీనివాసరావు. సరోజ నూర్జహాన్‌కి చెప్పిన మాటలు కాస్త మార్చి తమ్ముడికి వినిపించాడు.

ముఖంలో ఏ భావమూ కనిపించనివ్వకుండా, అన్నయ్య మాటలన్నీ విన్నాడు రవి. అతను చెప్పడం పూర్తయ్యాక తను చెప్పాడు

"అన్నయ్యా! మన పరిస్థితేమిటో నాకు తెలుసు. నేను చిన్న తప్పు చేసినా కుటుంబం మొత్తం పరిహారం చెల్లించవలసి వస్తుందని అర్థంచేసుకోలేనంత అమాయకుడిని కాదు... ఆ అమ్మాయికి ఇంకా చిన్నతనం పోలేదు. చిలిపిచేష్టలు తను చేస్తుందేగానీ, నావైపు నుండి రెస్పాన్స్ లేదు... మీరు ఇంతగా భయపడుతున్నారు కాబట్టి రేపటినుండి తన వైపు కన్నెత్తి కూడా చూడను... సరేనా?"

"నన్ను అపార్థం చేసుకున్నావేమో'' శ్రీనివాసరావు గొంతు బాధను వ్యక్తంచేసింది.

"లేదన్నయ్యా! మన పరిస్థితిపట్ల మీ భయాందోళనలు సరయినవే''

కాసేపాగాక శ్రీనివాసరావు తమ్ముడితో చెప్పాడు "రవీ! పల్లె విడిచాక మనం పడరాని పాట్లు పడుతున్నాం. ఇప్పుడు పల్లెకు వెళ్లినా కాసింత నిశ్చింతగా బతకొచ్చు. అయితే మనం ఇలా వట్టిచేతులతో పల్లెకు వెళితే, అక్కడి మనవారందరూ మనల్ని ఎగతాళిచేస్తారు. అందుకే... కాసింత సంపాదించుకున్నాక మన పల్లెకు వెళ్లిపోయి నాలుగెకరాలు కొనుక్కుని ప్రశాంతజీవనం గడపాలని ఉందిరా''

ఇప్పుడిప్పుడే రవికి కూడా ఆ కోరికే కలుగుతోంది.

భూమి గుండ్రంగా ఉంది. మనిషి పరుగు చివరికి మొదలయినచోటే అంతమవుతుంది.

★ ★ ★

మూడోరోజుకి మతవిద్వేషం ప్రజ్వరిల్లిపోయింది.

పాతబస్తీలో కర్ఫ్యూ పెట్టారు. అప్పటికే ఆరుగురు చంపబడ్డారు. 'మరో పదిమందిదాకా కత్తిపోట్లకు గురయి హాస్పటల్‌లో చేర్చబడ్డారు. నగరమంతా ఉద్రిక్తతతో నిండిపోయింది.

ఉదయంనుండి బయటకు వెళ్లే మార్గంలేక రవి, శ్రీనివాసరావు, ఆలీబేగ్ ఇంట్లోనే ఉండిపోయారు. అజయ్ సైట్‌కి వెళ్లివుండొచ్చు.

ఆలీబేగ్ పేపర్ చేతపట్టుకుని వారి ఇంట్లోకి వచ్చాడు. "చూశావా రవీ ఈ ఘోరాలు... పేపర్‌లో ఫొటోలు చూస్తుంటే నాకే ఏదోలా ఉంది'' ఉర్దూపేపర్ వారిముందు ఉంచాడు. పెద్దలు ముగ్గురూ పేపర్‌లోనికి చూశారు. నిజమే! రోడ్డుపక్కగా పడివున్న శవాలను చూస్తుంటే వాంతి వచ్చేలా వుంది. పిల్లలు పేపర్ తీసుకున్నారు.

ఎక్కడో ఒకచోట హిందువుని ముస్లిమో, లేదా ముస్లింని హిందువో చంపాడన్న వార్త మరో ఏరియాలో ఇరుమతస్తులూ రెచ్చిపోతారు. క్షణాల్లో ఆయుధాలు బయటకు ఎలా వస్తాయో తెలియదు. కత్తిపోట్లతో జనం హతులవుతుంటారు. విచిత్రమేమిటంటే, ఇలా చనిపోయినవారిలో ఆవేశపడినవారికన్నా అమాయకులే ఎక్కువగా ఉండడం...

ఆలీబేగ్‌గారన్నారు, "ఇప్పుడు జరిగేది నిజమైన మతకల్లోలం కాదు. అధికార మార్పిడి కోసం జరిగే పోరాటం''

అన్నదమ్ములిద్దరూ ఆయనవంక విస్మయంగా చూశారు. 'జరుగుతున్నది మతాలమధ్య ఘర్షణ అని స్పష్టంగా తెలుస్తుంటే,

అధికారంకోసం పోరాటం అంటాడేమిటి ఈయన!'

"మీరు నమ్మడంలేదుకదూ...? నిజమయ్యా ఇది! మీకు రాజకీయాలు తెలియవు కాబట్టి అర్థంకావడంలేదు. రాజకీయం తెలిసినవారందరికీ బహిరంగ రహస్యమే ఇది. రేపు ఈ ముఖ్యమంత్రిని మారిపోనివ్వండి, మరుసటిరోజే ఈ హత్యాకాండ ఆగిపోకపోతే నన్నడగండి''

"అయినా అధికారంకోసం ఇంతమందిని బలివ్వడం..." నమ్మబుద్ధి కావడంలేదు శ్రీనివాసరావుకు.

"పిచ్చివాడివయ్యా నువ్వు! సమాధులను పగలగొట్టి, దాని రాయిని తమ ఇంటి పునాదులకు వాడుకునే వ్యక్తులుండే సమాజంలో ఉన్నామయ్యా మనం. అందులోనూ నేటి రాజకీయ నాయకులు అధికారంకోసం... దేశంమొత్తం స్మశానంగా మార్చేందుకయినా సిద్ధపడతారు''

సరోజ, పిల్లలు భయంగా వింటున్నారు.

"ఇలా ఇరువర్గాలను రెచ్చగొట్టడం వారికెలా సాధ్యం?" అనుమానం వ్యక్తంచేశాడు రవి.

"అదేకదా రాజకీయ నాయకుల తెలివి...!" ఆయన రవివంక చూశాడు. "... రాజకీయ నాయకులకు గూండాల అండ ఉంటుందికదా! ఏదయినా ఒక సెన్సిటివ్ ఏరియాలో ఒక గూండా ముస్లింని కత్తిపోటు పొడుస్తాడు.

అలా పొడుస్తూ హిందూ దేవత పేరు ఉచ్చరిస్తాడు. దాంతో అమాయకుడయిన ఆ ముస్లింకి తననో హిందువు పొడిచాడని అర్థమవుతుంది. ధాంతో వాడు 'అరే భయ్యా! మర్‌గయాహూం... హిందూ సాలా ఖూన్‌కియా..." అంటూ అరుస్తాడు. ఒకవేళ వాడు అరవకపోయినా పక్కనున్న గూండాలు అలాగే అరుస్తారు అంతే! ఆ చోట రక్తం చిందుతుంది. రెండురోజులలో ఒకరిలో ఆవేశం తగ్గి, పరిస్థితి మామూలు కొచ్చేస్తే ఎప్పటిలానే గూండాలు రంగప్రవేశం చేస్తారు. ఎప్పటిలానే ఏదో మతస్థుడిని పొడవడం, అరవడం... జనాలను రెచ్చగొడుతారు. తాము అనుకున్నది సాధించేవరకూ జనాలను బలిపశువులుగా చేస్తూనే ఉంటారు''

వింటున్న ఆ ముగ్గురికీ గొంతు తడారిపోయింది.

"మైగాడ్! ఎంత దారుణం" అన్నాడు రవి.

"రాజధాని నగరం కదా ఇది! రాజకీయపు ఎత్తులకు నిలయం... ఇక్కడి మనిషి ప్రాణాలు గడ్డిపోచకన్నా విలువ తక్కువ"

'వాస్తవం' అనుకున్నాడు శ్రీనివాసరావు.

ఆయన మరికాసేపు కూర్చుని మాట్లాడి ఉండేవారే! పక్కింటివారెవరో ఆయన కోసం వచ్చారని నూర్జహాన్ అరిచి చెప్పింది.

"వీలయితే మళ్ళీ వస్తాను''ఆయన లేచి వెళ్ళిపోయారు.

రవి వీధివాకిలివరకూ వెళ్ళి చూసాడు.

ఎప్పుడూ జనంతో సందడిగా ఉండే ఆ రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. రిజర్వు పోలీసు దళాలు తుపాకీలు చేతపట్టి జనం లేని రోడ్డు మీద గస్తీ తిరుగుతున్నారు. అప్పుడప్పుడూ ఒక మిలటరీ వేన్ ఆ రోడ్డమ్మట వెళుతోంది. కర్ఫ్యూనాటి రోడ్డు స్మశానవాతావరణాన్ని గుర్తుకు తెస్తోంది.

అతడు ఇంట్లోకి వచ్చాడు.

ఒక్కొక్కసారి కర్ఫ్యూ రెండుమూడురోజుల వరకూ కూడా పొడిగించబడుతుంది. కావలసిన సరుకులు, కూరగాయలు ఉన్నాయి. మరో రెండురోజులు ఇంట్లో ఉన్నా దిగులుపడనవసరంలేదు అనుకున్నాడు రవి.

సరోజ రేడియో ఆన్‌చేసింది.

వార్తలు వస్తున్నాయి.

"... పాత బస్తీలో ఉద్రిక్త వాతావరణం అలాగే ఉంది. ఈ మత ఘర్షణలలో మృతులయిన వారి సంఖ్య పదిహేను! ఆ ప్రాంతంలో




కర్ఫ్యూను మరోరోజు పొడిగిస్తున్నట్టు నగర పోలీస్‌కమీషనర్ తెలియచేసారు. పరిస్థితిని అదుపులోనికి తెచ్చే ప్రయత్నాలు సాగుతున్నట్టు ముఖ్యమంత్రి ఒక సమావేశంలో తెలిపారు''

ఎందుకో తెలియదు, సరోజ పిల్లలను తనకు దగ్గరగా తీసుకుంది. ఏదో భయం... భీభత్సవాతావరణంలో తల్లిపక్షి పిల్లలను రెక్కల కింద ఉంచుకుంటుంది.

ఆ రాత్రి ఆమె భర్తతో "ఇదేమిటండీ! ఇక్కడయినా మనం ప్రశాంతంగా బతుకుదామంటే... మనకు దేవుడు ఆ రాత రాసినట్టు లేదు. ఇక్కడ చావుకేకలు, రక్తపు ప్రవాహాలు, ఇంటిలోనే బంధిఖానా... హైదరాబాదులో జీవితం ఇలా ఉంటుందని నేను కలలో కూడా అనుకోలేదు'' అన్నది.

శ్రీనివాసరావు చెప్పాడు. "జరగనివ్వు! చేసేదేముంది? నగరానికొచ్చాక మనం కూడా కొంత మొండితనం తెచ్చుకోవాలి. ఈ చావుకేకలు, రక్తప్రవాహాలు మనం పట్టించుకోకూడదు. ప్రమాదం మనకు దగ్గరగా రాకుండా చూసుకుంటే చాలు''

ఆమె అతడివంక విభ్రాంతితో చూసింది

ఎంత మార్పు! నాలుగేళ్ళక్రితం పల్లెలో పక్కింటి కుర్రాడికి పాము కరిస్తే తల్లడిల్లిపోయిన శ్రీనివాసరావేనా ఈయన?

ఆ కుర్రాడు చనిపోతే బాధతో మూడురోజులు అన్నం సరిగా తినని తన భర్తేనా?

ఎంత విచిత్రం!

★ ★ ★

నలభై ఎనిమిది గంటలపాటు కర్ఫ్యూ కొనసాగింది.

ఆ సమయంలో నగరంలో అక్కడక్కడా చెదురుమదురు సంఘటనలు తప్ప ప్రాణహాని జరగలేదు. ముఖ్యమంత్రి పత్రికా సమావేశం ఏర్పాటుచేసి పరిస్థితి అదుపులోనే ఉందని, మెల్లమెల్లగా ఉద్రిక్తత తగ్గుముఖం పట్తోందని ప్రజలను నమ్మించే మాటలు చెపుతున్నాడు.

కాని పరిస్థితి నివురుగప్పిన నిప్పులా ఉందని అందరికీ తెలుస్తూనే ఉంది.

పోలీసుదళాలు కొద్ది ఏమరుపాటున ఉంటే చాలు. మళ్ళీ రెచ్చిపోయేందుకు కొన్ని శక్తులు సిద్ధంగా ఉన్నాయి.

జనం ముఖ్యమంత్రి మాటలు, పోలీసు అధికారుల ప్రకటనలు నమ్మడం లేదు. భయం... అందరిలోను భయం... ఏక్షణం ఏం జరుగుతుందోనన్న భయం... ముఖ్యంగా పాతబస్తీలో! ఆ సెన్సిటివ్ ఏరియాలో ప్రజలు భీతావహులయి ఉన్నారు.

రోడ్డుపక్క నడుస్తుంటే, ఓ ముసుగు వ్యక్తి చటుక్కున పొడిచి పారిపోవచ్చు. ఇంట్లో అందరూ టి.వి. చూస్తుంటే కారులోనుండి దిగిన నలుగురు దుండగులు రక్తపాతం సృష్టించి హుందాగా కారులో వెళ్ళిపోవచ్చు. ప్రమాదం ఏవైపునుండయినా రావచ్చు, ఏ రూపంలోనయినా మీదపడొచ్చు.

మతోద్రిక్తతలు చెలరేగినప్పుడు హైదరాబాదు పాతబస్తీలో జనం ప్రాణాలు అరచేతపట్టుకుని బతకడం సహజాతిసహజం!

కర్ఫ్యూ తొలగించాక రవి సైట్ కెళ్ళేందుకు తయారుకాసాగాడు. వరండాలోకెళ్ళి స్కూటర్ తీస్తుంటే ఆలీబేగ్ వచ్చి "రవీ! మీరు సాయంత్రం కాస్త త్వరగా వచ్చేయండి'' అన్నాడు.

"ఎందుకు సార్?"

ఆయన చాలా సంతోషంలో ఉన్నట్టు కనిపించాడు.

"మిమ్మల్ని రమ్మని చెపుతున్నానుగా''

"మరీ అంత చెప్పకూడని విశేషమా?"

"విశేషమంటే... విశేషమే... సాయంత్రం అజీజ్‌అహమ్మద్ ఇక్కడికి వస్తున్నాడు''

"అజీజ్‌మహమ్మద్... ఎవరాయన?"

"పబ్లిక్‌వర్క్స్ డిపార్ట్‌మెంట్ సూపరిండెంట్ ఇంజనీర్ ఇబ్రహీం అహమ్మద్‌గారి

రెండో అబ్బాయి. అతడూ బి.టెక్ చదివాడు. కుర్రాడు చాలా బాగుంటాడు. ఆస్తి బాగానే ఉంది''

"ఇంతకీ ఇక్కడికి ఎందుకొస్తున్నాడో చెప్ప నేలేదు మీరు''

తను అసలుపాయింట్ వదిలేసి సైడ్ ట్రాక్ లోనికి వెళ్ళినట్టు అర్ధమయింది ఆయనకు. "అసలు విషయం చెప్పలేదన్నమాట మీకు... అజీజ్అహమ్మద్ ఇక్కడికి ... నూర్జహాన్ని చూసేందుకు వస్తున్నాడు''

అతడి ముఖం భావరహితంగా మారింది. శ్రీనివాసరావు తమ్ముడివంక కొద్దిక్షణాలు తదే కంగా చూసి తలతిప్పుకున్నాడు.

ఆలీబేగ్ అతడి ముఖంలోనికి చూడలేదు. "విన్నావుగా! సాయంత్రం త్వరగా వచ్చె య్యి'' చెప్పేసి లోపలికి వెళ్ళాడు.

రవి స్కూటర్ వీధిలోనికి నడిపించాడు. స్టార్ట్ చేసి ఎక్కి కూర్చున్నాడు. శ్రీనివాసరావు వెనక ఎక్కాక, గేరు మార్చి ముందుకు కదిలించబోతూ అటువైపు చూసాడు... నూర్జ హాన్ తలుపు చాటున నిలబడి వుంది. ఆమె ముఖం మాత్రమే కనిపిస్తోంది.

ఆమె కన్నులలో తడి... స్పష్టంగా కని పిస్తోంది అతడికి. శ్రీనివాసరావు కూడా అటు చూశాడు. తనకూ బాధగా అనిపించింది. కొన్నిరకాల భావాలు మనిషి చుట్టూ ఏర్పడిన కృత్రిమ కట్టుబాట్లను మరిపిస్తాయి. అదీ క్షణ కాలం మాత్రమే. అతడు సర్దుకున్నాడు 'ఆమె మతం ఏమిటి? మన మతమేమిటి?' అనుకు న్నాడు 'పోనీలే! ఆ అమ్మాయికి పెళ్ళయిపో యేలా ఉంది, తమకూ కాస్త నిశ్చింతగా ఉంటుంది' అదోలాటి రిలీఫ్ కలిగింది శ్రీనివా సరావుకు.

రవి స్కూటర్ని ముందుకు దూకించాడు. చార్మినార్ పక్కనుండి స్కూటర్ వేగంగా పోసాగింది.





రోడ్డుమీద జనం పలుచగా ఉన్నారు. కర్ఫ్యూ తొలగిన తర్వాత వెంటనే జనమంతా రోడ్డుమీదకు చేరారు. 'మళ్ళీ ఏక్షణంలో ఏం జరుగుతుందోనన్న భయం ఇంటినుండి కదల నివ్వదు. మరీ అత్యవసర కార్యాలున్నవారో, లేక నిత్యావసర వస్తువులు నిండుకున్నవారో విధిలేని పరిస్థితిలో రోడ్డుమీద పడతారు. పరి స్థితి కాస్త ప్రశాంతంగా ఉందని తెలిసాకే రోడ్డు జనసమ్మర్ధమవుతుంది.

రవి స్కూటర్ మౌనంగా నడుపుతున్నాడు. తమ్ముడి మనసులో ఎలాంటి ఆలోచనలు మెదలాడుతున్నాయో ఊహించడం కష్టంగా ఉంది అతడికి. ఏమయినా రవి కాస్త బాధపడు తున్నాడు.

ముప్పావుగంట తర్వాత స్కూటర్ సైట్లో ఆగింది.

లేబర్ దగ్గర అజయ్ నిలబడి ఉన్నాడు. పాలమూరోళ్ళు గిట్టి పరుస్తున్నారు. లోకల్ లేబర్ స్కారిఫైయింగ్ చేస్తున్నారు.

రవిని చూసి అజయ్ దగ్గరగా వచ్చాడు. "నమస్తే రవిసాబ్''

"గుడ్మార్నింగ్ అజయ్''

"రెండురోజులు ఇంట్లోనే చిక్కుకుపోయిన ట్టున్నారు?''

"బయటకు రావాలంటే కర్ఫ్యూ భయం! ఈ రెండురోజులు నా మనసంతా ఇక్కడే ఉండింది. అయినా మీ ఏరియాలో కర్ఫ్యూలే దు కాబట్టి, నువ్వు సైట్కి వచ్చి మేనేజ్ చేసుకుంటుంటావని అనుకున్నాను''

"పాతబస్తీలో కర్ఫ్యూ అనగానే మీరు సైట్కి రాలేరని తెలిసిపోయింది. అందుకు నేనే ఉదయాన్నే వచ్చేసి లేబర్ని చూసుకుంటున్నా ను''

"పోనీలే! లేబర్ని ఖాళీగా ఉంచకుండా, ఏదో చేయించావు''

శ్రీనివాసరావు లేబర్ దగ్గర ఉండిపోయా డు. రవి కేంప్వైపు నడిచాడు. "నేనూ వస్తు న్నాను'' అజయ్ అతడిని అనుసరించాడు.

కేంప్కి వెళ్ళాక పాపయ్యను టీ తీసుకుర

మ్మన్నాడు రవి. కుర్చీలో వెనుక్కువాలి కన్ను లు మూసుకున్నాడు.

అతడు మౌనంగా ఉండడం చూసి. రవి సాబ్! ఏమిటిలా ఉన్నారు?" అజయ్ అడిగాడు.

"కాస్త తలనొప్పిగా ఉందిలే"

వాస్తవంగానే అతడి మనసంతా అనీజీగా ఉంది. కాసేపు ఒంటరిగా గడపాలనిపిస్తోంది.

"అయితే చాయ్ తాగి కాసేపు పడుకోండి"

నిశ్శబ్దంగా తలూపాడు అతడు.

పాపయ్య రెండు కప్పుల చాయ్ తీసుకువచ్చాడు.

చాయ్ తాగేసి సైట్‌మీదకు వెళ్ళిపోయాడు అజయ్.

అతడు మాత్రం అక్కడే కూర్చుండిపోయాడు. తనకు తానే ప్రశ్నించుకున్నాడు. ఈరోజు నా మనసంతా ఏదోలా ఉంది. కారణమేమిటి? నూర్జహాన్‌కి పెళ్ళిచూపులని తెలిసి బాధపడుతున్నాడా?! ... ఏమో! మనసనేది చాలా చిత్రమయినది! ఒకటి కావాలనుకుంటుంది. అదే సమయంలో 'ఎందుకులే వ్యధలు కొని తెచ్చుకోవడమని' భయపడుతుంది. ద్వైదీ భావ సమ్మేళనం... ఈ మనసు.

కేవలం నూర్జహాన్ గురించే కాదు, మరేదో... మరేదో ఇబ్బందికరమయిన ఫీలింగ్! ఎందుకలా తోస్తోంది తనకు?.

మధ్యాహ్నం వరకూ అతడు కేంప్‌ని వదల్లేదు.

శ్రీనివాసరావు సైట్‌నుండి కేంప్‌కి వచ్చాడు. రవి కన్నులు మూసుకుని కుర్చీలోనే వెనక్కు వాలి ఉండడం కనిపించింది. స్కూటర్‌లోని కేరియర్ పట్టుకుని వచ్చి అతడిని తట్టి లేపాడు. 'భోంచేద్దాంలే'

"అజయ్ వచ్చాడా?"

"వస్తున్నాడు. నువ్వు లేచి వెళ్ళి ముఖం కడుక్కునిరా''

అతడు ముఖం కడుక్కుంటున్నప్పుడే అజయ్ వచ్చాడు.

"తలనొప్పి తగ్గిందా?" తనూ ముఖం కడుక్కోసాగాడు.

"తగ్గింది''

అజయ్ తన బాక్స్ కూడా విప్పాడు.

ముగ్గురూ ప్లేట్స్‌లో అన్నం వడ్డించుకున్నారు.

భోజనాలయ్యాయి. ముగ్గురూ కాసేపు కూర్చున్నారు.

"మేము సైట్‌మీదికి వెళుతున్నాం" అజయ్ లేచాడు.

అక్కడ ఎంతసేపు కూర్చున్నా... మనసు బరువెక్కడమే తప్ప, మరేమీ లేదు. "నేనూ వస్తున్నాను'' అతడూ పైకి లేచాడు.

ముగ్గురూ లేబర్ పనిచేసే చోటుకు నడకసాగించారు. అరకిలోమీటరు దూరం. ఐదు నిముషాల నడక.

శ్రీనివాసరావు లేబర్ దగ్గరగా వెళ్ళాడు. వారిద్దరూ రోడ్డుపక్కనే ఉన్న చెట్టుకింద నిలబడ్డారు.

"అజయ్! ఇక్కడ ఈరోజు నీ అవసరమేమీ లేదు కదా! నువ్వు ఇంటికెళ్ళిపో. రేపుదయాన్నే రా... మా ఏరియాలో పరిస్థితి ఎలా ఉంటుందో చెప్పలేం. ఒకవేళ రేపుదయమే మళ్ళీ కర్ఫ్యూ అంటే... మేము రావడానికి వీలుకాదు. నువ్వే వచ్చి లేబర్‌కి పని చూపించాలి''

"అలాగే" అజయ్ వెళ్ళిపోయాడు.

రవి, శ్రీనివాసరావులు లేబర్‌వైపు నడిచారు.

ఆ కొత్తవర్క్ మొదలుపెట్టి మూడు నెలలయిపోయింది. ఈ కొద్దిరోజులలోనే శ్రీనివాసరావు కాంట్రాక్ట్ వర్క్స్ గురించి చాలావరకూ తెలుసుకున్నాడు. మరి కొద్దిరోజులాగితే వర్క్ స్వంతంగా మేనేజ్ చేసుకోగలిగిన స్థితికి వచ్చేస్తాడు.

అతడు లేబర్ మేస్త్రిని పిలిచి మర్నాటి పని

చూపించాడు. 'రేపు ఇంత పని చేయాలని' చూపించేస్తే మేస్త్రి దగ్గరుండి చేయిస్తాడు. కాకపోతే వారు చేసేపని సరిగా చేసేలా దగ్గరుండి చేయించుకోవాలి. అందుకే సూపర్ వైజర్ అవసరం.

కాసేపు వర్క్ దగ్గరున్నాక శ్రీనివాసరావు అన్నాడు. "మనం కాస్త పెందలకడే ఇంటికి చేరడం బాగుంటుంది''

అతడు అన్నయ్య వంక ప్రశ్నార్థకంగా చూసాడు.

"ఉదయం ఆలీబేగ్ త్వరగా రమ్మన్న విషయం మరిచిపోయావా?"

అప్పుడు గుర్తుకువచ్చింది అతడికి 'సాయంత్రం నూర్జహాన్‌ని చూసేందుకు ఓ కుర్రాడు వస్తున్నాడు'

"వెళ్దాం పద అన్నయ్యా''

అతడు స్కూటర్ స్టార్ట్ చేసాడు. శ్రీనివాసరావు వెనుక కూర్చున్నాడు.

సూర్యుడు త్వరత్వరగా కొండల చాటుకి జారుకుంటున్నాడు. కొన్ని ఘోరాలు చూడకుండా ఆ కర్మసాక్షి ముఖం చాటేస్తుంటాడు.

మొత్తం ముప్పావుగంట ప్రయాణం.

వారు పాతబస్తీ ఏరియా సమీపించారు. కర్ఫ్యూ లేదుగానీ, రోడ్డుమీద జనం కూడా పెద్దగా లేరు. అప్పడో ఆటో, అప్పడో జీపు... వాహనాలరొద కూడా లేదు. యుద్ధం ముగిసాక సరిహద్దులో ఉండే ప్రశాంత వాతావరణం... కాని ఇక్కడ యుద్ధం ముగియలేదు, కాసింత విరామం!

ఏక్షణంలోనయినా అక్కడ ఘర్షణ మొదలుకావచ్చు. ఏ గూండానో ఒక అమాయకుడిని పొడిచి పారిపోవచ్చు.

రవి ఇంటి ముందు స్కూటర్ ఆపాడు. శ్రీనివాసరావు స్కూటర్ దిగాడు.

స్కూటర్‌ని ఇంటిలోపలికి తీసుకెళుతున్నాడు రవి. శ్రీనివాసరావు అతడి వెనుకే ఇంట్లోకి నడుస్తున్నాడు.

అదేక్షణం...

వేగంగా వచ్చిన ఆటో వారి ముందు ఆగింది. అమితవేగంగా దిగారు నలుగురు వ్యక్తులు... రవి స్కూటర్‌ని లోపలికి తీసుకెళ్ళాడు. రెండు అడుగులు వేసి ఉంటే శ్రీనివాసరావు కూడా ఇంట్లోపడి ఉండేవాడే!

"జై పరమేశ్వరా..."

ఆ అరుపులకు వెనక్కి తిరిగి చూసాడు రవి.

నలుగురి చేతులలో కత్తులు తళతళా మెరుస్తున్నాయి. అరసెకనులోపే అవి శ్రీనివాసరావు శరీరంలో దిగబడ్డాయి.

అతడు చూస్తూనే ఉన్నాడు. ఏం జరుగుతోందో అర్థంకాలేదు. అంతా రెప్పపాటు కాలమే!

కత్తులు మరొకసారి పైకి లేచాయి. మరో నాలుగుపోట్లు.

అప్పుడు... అప్పుడు అరిచాడు శ్రీనివాసరావు భయంకరంగా, దిక్కులు పిక్కటిల్లేలా.

"జై పరమేశ్వరా''

అన్ని అరుపులూ కలసిపోయాయి.

రవి ఆలోచనారహితంగానే అటువైపు వేగంగా అంగలేసాడు.

నలుగురూ పెద్దగా అరుస్తూనే ఆటో ఎక్కారు.

రక్తం మడుగులో అన్న, అతడిని పట్టుకుని తమ్ముడూ.

దూరం నుండి పోలీసులు పరిగెత్తుకు రాసాగారు. వారి చేతులలో తుపాకులున్నాయి. జనం మధ్య ఆటో తాపీగా వెళ్ళిపోయింది.

క్షణంలోనే జనం గుమికూడారు. పోలీసులు వచ్చి చేరారు.

అక్కడ కలకలం!

'ఇంట్లోకి వెళుతున్న ఇద్దరు వ్యక్తులలో ఒకరిని 'మతోన్మాదులు' పొడిచి పారిపోయారు.




ఇంటిముందు కలకలం విని ఆలీబేగ్ లోనుండి బయటకు వచ్చారు. ఆ దృశ్యం చూడగానే నిశ్చేష్టులయ్యారు. ఆయన వెనుకే నూర్జహాన్, ఇద్దరు కొత్త వ్యక్తులు.

నూర్జహాన్ పెద్దగా అరిచేసింది.

ఆ అరుపు పెరట్లో నీళ్ళు తోడుకుంటున్న సరోజకు వినిపించింది. ఆమె పరిగెత్తుకుంటూ ఇంట్లోనుండి వరండాలోకొచ్చింది.

వారంతా భయంగా, చేష్టలుడిగి ఆ వంక చూస్తున్నారు. 'ఏమిటా అని' ఆమె కూడా అటు చూసింది. అప్పుడే వినిపించింది చిరపరిచిత స్వరం బాధగా రోదిస్తూ, అరుస్తూ.

ఆమెకెందుకో ఆక్షణం తన కళ్ళను నమ్మాలనిపించలేదు. అదేదో గారడి! కళ్ళకు కనికట్టు... కాని... రవి అన్నయ్యను పట్టుకుని ఏడుస్తున్నాడే? చుట్టూ వారంతా... అది నిజమేనేమో! లేకపోతే నూర్జహాన్ ఎందుకు అరుస్తుంది. ఆలీబేగ్ కళ్ళనీళ్ళెందుకు పెట్టుకుంటారు? ఆ కొత్తవ్యక్తులు భయంగా ఎందుకు చూస్తారు?!! పోలీసులు ఎక్కడికో పరిగెత్తుతున్నారెందుకని?

రవి కళ్ళెత్తి ఆమె వంక చూసాడు. "వదినా'' బావురుమన్నాడు. శ్రీనివాసరావు గిలగిలా కొట్టుకుంటున్నాడు. భరించలేని బాధతో అరిచేస్తున్నాడు.

భర్తను చూశాక అప్పుడొచ్చింది ఆమెకు ఏడుపు. ఒక్క అంగలో వెళ్ళి అతడిమీద వాలి బావురుమంది. భర్త శరీరమంతా తడుముతూ "ఏమండీ! ఏమిటిది?" రోదనలోనే ప్రశ్నిస్తూ

పిల్లలు కూడా వచ్చారు. ఆ దృశ్యాన్ని భయంగా చూసారు. దగ్గరకు మాత్రం రాలేదు.

రెండు నిముషాలలో అంబులెన్స్ అక్కడికి వచ్చింది. శ్రీనివాసరావుని అందులోకి ఎక్కించారు. రవి, సరోజ, ఆలీబేగ్ అందులో ఎక్కి కూర్చున్నారు.

ఆమె భర్తను ఓదారుస్తోంది. తడిమి తడిమి చూసుకుంటోంది.

రవికి కన్నులవెంట నీరుకారిపోతూ ఉన్నాయి.

ముగ్గురి వంటిమీదా 'నెత్తుటిమరకలు'... బురదమరకలు కాదు!

అంబులెన్స్ హాస్పిటల్ వరకూ వెళ్ళలేదు. మధ్యలోనే శ్రీనివాసరావు ప్రాణం... అ...నం...త ...వా...యు...వు...ల్లో... క...ల...సి... పో...యిం...ది.

అయినా హాస్పిటల్‌కి తీసుకువెళ్లారు. పోస్ట్ మార్టమ్ కోసం!



శవయాత్రకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

జనం... ఎవరున్నారు తమకి అక్కడ... ఆలీబేగ్ కుటుంబం, వర్క్ దగ్గరి నలుగురూ!

అదే పల్లెలోనయితే, ఊరు... ఊరంతా వాకిట ముందు నిలచేది. అన్ని పనులూ వారే చూసుకునేవారు.

ఇక్కడ ఆలీబేగ్, బాధలో ఉండి కూడా తనూ... పనులు చేయవలసి వస్తోంది. కరువు తీరా ఏడ్చేందుకు కూడా వీలులేదు.

నగరంలోని సామాన్యజనాలకు తాము కోల్పోయిందేమిటో తెలిసివచ్చే క్షణాలు అవే!

సరోజ, పిల్లలు శవం మీదపడి ఏడుస్తున్నారు.

ఆలీబేగ్ అంతా తానయి పనులు చేస్తున్నాడు.

శవం ఇంటి ఆవరణలోనే ఉంది. వీధిలో శ్మశానశకటం ఆగి ఉంది. ఇద్దరు పోలీసులు

అక్కడ గార్డ్ చేస్తున్నారు.

నగరంలో మరోసారి ఉద్రిక్తతలు తలెత్తాయి. ఆ ఏరియాలో మళ్ళీ కర్ఫ్యూ విధించారు. బయట తిరగడం అవసరమనుకునేవారికి ఐడెంటిఫికేషన్స్ జారీచేస్తున్నారు.

శవాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళడం సాధ్యం కాదు. శ్మశాన శకటంలో పడేసి ఆ చోటకు చేర్చవలసిందే! ఆ శకటంలో ఎంత మంది వెళ్ళగలరు? ఓ నలుగురయిదుగురు.

'దిక్కులేని చావు' అంటే అదేనేమో!

పల్లెలో ఎవరికీ 'దిక్కులేని చావు' రాదు. పట్నాలలో, నగరాల లోనే ఈ దిక్కులేని చావులన్నీ!

నలుగురు వ్యక్తులు పాడెను పైకెత్తారు. ఆక్షణం... సరోజను పట్టుకోవడం కష్టమే అయింది. ఆమె రోదిస్తూంది. "ఎక్కడ పుట్టావో, ఎక్కడ గిట్టావో? నువ్వు చెపుతూనే ఉన్నావయ్యా? పల్లెను విడిచిపెట్టొద్దే, మనం కష్టాపడతామని... పాపిష్టిదాన్ని! నేనే వినుకోలేదు. పోరుపెట్టి, పోరుపెట్టి నిన్ను పట్నం తీసుకువచ్చాను. నాకు తెలియదయ్యా ఇక్కడ పరిస్థితి ఇంత ఘోరంగా ఉంటుందని... మనుష్యుల్ని మనుషులే చంపుకుంటారని నేనెరుగనయ్యా! తెలిసి ఉంటే వచ్చి ఉండేదాన్నే కాదు. మిమ్మల్ని ధారపోసుకుని ఉండేదాన్నే కాదు..."

నూర్జహాన్ ఆమెను అక్కున చేర్చుకుంది. పిల్లలిద్దరూ తల్లిని చుట్టేసుకుని ఉన్నారు. తండ్రిలేని పిల్లలయ్యారు వారు.

శవం శకటంలో చేర్చారు. పెద్ద పిల్లవాడిని నడిపించుకుంటూ వచ్చి శకటాన్ని ఎక్కించాడు రవి.

ఆఖరి వీడ్కోలు... ఏడుపులు... హృదయ విదారక దృశ్యం!

పిల్లవాడు, రవి, ఆలీబేగ్, అజయ్, పాపయ్య... ఈ ఐదుగురే ఆ వాహనంలో ఎక్కారు.

కంటతడి పెట్టేవారు ఎవరూ లేనప్పుడే అది హీనమయిన చావో లేదా దిక్కులేని చావో అవుతుంది.

ఆలీబేగ్ కూతురితో చెప్పాడు "ఆమెను జాగ్రత్తగా చూసుకో' అని. అందుకే నూర్జహాన్ సరోజను వదలకుండా పట్టుకుని లోపలికి తీసుకెళ్లింది.

శకటం ముందుకు కదిలింది.

చౌరస్తాలో గస్తీ పోలీసులు వాహనాన్ని ఆపారు. డ్రైవర్ ఐడింటిఫికేషన్ చూపించాడు. వారు వాహనాన్ని ముందుకు పోనిచ్చారు.

శకటం శ్మశానం చేరింది.

రవి, అన్నగారి శవాన్ని వదిలి రాలేకున్నాడు. అతడికి అక్కడే ఉండిపోవాలనిపిస్తోంది.

జ్వాజ్వల్యమానంగా పైకెగసిన చితిమంటలు అన్నకి జరిగిన అన్యాయాన్ని ఆవిధంగా వ్యక్తపరచుకున్నాయి.

అన్నయ్యతో కలిసి తిరిగిన చిన్ననాటి జ్ఞాపకాలు కనుల ముందు కదలాడుతున్నాయి. తనను చదివించటం కోసం అన్నయ్య శ్రమపడిన వైనం గుర్తుకు వచ్చింది.

ఆగమన్నా ఆగకుండా కన్నీరు వరదలా వచ్చేస్తోంది.

ఆలీబేగ్ రవి భుజం మీద చెయ్యివేశాడు. వెళ్లిపోయినవాడు తిరిగిరాడు... మనం ఇక్కడ ఎంతసేపున్నా పెరిగేది వ్యధ మాత్రమే.... వెళ్దాంపద!"

అతడు ఆయన వంక చూశాడు. దుఃఖం ముంచుకొచ్చేసింది. ఆయన అతడి తలను భుజం మీదకు వాల్చుకున్నాడు. "రవి బేటా! ఏడవకు... ఏడవకు బేటా..." ఆయన కన్నులు కూడా చెమర్చాయి.

ఒక హిందువుని, మరో నలుగురు హిందువులు చంపారు. ఒక ముస్లిం ఆ హిందువుని ఓదారుస్తున్నాడు.

శకటం వెనుతిరిగింది.

అతడి మనసంతా శూన్యమైపోయింది. తమ కుటుంబంలో ఒకరిని అక్కడ ఒంటరిగా




వదిలేసి తామంతా ఇంటికి వచ్చేస్తున్నారు. వైరాగ్యం లాంటిది కలిగింది అతడికి.

ఈ మనిషి పుట్టుక ఏమిటి? మరణం అంటే ఏమిటి? ఈమధ్య కొద్ది సమయంలోనే మనిషి ఆశలు, కోరికలు, అనుబంధాలు, ఆప్యాయతలు నీటి బుడగలాంటి జీవితం చుట్టూ ఎన్ని రంగు తెరలు చుట్టావయ్యా భగవంతుడా?

శకటం ఇంటి ముందు ఆగింది.

వారు కిందికి దిగుతుంటే, ఇంటిలోపల మరేదో గందరగోళ పరిస్థితి కనిపించింది.

ఆలీబేగ్ ఆందోళనగా లోపలికి నడుస్తుంటే లోపలినుండి పరిగెత్తుకొచ్చిన నూర్జహాన్ చెప్పింది "బహెన్ చచ్చిపోయింది''

★ ★ ★

ఒక శవాన్ని ఖననం చేసి వచ్చేసరికి, మరో శవం సిద్ధం...

'హే భగవాన్! ఇలాంటి ఘోరం మరే కుటుంబానికీ జరగకుండా చూడు... ఎంత నిర్దయుడవయ్యా నీవు! మా కుటుంబం చేసిన నేరమేమిటి? అకారణ ద్వేషంతో మమ్మల్ని ఘోరాతిఘోరంగా హింసించే నువ్వు శాడిస్ట్‌వి అయిఉంటావు'

రవికి కన్నీరు రాలేదు. కన్నులలోని చెరువు ఎప్పుడో ఇంకిపోయింది. ఆలీబేగ్‌గారు కూతురిని అడిగారు "ఎలా జరిగింది?"

నూర్జహాన్ చెప్పింది "సరోజ భర్త ఫొటో ముందు కూర్చుని ఏడుస్తోంది. పిల్లవాడు కూడా తల్లిని పట్టుకుని ఉన్నాడు. పిల్లవాడిని చూస్తే నూర్జహాన్‌కి జాలేసింది. రాత్రి నుండి వాడూ భోంచేయలేదు. కళ్లు తిరిగి పడిపోయేలా ఉన్నాడు. ఇంట్లోకి తీసుకెళ్లి రెండురోటీలు తినిపించాలనుకుని వాడిని తీసుకుని ఇవతలకు వచ్చింది. వాడిని బుజ్జగించి, బలవంతపెట్టి రోటీ తినిపించి ఆ ఇంటి దగ్గరకు తీసుకొచ్చేసరికి తలుపు గడియవేసి ఉంది. నూర్జహాన్ మనసు కీడు శంకించింది. దడదడా తలుపులు తట్టింది. ఆమెను గొంతెత్తి పిలిచింది. లోనుండి... ఎలాంటి జవాబూ లేదు. ఆమె అనుమానం బలపడిన క్షణాలవి... కిటికీ దగ్గరకు వెళ్లి తొంగి చూసింది. అప్పుడు... అప్పుడు కనుపించిందా దృశ్యం.

సీలింగ్ ఫ్యాన్‌కి చీర కట్టబడి ఉంది. ఆ చీరకు సరోజ శరీరం వేలాడుతూ... కాళ్లు గిజగిజా కొట్టుకుంటూ... అదేక్షణం ఆమె శరీరంలోని కదలిక ఆగిపోయింది''

ఆ దృశ్యం కనుల ముందు కదలాడుతుందేమో నూర్జహాన్ భయంతో వణికిపోతోంది.

శవం ఇంకా సీలింగ్‌ఫ్యాన్‌కి వేలాడుతూనే ఉంది. ఇరుగుపొరుగువారు శవాన్ని దించే ప్రయత్నం కూడా చేయలేదు.

ఆలీబేగ్ తనే స్వయంగా తలుపు బద్దలుకొట్టి లోపలికెళ్లారు. గొంతుకు బిగిసి ఉన్న గుడ్డను విప్పి శవాన్ని కిందికి దించారు.

ఇరవై నాలుగు గంటల ముందు ఆ ఇంట ఒక శవం. ఇంతలోనే మరో శవం సిద్ధమయింది, తననూ శ్మశానానికి తీసుకు వెళ్లి భర్తకు తోడుగా ఉంచమని కోరుతున్నట్లుగా!

అతడు వదిన శవాన్ని చేతులతో స్పృశించాడు.

"వదినా! ఎందుకు... ఎందుకు చేశావీ పని? నన్ను, నన్ను ఒక్కడినే ఒంటరివాడిని చేసేసి నువ్వు కూడా అన్నయ్యకు తోడుగా వెళ్లిపోయావా?" అతడి మనసు మూగగా రోదిస్తోంది.

భర్తను వదిలి జీవించలేని మమకారమో లేక భర్త చావుకు కారణం తనే అనుకున్న బాధనో తెలియదు ఆమె జీవితాన్ని చాలించింది.

బిడ్డల భవిష్యత్తును అతడి మీద వదిలి ఆమె ఈ లోకం నుండి వెళ్లిపోయింది.

ఆమె ఏ భావంతోనయినా ఆత్మహత్య చేసుకుని ఉండొచ్చు. కానీ ఆమె మరణానికి అసలు కారణం ఏమిటి?

అన్నగారి శవాన్ని దహనంచేసిన చోటే, వదినగారి శవానికి నిప్పుపెట్టాల్సి వచ్చినందుకు అక్కడికక్కడే ఆత్మహత్య చేసుకోవాలనిపించింది అతడికి.

అతడు శ్మశానం నుండి రెండోసారి తిరిగి వస్తూ అనుకున్నాడు "వారిద్దరూ ఈ కష్టాల కడలినుండి గట్టు చేరారు. మరి నాకెప్పుడో ఆ సుఖమయ స్థితి''

వైరాగ్యస్థితి మనిషి మరణాన్ని ఆహ్వానించేలా చేస్తుంది.

★ ★ ★

మర్నాడు అతడు తన బంధువులందరికీ కార్డుల ద్వారా అన్నావదినల మరణం గురించి తెలియచేశాడు. పదకొండోరోజు కర్మక్రతువులు జరగబోతున్నట్టు తెలియజేశాడు.

ఐదో రోజుకే బంధువులు కొందరు హైదరాబాదుకి దిగిపోయారు. వారి ఫోటోల ముందు కూర్చుని వారు కన్నీళ్లు పెట్టుకున్నారు. నారాయణ కాస్త పెద్దగానే రోదిస్తూ "మీ అన్నయ్యకు నేను చెప్పాన్రా! పల్లెను వదలొద్దు అని... వినుకోలేదా మానవుడు. ఏదో సంపాదించి మిద్దెలు, మేడలు కట్టేయాలని ఉన్న ఊరు విడిచి పెట్టాడు. ఇప్పుడు ప్రాణాలే పోగొట్టుకున్నాడు'' అన్నాడు.

అతడు జవాబు చెప్పలేదు. ఈమధ్య ఆ విషయమే ఆలోచిస్తున్నాడు.

వచ్చినవారు అతడిని పరామర్శించి కాసేపు కంటతడిపెట్టుకుని తిరిగి వెళ్లిపోయారు. వారిలో కొందరు పదకొండోరోజు వస్తామని చెపితే మరి కొందరు పల్లెలోనే మైలస్నానం చేసేస్తామని చెప్పారు.

ఆరోజు అతడు ఏదో పని మీద బయటకు వెళ్లి వస్తున్నాడు.

వరండా పక్కనుండి ఇంట్లోకి వెళ్లేదారిలోనే ఆలీబేగ్‌గారి గది ఉంది. ఆ గదిలో ఎవరయినా పెద్దగా మాట్లాడుతుంటే, పక్కనుండి వెళ్లేవారికి వినిపిస్తుంది.

తన ఆలోచనల్లో తాను వెళుతున్న అతడు, ఆ రూమ్‌లో ఎవరో కొత్త వ్యక్తి తన పేరు ఉచ్చరించడంతో ఆగిపోయాడు. గదిలోపల సంభాషణ తన గురించేనని తెలిసింది.

"ఆలీబేగ్ సాబ్! మీరిలా చేయడం ఏమీ బాగోలేదు'' ఆ గొంతు ఎవరిదో అతడికి తెలియదు.

"నేనేం చేశాను?" ఆలీబేగ్‌గారి గొంతు అది. సంభాషణ ఉర్దూలో జరుగుతోంది.

"ఇది మన ఏరియా! మనమంతా ముస్లిములం. వాడు ఆ[illegible] రవి... హిందువు... వాళ్లిప్పుడు మీ ఇంట్లో బాపనవాడిని పిలిపించి ఏదో తంతు చేయబోతున్నాడు. మన ముస్లిం ఇళ్లల్లో హిందూపూజలు మేము ఒప్పుకోం"

వచ్చినవారు నలుగురయిదుగురు ఉండొచ్చని రవి అనుకున్నాడు.

ఆలీబేగ్‌గారి గొంతు కొద్దిసేపు వినిపించలేదు. ఆయన వారు చెప్పిన మాటల గురించే ఆలోచిస్తున్నారేమో రవికి కొద్దిగా భయం కలిగింది. అన్నావదినలు చనిపోయిన చోటు ఇదే! ఇక్కడేవారి ఆత్మకు శాంతి కోసం పూజలు జరిపిస్తే మంచిది. తనకూ ఆత్మతృప్తి... అలా కాకుండా ఆయన తన మతస్తుల మాటలకు విలువనిచ్చి తనను ఇంటిలోనుండి వెళ్లిపొమ్మంటే ఇప్పటికిప్పుడు తను మరెక్కడికి వెళ్లగలడు? ఆ ఆలోచనే భయం కలిగించింది. అతడు అప్రయత్నంగా గోడకు వాలాడు.

అంతలో ఆలీబేగ్‌గారి గొంతు వినిపించింది.

"చూడండి... మీరు మతం దృష్టితో ఆలోచించి చెప్పడాన్ని నేను ఒప్పుకుంటున్నాను. అయితే మానవత్వం దృష్ట్యా నేను అతడిని వదలలేను''

"అంటే?" వారిలో ఒకరు ప్రశ్నించారు.

"అతడు రవి... చాలాకాలం నుండి నన్ను నమ్ముకుని ఉన్నాడు. ఈ రోజు అతడు తనవారిని పోగొట్టుకుని దుఃఖంలో ఉన్నాడు. అత




డిని నేడు మతం పేరుతో నిరాశ్రయుడిని చేయడం నేనొప్పుకోను''

కొద్దిక్షణాలు నిశ్శబ్దం!

"మీరు మన మతస్తుల మాటనే కాదంటున్నారు''

"మతంకన్నా మానవత్వం గొప్పదని నమ్మినవాడిని నేను''

"మేము మా మతపెద్దలతో చర్చిస్తాం. మీరు మతద్రోహిగా కూడా వెలివేయబడవచ్చు''

"నేను చేస్తున్న ఒక మంచి పనికి మీరిచ్చే బహుమానం అదే అయితే..." ఆయన కాస్త ఊపిరి వదిలాక చెప్పాడు "దాన్ని నేను శిరసావహిస్తాను''

వారు, ఆయన అంత గట్టిగా పట్టుపడతాడని ఊహించినట్టులేదు. కొద్దిసేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

ఎవరో ఒకరు అంటున్నారు "అయినా మీరు ఒక హిందువు కోసం అందులోనూ అతడు మన ఆవరణలో హిందూమతాచారాన్ని కొనసాగిస్తుంటే అసలు ఒక పెద్దవారిగా మీరే అతడిని మెడపట్టి బయటకు గెంటి ఉండవలసింది''

"నేనంత మూర్ఖుడినికాను''

ఆ క్షణం అవతలి వ్యక్తుల ముఖం ఎలా మారిపోయి ఉంటుందో అతడు ఊహించగలడు.

వారిలో ఒకరు మరీ ఆవేశపరుడిలా ఉన్నట్టున్నాడు.

"సరే! మీరు అతడిని బయటకు పొమ్మని చెప్పలేరు. మన మతాన్ని సంరక్షించుకునే ప్రయత్నంగా మేము అతడిని ఇక్కడినుండి పంపించేస్తాం"

"ఇది నా ఇల్లు. నా ఇంట్లో మరొకరి దౌర్జన్యాన్ని ఎంతమాత్రం సహించలేను'' ఆయన కంఠం తీవ్రంగా పలికింది. "ఈ విషయంలో నా వెనుక నిలబడేవారు కూడా కొందరున్నారు''

"మీరు మత ద్రోహానికి ఒడిగడుతున్నారు''

'మీరే మాట అన్నా తలవంచుకుంటున్నాను''

ఇక ఆయన మారడని వారికి అర్థమైనట్టుంది. కుర్చీలు కదిలిన చప్పుడు....

"మీరు అతడి పక్షాన నిలచినా, అతడిని ఎలా పంపాలో మాకుతెలుసు''

అది చివరి హెచ్చరిక కాబోలు.

"చూడండి..." ఆలీబేగ్‌గారి గొంతు అది... తను మునుపెన్నడూ విననంత గంభీరంగా ఉంది.

"రవికి ఏదయినా అపకారం జరిగితే నా మతం ఒక నిరపరాధిని శిక్షించిందన్న కసితో..." ఆరు సెకనులు ఆగాక చెప్పాడాయన "నేను నడివీధిలో ఆత్మాహుతి చేసుకుంటాను.

అక్కడ సూది పడినా వినిపించేంత నిశ్శబ్దం. అతడు కూడా ఊపిరిపీల్చడం మరిచిపోయాడు.

ఈ ప్రపంచంలోని ఓ ముస్లిం నోట అటువంటి మాట వెలువడి ఉండదు.

వారంతా తేరుకునేందుకు అరనిముషం పైగానే పట్టింది. వెళ్లిపోతున్నట్టు అడుగుల సవ్వడి.

ఆ క్షణం తన మనసులోని అనుభూతిని అతడు ఏమని వర్ణించ గలడు? ఆపుకోలేని అపురూప పారవశ్యంతో తన్మయమొందిన మనసు మనిషిని కదిలించగా మెల్లగా అటు అడుగులు వేశాడు.

వాకిట నిలచిన రవిని విస్మయంగా చూశాడు ఆలీబేగ్ అతడి కన్నులు అదో మైకంలో ఉన్నట్టు.

"ఏమిటి రవీ! ఏమయింది?" ఆలీబేగ్‌గారు ఎప్పటిలానే ప్రశ్నించారు.

అతడేమీ మాట్లాడలేదు. మెల్లగానే ఆయన దగ్గరగా వెళ్లాడు. చప్పున అతడు ఆయన



పాదాలమీద వాలాడు. తన చేతులతో ఆయన పాదాలను స్పృజించాడు.

ఆలీబేగ్ రవిని పైకి లేవనెత్తారు. ఆయన కంట కూడా నీళ్లు చిప్పిల్లాయి. అతడిని అక్కున చేర్చుకున్నాడు.

నూర్జహాన్ చాలా సేపటినుండి వాకిటిలోనే ఉంది.

ఆమె ఆ దృశ్యాన్ని కన్నార్పకుండా చూసింది... ఆమె మనసులో ఎక్కడో ఏదో భావం అస్పష్టంగా...

మసీదులోనుండి ఖురాన్ ఫఠనం వినిపిస్తోంది. మతం చెప్పే మానవత్వభావాన్ని అలవర్చుకోమన్న ప్రబోధంలా వుందది.

★ ★ ★

ఎక్కడో కృష్ణాజిల్లాలోని ఒక మారుమూల గ్రామం నుండి హైదరాబాదుకి కేవలం దినకర్మ కోసం రావడం మరీ దగ్గరి బంధుత్వమయితేనే తప్పనిసరవుతుంది. శ్రీనివాసరావు మరణించిన తర్వాత రవిని పరామర్శించడానికి వెళ్లని నలుగురయిదుగురు మాత్రం హైదరాబాదు వెళ్లారు.

భోజనాలయ్యాక ఒకరిద్దరు రెండు రోజు లుండి సిటీ చూసి వెళ్లాలని అనుకున్నారుగానీ, నగరంలో పరిస్థితులు బాగోలేవని తెలిసి ఆ ప్రయత్నం విరమించుకున్నారు. తిరిగి పల్లెకు వెళ్లిపోతూ రవిని మాత్రం పల్లెకు వచ్చేయ మని బతిమలాడి చెప్పారు.

వారంతా వెళ్లిపోయారు.

పదిహేనోరోజు వదినగారి దినంకు శ్మశానా నికి అతడికి, పిల్లవాడికి తోడుగా ఆలీబేగ్ ఒక్కరే వచ్చారు.

ఘోరయుద్ధంలో తనవారంతా మర ణించాక ఒంటరిగా మిగిలిన సైనికుడిలా అత డు...

నగరంలో మతసంఘర్షణలు జరుగుతూనె ఉన్నాయి. పాత బస్తీలో అప్పుడప్పుడు కర్ఫ్యూ విధిస్తూనే ఉన్నారు.

ఢిల్లీ నుండి ఎవరో పరిశీలకులు వచ్చారట! ముఖ్యమంత్రిని మార్చే విషయమై అభిప్రాయ సేకరణ చేస్తున్నారట.

ఉన్నట్టుండి ఒకరోజు ముఖ్యమంత్రి రాజీనా మా ఇచ్చేశాడు. మరొకరు ముఖ్యమంత్రి పదవిలోనికి వచ్చేశారు.

అప్పటివరకూ ఉధృతంగా సాగుతుండిన హత్యలు ఒక్కసారిగా ఆగిపోయాయి. మతవి ద్వేషం మటుమాయమయింది.

ఈ ఘర్షణలు చల్లార్చడానికి ముఖ్యమంత్రి చేసింది ఏమీలేదు. ఏదో సముద్రంలో వాయు గుండం పుట్టినట్టు, నగరంలో మతావేశం పొంగిపోవడం కేవలం చిన్న రాజకీయ మా ర్పుతో, పొంగేపాలు మీద నీళ్లు చిలకరించిన ట్టుగా చల్లారిపోవడం... చాలా విచిత్రమే!

ఆ రోజు ఉదయమే ఆలీబేగ్‌గారు అన్నా రు... "చూశావా రవీ! ఈ మత ఘర్షణలు కేవలం గూండాలు రెచ్చగొట్టడం వలన జరి గేవి అంటే నువ్వు నమ్మలేదు కదూ... ఇప్పు డు చూడు! నగరంలో మతహత్యలు ఒక్కసా రిగా ఆగిపోయాయి''





అదీ నిజమే! నగరంలో ముఖ్యంగా పాత బస్తీలో పౌరజీవనం ప్రశాంతంగా మారిపో యింది.

తమ కోర్కెల సాధనకోసం రాజకీయ నా యకులు దేశం మొత్తం అయినా సరే శ్మశా నంగా మార్చగలరన్నది అతడికి ఎప్పుడో అర్థమయిపోయింది.

అతడు గోడకు వేలాడుతున్న అన్నా వది నల ఫొటోల దగ్గరకెళ్లాడు. తదేకంగా వారిని చూస్తుంటే, అప్రయత్నంగా చేతులు నమస్క రించాయి.

"అన్నయ్యా! కేవలం... కేవలం కుళ్లిపో యిన రాజకీయానికే మీరు బలయిపోయా రు... మిమ్మల్ని ఎవరూ చంపలేదు. చంపింది రాజకీయమే''

అతడు అలా ఎంతసేపుండిపోయాడో తెలి యదు, "బాబాయ్! మేము స్కూల్‌కి వెళుతు న్నాం" బేగ్‌లు భుజానికి తగిలించుకుని, బాక్స్‌లు చేతపట్టుకుని ఉన్నారు వారు. నూర్జ హాన్ వారింటి వాకిట్లో నిలబడి ఉంది.

రవి మౌనంగా తలూపాడు. వారు వెళ్లిపో యారు.

చాలాకాలంగా అంటే శ్రీనివాసరావు మర ణించిన రోజునుండి తమ ఇంట్లో పొయ్యి ముట్టించలేదు. వంట చేయడం తనకు రాదు. నూర్జహానే వారింట్లో వండిపెడుతోంది. పిల్లల పని చూసి, వారికి కావలసినవి సమకూర్చి అందిస్తుంది. ఆమె సహాయం లేకపోతే అతడి కి ఏనాడో పిచ్చిపట్టిపోయి ఉండేదేమో!

"మీరూ రండి... నాస్తా చేద్దురుగాని''

అతడు నిశ్శబ్దంగా ఇంట్లోకి నడిచాడు. పీట వేసుకుని కూర్చున్నాడు. నూర్జహాన్ ప్లే ట్‌లో చపాతీలు పెట్టి అతడి ముందుంచింది.

"బాబా ఇంట్లో ఉన్నారా?"

"లేరు.. సైట్‌కి వెళ్లారు''

తను సైట్‌కి వెళ్లి నెలరోజులయిపోయింది. ఆలీబేగ్‌గారే సైట్ వ్యవహారాలు చూసుకుంటు న్నారు. తనకి ఎక్కడికీ వెళ్లాలనిపించడంలే దు. ఇంట్లోనే కూర్చుని, అన్నావదినల ఫొటోల

ను చూడడమే సరిపోతుంది.

ఆయన కూడా తనను సైట్‌కి వెళ్లమని బలవంతం చేయలేదు.

ఈమధ్యకాలంలో తను కొంత పొదుపు చేశాడు. మరో ఆరేడు నెలలపాటు భుక్తికి లోటు లేదు. ఈలోపే పిల్లల విద్యా సంవత్సరం ముగిసిపోతుంది. ఆ తర్వాత... తను పుట్టిన గడ్డకు వెళ్లి నాలుగెకరాలు కౌలుకి తీసుకుని చేసుకుంటూ, పిల్లలను చదివించు కుంటూ...

అతడి మనసులోని ఆలోచన అదే!

★ ★ ★

జీవితం ఏదో భారంగా గడిచిపోతూ ఉంది అతడికి.

గతం తాలూకు జ్ఞాపకాలు నెమరువేసు కుంటూ చేసిన తప్పులకు పశ్చాత్తాప్పడుతూ, నిస్సారంగా కనిపించే భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ రోజులు నెట్టుకొస్తున్నాడు.

తన లోకంలో తను ఉండి పక్కవారి గురించి కూడా పట్టించుకోలేదు.

ఆరోజు మధ్యాహ్నం నూర్జహాన్ తనకు అన్నం వడ్డిస్తుంటే, అతడికి చప్పున గుర్తొచ్చింది. అజీజ్ అహమ్మద్... ఆరోజు అన్నయ్య చనిపోయిన రోజు నూర్జహాన్‌ని చూసేందుకు వచ్చాడు. ఆ తర్వాత ఆ ప్రస్తావనే రాలేదెందుకనో? అదే అడిగాడు.

"నూర్జహాన్! అజీజ్ అహమ్మద్... ఏమయిందా సంబంధం?"

ఆమె బదులు పలకలేదు. అన్నం వడ్డించేసి మౌనంగా ఇంట్లోకి వెళ్లిపోయింది. అతడికేమీ అర్థం కాలేదు. నూర్జహాన్ మనసేమిటో అతడికి తెలుసు! కాని ఆలీబేగ్‌గారు తీసుకు వచ్చిన సంబంధం...

భోంచేశాక అతడు ఆలీబేగ్‌గారి రూమ్‌లోకెళ్లాడు. గంటక్రితమే ఆయన సైట్‌కి వెళ్లి వచ్చి భోంచేసి పడుకున్నాడు. ఇంకా నిద్రపోలేదు. ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నాడు.

"సార్!" అతడు వాకిటనే చేరి పిలిచాడు.

ఆయన తలతిప్పి అతడిని చూసి "రావోయ్" అంటూ లేచి కూర్చున్నాడు. అతడు గదిలోపలికి అడుగుపెట్టాడు. ఆ గదిలోకి వచ్చి చాలా రోజులయిపోయింది. తను సైట్‌కి వెళ్లేప్పుడు ఆ గదిలోనికి వచ్చి పని విషయం చర్చించేవాడు. ఇప్పుడు తనకా గదిలోనికి రావలసిన అవసరమేముంది?

రవి ఆయన ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"వర్క్ ఎలా సాగుతోంది సార్?"

"చాలా స్లో అయిపోయింది. సరయిన ప్లానింగ్ లేదు. మిషనరీని ఎక్కడ పెట్టాలో, లేబర్ చేత ఏ పని చేయించాలో అక్కడ ఎవరికీ తెలియదు. మిషనరీకి పనిలేదు. లేబర్ చేసిన పనినే చేస్తున్నారు. ఈ వర్క్‌లో నష్టం వచ్చేలా ఉందోయ్''

ఆయన తనను సైట్‌కి వెళ్లమని అనకపోవడం అతడికి ఆశ్చర్యం కలిగించలేదు. ఆలీబేగ్‌గారి సంస్కారమేమిటో అతడికి తెలుసు.

అతడు కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాక అడిగాడు.

"సార్! ఆరోజు మీరు అజీజ్ అహమ్మద్ అనే వ్యక్తిని పెళ్లిచూపులకు పిలిచారు. ఆయనా వచ్చారు. మరి ఆ సంబంధం ఏమయింది?"

"తప్పిపోయింది''

"ఎందుకని?"

"నా మతస్తులే ఆ సంబంధాన్ని చెడగొట్టారు..." ఉన్నట్టుండి ఆయన కంఠం రుద్ధమయింది. "నేను మతద్రోహినట. ఒక హిందువుని ఇంట్లో పెట్టుకుని ఉన్నానట. ఇంకా ఇంకా నూర్జహాన్ గురించీ, నీ గురించీ చెడుగా ప్రచారం చేస్తున్నారు'' ఆయన పెదవులు బిగపట్టాడు.

అప్పటివరకూ చిరుగాలికి చిన్నగా కదలాడుతున్న కిటికీ తెర, హఠాత్తుగా కదలడం

మానేసింది. ఆ గదిలోకి రాబోతుండిన ఒక గాలి తెమ్మెర కిటికీ అవతలే ఆగిపోయింది.

తలుపు అవతల ఎవరో కదిలిన చప్పుడు. బహుశా నూర్జహాన్ అయి ఉండొచ్చు.

అతడు శిలా ప్రతిమలా కూర్చుండిపోయాడు చాలా సేపు. ఇద్దరి మధ్యా మాటలే కరువయిన సమయం.

చాలా సేపటి తర్వాత మాటలు పేర్చుకుంటూ ఆయన అన్నాడు. "రవీ! ఆ వెధవల మాటలు మనం పట్టించుకోనవసరం లేదు... నువ్వు... నువ్వు ఏమీ బాధపడకు. పైనుండి అల్లా అన్నీ చూస్తున్నాడు''

జవాబుగా ఏమీ మాట్లాడలేదు అతడు. అక్కడ నుండి లేచి వచ్చేశాడు.

వాకిలి దాటుతుంటే గడపపక్కనే నిలబడి ఉంది నూర్జహాన్! అతడిని చూసి కంగారుగా తప్పుకోబోయింది. నాలుగు సెకనులపాటు అతడు ఆమెను తదేకంగా చూశాడు. ఆమె కూడా అతడి కన్నులలోకే చూసింది. అతడు చప్పున తలతిప్పుకుని తన రూమ్‌లోకి వెళ్లిపోయాడు.

మంచం మీద వాలి కన్నులు మూసుకున్నాడు. గోడ గడియారంలో ముల్లు కదులుతూ, చేస్తున్న చప్పుడు... గంట గడిచింది.

కేవలం గంటలోపే అతడో నిర్ణయం తీసుకున్నాడు.

రూమ్‌కి తాళం వేసి వీధిలోకి నడిచాడు.

ఇక ఆ ఏరియాలో ఉండడం అతడికిష్టం లేకపోయింది. వస్తున్న బస్సుని ఎగిరి ఎక్కాడు. అది ఎటువైపు వెళుతుందో కూడా చూసుకోలేదు.

నాలుగు స్టాప్స్ తర్వాత దిగాడు. అక్కడి నుండి కనిపించిన సందులోనికి వెళ్లి విచారించడం మొదలు పెట్టాడు.

"ఏమండీ! ఇక్కడేదయినా ఇల్లు బాడుగకు దొరుకుతుందా?"

అలా విచారిస్తూ సందులూ, గొందులూ సాయంత్రం వరకూ తిరిగినా ఫలితం లేకపోయింది. అన్ని వసతులూ ఉన్న ఇల్లు, తనకు అందుబాటయిన బాడుగలో ఒక్కటీ కనిపించ లేదు.

ఇంటికి తిరిగి వచ్చేశాడు.

పిల్లలు అప్పటికే స్కూల్ నుండి వచ్చేశారు. స్నానం చేసి నీట్‌గా తయారయి ఉన్నారు.

అమ్మా నాన్న దూరమయ్యాక వారి పనులు చాలావరకూ వాళ్లే చేసుకుంటున్నారు.

అతడు పిల్లలను దగ్గర కూర్చోబెట్టుకుని కాసేపు వారు చెప్పే కబుర్లు వింటూ గడిపాడు.

వారింట్లో వంట పూర్తయిందేమో, నూర్జహాన్ వీరింట్లోకి వచ్చి వంట ప్రయత్నం మొదలెట్టింది.

అతడు స్నానానికి వెళ్లాడు... తిరిగొచ్చేసరికి పిల్లలు "ఆంటీ... ఆంటీ'' అంటూ ఆమె పక్కనే నిలబడి వంటకు సహాయం చేయడం కనిపించింది.

'ఇంకెంత?... మరో రెండు మూడురోజులేగా ఈ అనుబంధం?' మనసులోనే నవ్వుకున్నాడతడు బాధగా!

పిల్లల్ని పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని చదువుచెప్పసాగాడు.

ఎనిమిదింటివరకూ చదువు చెప్పాక వారిని లేపి భోజనంపెట్టాడు. తనూ భోంచేసి మంచమెక్కాడు.

మర్నాడు ఉదయంనుండీ ఇళ్లవేట కొనసాగించదలచుకున్నాడు రవి.

పిల్లలవెంట స్కూలువరకూ వెళ్లాడు. ఆ పరిసర ప్రాంతంలోనయితే వారికి కూడా అనుకూలంగా ఉంటుందన్న ఉద్దేశ్యం కలిగింది.

ఆ ప్రాంతంలో ఇంటి గురించి ఎంక్వయిరీ చేస్తుంటే, ఒక ఇంట్లోనివారు చెప్పారు, "అది గోండీ! ఆ ఇంటి మిద్దెమీద కాపురానికి ఉన్నవాళ్లు నిన్ననే ఇల్లు ఖాళీచేశారు. ఇస్తారేమో అడిగి చూడండి''




అతడు ఆవంక చూశాడు... ఆ ఇల్లు... ఇంతకుముందు తనోసారి వెళ్లాడు. అది... రామచంద్రరావుగారి ఇల్లు.

రవికి చప్పున ఆరోజు గుర్తుకువచ్చింది. ఆయనతో తన సంభాషణ మనసులో మెదలాడింది. ... 'ఏనాటికైనా, ఎప్పటికైనా రెండు వేర్వేరు జాతులు, మతాలమధ్య ఘర్షణ తప్పనిసరి!'

అంతేకాదు ఆయన చెప్పిన భవిష్యత్ జోస్యం కూడా మదిలో కదలాడింది... '... నా ఊహ సరయితే ఎప్పుడోకప్పుడు భారత్, రువాండాలలో వర్గవైషమ్యాలు మహా దారుణాన్ని సృష్టిస్తాయి. ఊహించలేనంత రక్తపాతం జరుగుతుంది

ఆయన జోస్యం నిజం కాకూడదనే అతడి ప్రార్థన!

రవి ఆ ఇంటివైపు నడిచాడు. గేటు తీసుకుని లోపలికి వెళ్లాడు. కాలింగ్‌బెల్ నొక్కిన నిముషం తర్వాత తలుపు తీశారు.

అతడిని చూసి "మీరూ..." అంటూ గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తుంటే తనే చెప్పాడు. "ఆలీబేగ్‌గారితో నేనోసారి మీ ఇంటికి వచ్చాను''

ఆయనకు గుర్తొచ్చింది. "రండి... రండి..." అంటూ తలుపుకు అడ్డం తొలిగాడు. రవి లోపలికి నడిచాడు.

లోపలికెళ్లాక సోఫా చూపించి, అతడు కూర్చున్నాక ప్రశ్నించాడు. "ఆలీబేగ్ కనుపించి చాలారోజులయింది. ఏం చేస్తున్నాడు?"

"ఏవో పనులలో బిజీగా ఉన్నారు''

ఆయన లోపలికెళ్ళి ఫ్రిజ్‌లోని వాటర్ తీసుకువచ్చి గ్లాసులో పోసి అతడికి అందించాడు.

"రజని కాలేజీకి వెళ్లింది. ఇంట్లో కాఫీ వేసేవారు మరెవరూ లేరు'' చెప్పాడాయన.

రజని అంటే ఆయన భార్య అనీ, ఆమె ఏదో కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తుందని అతనికి తెలుసు.

"మీరూ ఎక్కడికో బయలుదేరబోతున్నట్టున్నారు?" ఆయన డ్రస్‌వంక చూస్తూ అన్నాడతడు.

"అవును... యూనివర్సిటీకి బయలుదేరబోతున్నాను''

తనొచ్చిన విషయం త్వరగా చెప్పడం మంచిదనిపించింది అతడికి.

"మీ ఇంటి మిద్దెమీది పోర్షన్ ఖాళీ ఉందని తెలిసింది. బాడుగకు ఇస్తారేమోనని ఇలా వచ్చాను''

"ఎవరికోసం?"

"మాకోసమే?"

"మీరు ఆలీబేగ్ ఇంట్లో ఉంటున్నారుకదా!"

"ఇప్పటివరకూ ఉంటున్నాను. ఇప్పుడే ఇల్లు మారదలచుకున్నాను''

"ఎందుకని?"

"ఉద్రిక్తతలు తలెత్తేందుకు అవకాశమున్న ఏరియా అది. ఇప్పటికే అక్కడ నేను నావాళ్లను పోగొట్టుకున్నాను. ఇక నేనూ, ఇద్దరు చిన్నపిల్లలు... భయంభయంగా బ్రతకడం ఎందుకని... ఇలా ప్రశాంతంగా ఉండేచోటుకు మకాం మార్చదలచుకున్నాను''

"మీవాళ్లంటే?"

"అన్నావదినలు''

"ఏం జరిగింది?" ఆయన కాస్త ముందుకు వాలాడు.

జరిగిందేమిటో క్లుప్తంగా చెప్పాడు అతడు.

అంతా విన్నాక ఆయన "ఎంతఘోరం... ఎంత అన్యాయం" అన్నారు. "బాప్‌రే... ఇన్ని పరిస్థితులను తట్టుకుని మీరు నిలబడ్డారంటే... నిజంగా చెప్పుకోదగ్గ విషయం"

"ఇద్దరు పిల్లలను ప్రయోజకుల్ని చేయాల్సిన బరువుబాధ్యతలు నాకున్నాయి. గుండెను రాయిచేసుకోక తప్పదు''

ఆయన మరేం ఆలోచించలేదు.

"పై పోర్షన్ ఖాళీగానే ఉంది. మీరు ఎప్పుడ

యినా వచ్చి చేరిపోవచ్చు''

"అద్దె ఎంతో చెపితే...?"

"అద్దె గురించి ఆలోచించకండి. మీకు తోచినంత ఇవ్వొచ్చు''

ఆయనకు నమస్కరించి వచ్చేశాడు రవి.



"నేను నా మతస్తులందరినీ నీకోసం ఎదిరించి నిలబడ్డాను. కాని నువ్వుమాత్రం పిరికివాడిలా పారిపోతున్నావు''

"నేను పారిపోవడంలేదు'' రవి స్థిరంగా పలికాడు. "నావలన మీరు ఇప్పటికే ఎన్నో బాధలు పడ్డారు. మిమ్మల్ని ఇంకా బాధపెట్టడం నాకిష్టంలేకపోయింది''

"ఇప్పుడు నేను కొత్తగా పడే బాధ ఏముంది?"

"కొత్త బాధలు ఏమీ కలగకపోవచ్చు. కాని పాత బాధలు అలాగే కొనసాగే ప్రమాదం ఉంది. నేను దూరంగా వెళ్తే మీకా బాధలు ఉండవుకదా!"

ఆయన దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఇప్పుడు నువ్వు మానుండి దూరంగా వెళ్లిపోతానంటావు''

"పూర్తిగా కాదు''

ఆయన అర్థంకానట్లు అతడి ముఖంలోకి చూశాడు.

అతడు కిటికీపక్కనే నిలబడి ఉన్నాడు. కిటికీ అవతలంతా చీకటి. గదిలో ట్యూబ్‌లైట్ కాంతి. చీకటి వెలుగులమధ్య అతడు నిర్వికారంగా ఉన్నాడు.

"నేనిక్కడనుండి ఇల్లుమాత్రమే మారుతున్నాను. రేపటినుండి సైట్‌కి వెళ్లబోతున్నాను''

ఆయన తనకోసం ఎంతో కష్టపడ్డాడు. తను మరికొంతకాలం ఉండి పని పూర్తిచేయిస్తే నష్టపడడు. కనీసం ఆమాత్రం కృతజ్ఞతన్నా చూపించకపోతే మానవజన్మ ఎందుకు!

"సరే నీ ఇష్టం"

ఆయన అలా ఒప్పుకోవడానికి మరో కారణం ఉంది.

ఆ ఏరియాలోని ముస్లింలందరూ అతడి మీద కన్నేసివున్నారు. నిన్నటి ఘర్షణలలోనే అమీతుమీ తేల్చేవారే! కాని వెనుక ఆయనున్నాడు. అందుకే ఆదమరచిన తర్వాత దెబ్బ తీయాలని వారి ఆలోచన... అది ఆయనకూ తెలుసు.

రవి మరో ప్రాంతానికి మకాం మారుస్తుంటే ఆయన అంగీకరించింది అందువలననే!

తన నిర్ణయాన్ని ఆయన ఆమోదించడేమోనన్న సంశయం అతడికుంది. ఆయన ఒప్పుకోవడంతో సంతసించాడు.

మర్నాడు ట్రక్కులో సామాను నింపుతుంటే ఎవరూ చూడకుండా నూర్జహాన్ "వెళ్లిపోతున్నారా?" ప్రశ్నించింది.

అతడు తలూపాడు.

"ఇక ఎప్పటికీ కనిపించరా?"

"ఎందుకు కనిపించనూ?!... అప్పుడప్పుడూ వస్తుంటాగా''

ఆమె కన్నుల్లో కాసింత తృప్తి.

ఒక మనిషిమీద మరో మనిషికి అభిమానం, ఆప్యాయత కలిగేందుకు కారణం ఏమిటి?

ఒక స్త్రీ ఒక పురుషుడిమీద ఆరాధన పెంచుకునేందుకు పునాది ఏమిటి?




ఏ శాస్త్రజ్ఞుడూ ఈ ప్రశ్నలకు జవాబు చెప్పలేడు.

సామాను వెంట ఆలీబేగ్ కూడా జీప్‌లో వచ్చారు.

రామచంద్రరావు మిత్రుడిని పిలుచుకుని పై పోర్షన్‌లోకి తీసుకెళ్లాడు.

కూలీలు సామాను సర్దుతుంటే వారిద్దరూ అక్కడే నిలబడ్డారు మాట్లాడుకుంటూ.

"రవి చాలా మంచివాడు రామచంద్రం"

"కాబట్టేగా నువ్విలా అతడివెంట రాగలిగావు''

"మా ఏరియాలో పరిస్థితులు బాగోలేవు. అందువలనే అతడు ఇల్లు షిఫ్ట్ అయ్యేందుకు ఒప్పుకున్నాను''

"రవిగారు పరిస్థితులు వివరించారు... పాపం! వారి అన్నావదినలను మతఘర్షణల కారణంగా పోగొట్టుకున్నాడని తెలిసింది.

"అవును'' ఆయన చెప్పాడు. "కొంతలో కొంత తృప్తి ఏమిటంటే, అతడు నా ఇల్లు వదిలినా, నా మిత్రుడి ఇంటిలో చేరాడు. ఈ కారణంగానయినా నేను అప్పుడప్పుడూ ఇక్కడికి రావొచ్చు. మిమ్మల్నిద్దర్నీ... ఊహుం! అతడిని సైట్‌లో కలుస్తాను. నీతోనే మాట్లాడేందుకు వస్తుంటాను''

"యు ఆర్ ఆల్‌వేస్ వెల్‌కమ్''

ఆయన అక్కడ చాలాసేపు వారిద్దరితో గడిపాక తిరిగి వెళ్లిపోతూ రామచంద్రరావును పక్కకు పిలిచి చెప్పాడు.

"రవి... అతడు మంచి కుర్రాడు. అన్నావదినలను పోగొట్టుకుని దుఃఖంలో ఉన్నాడు. అతన్ని కాస్త జాగ్రత్తగా... మీ ఇంట్లో ఒకడిగా చూసుకో'

రక్తసంబంధాన్ని కూడా పట్టించుకోని ప్రస్తుత సమాజంలో, కనీసం తన మతస్థుడు కూడా కాని ఒక యువకుడికోసం ఆలీబేగ్ పడే తాపత్రయాన్ని చూసి ఆశ్చర్యపడ్డా, "భలేవాడివే! నీకు సంబంధించిన వ్యక్తి నాకు దగ్గరివాడేకదా! అతడి గురించి నువ్వేం బెంగపడకు. నా స్వంత తమ్ముడిలా చూసుకుంటాను.. సరేనా?" అన్నాడు.

ఆలీబేగ్ తృప్తిగా వెళ్లిపోయారు.

★ ★ ★

రామచంద్రరావుగారిది నెల్లూరుజిల్లాలోని ఒక పల్లె!

ఆయన ఇంటర్ తప్పాక హైదరాబాదు వచ్చి, ఒక చిన్న ఉద్యోగంలో ప్రవేశించాడు. ప్రయివేట్‌గా పరీక్ష పాసయి ఓ ప్రైవేట్ కాలేజ్‌లో డిగ్రీలో చేరాడు. ఆలీబేగ్‌తో ఆయనకు పరిచయం అక్కడే!

ఉద్యోగం చేసుకుంటూనే చదువుకుంటూ... ఇప్పటికీ రీసెర్చ్ స్కాలర్‌లా...

ఆయన భార్య రజని, కాలేజీ లెక్చరర్‌గా పనిచేస్తోంది. వారిది అన్యోన్య దాంపత్యం!

వారికి ఒకడే కుమారుడు రోహిత్! డిగ్రీ చవుతున్నాడా కుర్రాడు.

వెళ్లిన నాలుగు రోజుల్లోనే రవిని తమలో ఒకడిగా కలిపేసుకున్నారు వారు.

రామచంద్రరావుకి అతడు తమ్ముడు. రజనికి పెద్దకొడుకు. రోహిత్‌కేమో అన్నయ్య!

ఆయన ప్రతి సాయంత్రం రవిని దగ్గరపెట్టుకుని అనేక విషయాలు చెప్పేవారు. అందులో ఎక్కువ ఆయన సబ్జెక్ట్ ఉండేది.

రామచంద్రరావుగారితో సంభాషణ అతడికి ఈ సమాజంపట్ల, వ్యవస్థపట్ల, వ్యక్తుల ప్రవర్తనపట్ల ఒక మంచి అవగాహన కలిగించింది.

ఆయన అతనికి ఎన్నో విషయాలు చెప్పాడు. మరెంతో బోధించాడు.

ఒక్కో మనిషితో పెరిగే పరిచయం మనిషికి ఒక్కోరకమైన అనుభవం ఇస్తుంది. రకరకాల అనుభవాలే మనిషికి వాస్తవం అర్థమయ్యేలా చేసేది.

ఆలీబేగ్‌గారితో అతని పరిచయం 'మతం' గురించిన కొన్ని నిజాలు తెలియజేస్తే, రామచంద్రరావుగారి సహచర్యం 'మనిషి'గా తనేం

చేయాలో వివరించింది.

అతడు ఉదయమే లేచాక పిల్లలకు ఒక గంట చదువు చెప్పేవాడు. తర్వాత వచ్చీరాని వంటచేసి వారి బాక్స్‌లలో సర్ది తను సైట్‌కి వెళ్లిపోయేవాడు. సాయంత్రం వచ్చేసరికే పిల్లలు చదువుకుంటుండేవారు. తను స్నానం చేసి, వంట కానిచ్చి, పిల్లలూ తనూ తిన్నాక, వారిముందు పుస్తకాలు వేసేసి తను కిందకి వెళ్లేవాడు. రామచంద్రరావుగారితో పదకొండు గంటలవరకూ గడిపేవాడు.

రవి రోజూ చేతులు కాల్చుకోవడం చూసి రజని అనేది, "ఏమయ్యా రవీ! ఇలా ఎన్నిరోజులు కష్టపడతావు? మంచి అమ్మాయిని చూస్తాం, పెళ్లి చేసేసుకోకూడదూ?"

అతడు జవాబు చెప్పేవాడు కాదు. నవ్వి ఊరుకునేవాడు.

'వర్క్ త్వరగా పూర్తిచేసేసి పల్లెకు వెళ్లిపోవాలని' అతడి కోరిక. అది పూర్తయ్యేసరికే మరో సంవత్సరం ఆరునెలలు పడుతుంది. అంటే... పిల్లలను మరో ఎకడమిక్ ఇయర్ కూడా ఇక్కడే ఉంచాలి.

అతడికి మనస్ఫూర్తిగా ఇష్టంలేదు. కాని కృతజ్ఞతాభావం అతడిని కదలనివ్వడంలేదు. పోనీలే! మరో సంవత్సరానికి పెద్దవాడి స్కూల్‌ఫైనల్ కూడా అయిపోతుంది. ఒకేసారి వాడిని విజయవాడ కాలేజీలో చేర్పించేసి, చిన్నవాడిని పల్లెలోని గవర్నమెంట్ హైస్కూల్‌లో తొమ్మిదో తరగతిలో చేర్పించేస్తే సరిపోతుంది అనుకున్నాడు.

మరో పద్దెనిమిది నెలల కాలం... హైదరాబాదు నగరంతో తనకు అనుబంధం!

ఆ తర్వాత పల్లెలో... తను పుట్టిన గడ్డమీద ప్రశాంతంగా... నిశ్చింతగా...

మనిషి ఎప్పుడూ ఆశాజీవే!

★ ★ ★

"మాస్టారూ! ఎన్నో వందల సంవత్సరాల క్రితం ఏర్పడిన ఈ జాతి, తెగ, మత వైషమ్యాలు ఇలా అనంతంగా సాగవలసిందేనా? దీనికో అంతం లేదా?"

రామచంద్రరావు డ్రాయింగ్‌రూంలోకి వచ్చి కూర్చున్న పదినిముషాలకల్లా రవి వచ్చేశాడు. ప్రతిరోజూ తొమ్మిదిగంటలకు ఆ గదిలో కూర్చుని మాట్లాడుకోవడం వారికి అలవాటయింది. ఒక్కోసారి రజని కూడా వచ్చి వారితో కూర్చునేది. లేదా గదిలో నిద్రపోయేది. అంతేతప్ప అర్ధరాత్రివరకూ ఈ అనవసర బాతాఖానీ ఏమిటనిమాత్రం విసుక్కునేది కాదు!

"రవీ! మనిషి ఎంతో విజ్ఞానాన్ని సంపాదించాడు. ఈ జాతి, మత, కులాలు కేవలం మనిషికీ మనిషికీ మధ్య అడ్డుగోడలని తనకీ తెలుసు. అయినా తనలోని సంకుచిత భావాలు వదులుకోలేకున్నాడు. మనిషి సంకుచితంగా ఆలోచించినంతకాలం ఈ రక్తపాతం ఇలా సాగవలసిందే.

ఆకాశంలో చంద్రుడు తెల్లగా మెరుస్తున్నాడు. కిటికీ అవతలి నైట్‌క్వీన్ మొక్క గాలికి నెమ్మదిగా ఊగుతోంది.

"కాని వాస్తవంగా మనిషి ఈ అడ్డుగోడలు పట్టించుకోకపోయినా, కొందరు స్వార్థపరులు జనాలను రెచ్చగొట్టి తమ పబ్బం గడుపుకుంటున్నారు''

"అవును'' అన్నారాయన.

"ఈ ప్రపంచంలో ఎప్పుడూ స్వార్థపరులు ఉంటారు. కాని తెలివయిన జనం వారి మాటల ప్రభావంలోపడి రెచ్చిపోకూడదు''

"అది అంత సులభంకాదు''

"ఎందుకని?"

"ఆ స్వార్థపరులు సామాన్య జనానికన్నా ఎంతో తెలివయినవారయి ఉంటారు. వారి వాగ్ధాటి ఎంత తెలివయినవారినయినా ఆలోచింపనివ్వదు. మెస్మరైజ్ చేసి రెచ్చిపోయేలా చేస్తుంది''





అతడు కాస్త ఆలోచించాడు. "నిజమే! ఏకాలంలోనయినా స్వార్థపరులు తెలివయిన వారే! వారు చాలా సులభంగా మామూలు జనాన్ని రెచ్చగొట్టగలరు.

రజని అక్కడికి వచ్చింది. "ఏమిటి? ఇద్దరూ ప్రపంచశాంతి గురించి శిఖరాగ్ర సమావేశం జరిపే నాయకుల్లా సీరియస్‌గా చర్చించుకుంటున్నారు?" నవ్వుతూ ప్రశ్నించింది.

"మేము మాట్లాడుకునేది ప్రపంచశాంతి గురించే!" అదే సీరియస్‌నెస్‌తో బదులిచ్చాడు రామచంద్రరావు.

"ప్రపంచశాంతి గురించా?!... ఏమిటో నాకూ చెప్పరూ. నేనూ వింటాను'' ఆమె రవి పక్కనే సోఫాలో కూర్చుంది. ఏదో గమ్మత్తయిన సువాసన ఆమె శరీరంనుండి గాలిలో తేలి అతని ముక్కుపుటాలను తాకింది.

"ఈ జాతి, మత వైషమ్యాలకు అంతంలేదా? అని ప్రశ్నిస్తే అది అంత సులభంగా అంతంకాదని చెపుతున్నాను'' ఆయన తమ చర్చల సారాంశం గురించి చెప్పాడు.

"మీ చర్చలు బాగానే ఉన్నాయి! ఏదో కుర్రాడు చేతులు కాల్చుకుంటున్నాడే, పెళ్లి చేసుకోమని హితబోధ చేద్దామనే ధ్యాసలేకుండా, ప్రపంచశాంతి గురించి బాధపడుతున్నారా?"

ఆయన కాసేపు తలగోక్కుని "నేను ఆ విషయం గురించి రోజూ చెపుతూనే ఉన్నాకదా! తను వింటేనా?" గొణిగాడు.

"మీరు చెపుతున్నారు, కాని గట్టిగా ప్రశ్నించలేదు''

రామచంద్రరావు కొద్దిగా తడబడ్డాడు. "గట్టిగానా! అంటే...?"

"ఇదిగో, ఇలా..." ఆమె రవివంక తిరిగింది. "చూడు రవీ! ఇప్పటికి ఎన్నోసార్లు నీముందు ఆ ప్రస్తావన తీసుకువచ్చాను. ఈరోజుమాత్రం సీరియస్‌గా అడుగుతున్నాను. చెప్పు...! నీకు పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం ఉందా లేదా?"

"అదేంమాట ఆంటీ... నేనూ తప్పకుండా పెళ్లిచేసుకుంటాను'' చెప్పాడు అతను.

"ఇంకా ఎప్పుడు?" పక్కనుండి రామచంద్రరావు ప్రశ్నించాడు.

అతడు ఆయనవంక తిరిగాడు. "మాస్టారూ! ఎప్పుడంటే నేనేం చెప్పేది?... ఇంతవరకూ నాకంటూ స్థిరత్వమేముంది?"

"నీకేం ఆలీబేగ్ దగ్గర సైట్ ఇన్‌చార్జ్‌గా ఉన్నావు. నెలకో రెండువేలు సంపాదిస్తున్నావు''

"నేను మాట్లాడేది సంపాదన గురించి కాదు''

"మరి?"

అతడు కొద్దిక్షణాలు ఆలోచించుకున్నాక పలికాడు, "నేను హైదరాబాదులో మరికొద్ది కాలం ఉంటాను. తర్వాత మా పల్లెకు వెళ్లిపోతాను. అక్కడికి వెళ్లాక పెళ్లి చేసుకోవాలని అనుకుంటున్నాను''

వారిద్దరూ విస్మయంగా అతడివంక చూశారు. ఒక్కసారే "పల్లెటూరికి వెళతావా?" అన్నారు.

"అవును'' తలూపాడు అతను.

"హైదరాబాదులో చక్కగా సంపాదించుకుంటున్న నువ్వు పల్లెటూరికెళతావా?" ఆయన కళ్లకు అతడో పిచ్చివాడిలా కనిపిస్తున్నాడు. "వెళ్లి అక్కడేం చేస్తావు?"

"నాలుగెకరాల పొలం కౌలుకి తీసుకుని కష్టం చేస్తాను''

"నీకు నిజంగా పిచ్చిపట్టింది'' రజని తేల్చి చెప్పింది. "పొలం కౌలుకి తీసుకుని కష్టంచేసి ఏం మిగిలిస్తావు?"

"మిగిలించకపోయినా పస్తులుండే పరిస్థితి మాత్రం రాదు''

"ఇక్కడ పస్తులుంటున్నావా?"

"లేదు''





"మరి పల్లెటూరికి ఎందుకు వెళ్లడం?"

అతడు జవాబు చెప్పలేదు.

"చెప్పు రవీ! పల్లెటూరికి... అక్కడ ఏముందని వెళ్లాలనుకుంటున్నావు?"

"ప్రశాంతత... నిర్భీతి... ఆప్యాయత... అందమైన వాతావరణం... చక్కని అభిమానం...! ఎక్కడయితే మనిషి మరుని ముషం ఏం జరుగుతోందోనన్న భయం లేకుండా బతకగలుగుతున్నాడో అ చోటుకి! కేవలం 'తన ఇల్లు' అన్న స్వార్థం ఇంకా చొరబడకుండా, ఇరుగుపొరుగు గురించి ఆలోచించి, ఆదుకునే మనస్తత్వం ఉన్న మనుష్యుల మధ్యకు!! ఎక్కడయితే సామాన్య మానవుడు చనిపోయినా, స్మశానం వరకూ వెంటవచ్చే 'మానవత' వుందో ఆ ప్రదేశానికి! నిజం మాస్టారు! ఎక్కడయితే మనిషి ఇంకా మనిషిగా బ్రతుకుతున్నాడో ఆచోటుకి వెళ్లిపోవాలనుకుంటున్నాను... అక్కడ ఏముందనికదూ మీరనేదీ?... ఎన్నికోట్లు ఖర్చుపెట్టినా దొరకని ప్రశాంతత ఉంది. ఎంతమంది కాపలా ఉన్నా లభించని నిర్భీతి ఉంది. ఎంత సంపాదిస్తే ఏం చేసుకుంటారు మాస్టారూ! కాసింత ఆప్యాయత కరువయితే చాలదూ!..." అతడు మునుపెన్నడూ అంత ఆవేశంగా మాట్లాడలేదు.

తమ కుటుంబం పల్లెనుండి పట్నం వచ్చింది. విజయవాడలో వర్గాల కుమ్ములాటలు, అందులో అవకాశవాదులు తమ ఆస్తిని దోచుకోవడం జరిగింది. హైదరాబాదులో అధికార మార్పిడికోసం రెచ్చగొట్టబడిన మత విద్వేషాలు... తను అన్నావదినలను పోగొట్టుకోవడం... కష్టాలు, కన్నీళ్లు, రోదన, వేదన... అంతా ఒక్కసారి గుర్తొచ్చి అతడు తనను తాను మరిచిపోయాడు. ఒకరకమయిన కసి... కోపం... అప్పటివరకూ ఉడుకుతుండిన అగ్ని పర్వతం ఒక్కసారిగా బద్దలైనట్లు... అతడు బరస్ట్ అయ్యాడు.

ఒకవిధమైన ట్రాన్స్‌లో అతడి గొంతు మందంగా వినిపించసాగింది.

"మాస్టారూ! ఈ దేశంలోని డెబ్బయ్ శాతం జనాభా పల్లెల్లోనే నివసిస్తున్నారు. అక్కడివారికి కూడా కష్టాలున్నాయి, కన్నీళ్లున్నాయి. అయితే అవి కేవలం సహకరించని ప్రకృతివల్లనో, మితిమీరిన ఆర్థిక బాధలవల్లనో! అవి సహజాతి సహజమయిన కష్టాలు! అంతే తప్ప అక్కడ కృత్రిమ సమస్యలపట్ల బాధ, భయం లేవు... మా ఊళ్లో కూడా వర్గాలున్నాయి. రకరకాల రాజకీయ పార్టీల ప్రభావం ఉంది. వారంతా వాదులాడుకుంటారు. ఒక్కోసారి కొట్టుకునేవరకూ వెళతారు... అదీ ఎప్పుడో ఏమో! ఒకవేళ అక్కడి వర్గాలు కొట్టుకున్నా అది ఆసరాగా తీసుకుని కొందరు అవకాశవాదులు, ఇతరుల ఇళ్లల్లో జొరబడి లూటీచేయరు... మా ఊళ్లో మస్తాన్‌సాయబు ఉన్నాడు. అతను మాకు పరుపులు కుట్టి ఇస్తాడు. మేమతన్ని సాయబయ్యా అంటాం. మా ఊళ్లోనూ మతాభిమానులు ఉన్నారు. కాని మా ఊరి మతాభిమానులెవరూ సాయబయ్యను చంపాలనుకోరు. ఎందుకంటే అతను 'మా ఊరి సాయబయ్య'. మతంపేరుతో మనుష్యుల్ని చంపుకునే హీనస్థితికి పల్లెలు దిగజారలేదు. మీరు ఏ పేపరయినా తిరగేయండి మతకల్లోలాలు మొదలయ్యేది, విలయ తాండవం సృష్టించేది నగరాలలోనేగానీ, గ్రామాలలో కాదు. 'ఏ గ్రామంలోనయినా మత ఘర్షణల్లో మనుష్యులు చనిపోయిన' వార్త పేపర్‌లో ఉందేమో చూడండి... మీకు అలాంటి వార్త ఎక్కడా కనిపించదు, వినిపించదు... మాస్టారూ! మా ఊళ్లో ఏ సామాన్యుడు చనిపోయినా ఊరిలోని మగాళ్లందరూ స్మశానంవరకూ వెళ్తొస్తారు. మనిషి జన్మకు అంతకన్నా ఏం కావాలి?

లూటీలు, బంద్‌లు, కర్ఫ్యూలు, మతఘర్షణలు... ఇవన్నీ కేవలం పట్టణాలకూ, నగరాలకే పరిమితమయి ఉన్నాయి. పరిశీలించండి! వీటి ప్రభావం పల్లెలమీద ఏమాత్రం ప్రతిఫలించడంలేదు. ఎందుకనో ఆలోచించండి!!

ప్రతి దుర్మార్గం నగరంలో పుడితే, సన్మార్గం పల్లెల్లో ప్రభవిస్తుంది. సారా వ్యతిరేకోద్యమం ఒక గ్రామంలో మొదలయిందన్న విషయం మీకు తెలియంది కాదు... అందుకే మాస్టారూ! నేను మా పల్లెకు పోవాలని కోరుకుంటున్నాను. ఎక్కడయితే మంచి, మానవత్వాలు ఇంకా మిగిలివున్నాయో వాటి మూలాలు మా పల్లెల్లోనే ఉన్నాయి. వాటిచెంత చేరాలనే నా ఆకాంక్ష!

ఈ నగరాల్లో జీవితమంటేనే నాకసహ్యమేసిపోతుంది మాస్టారు! కీర్తి కనకాలకు లొంగే మానవుల సముదాయమే ఈ నగరాలు!!..: ఇక్కడ ఏముంది...? నిముషానికో రోడ్డుప్రమాదం, అరగంటకో హత్య, గంటకో మానభంగం, రోజుకో బాంబుప్రేలుడు, రెండురోజులకొకసారి బంద్, వారానికోసారి కర్ఫ్యూ, నెలకోమారు మతవిద్వేషమనే మారణ హోమం... ఏ నిముషం ఏం జరుగుతుందో తెలియదు. మనం ఇంట్లో కూర్చునివున్నా ఇంటిపైన బాంబులు పడవచ్చు. వీధిలో కూరగాయలు కొంటుంటే పక్కవాడు పొడిచి పారిపోవచ్చు. పేపర్‌లలోని తొలి పేజీ వార్తలన్నీ పట్టణాలవే అయివుంటాయి. గమనించండి. కేవలం ముప్పయ్‌శాతం వ్యక్తులున్నదే వింతల ప్రపంచం, వార్తల ప్రపంచం.

ఇటువంటి ప్రదేశంలోనా నన్ను ఉండమని మీరు కోరేది?!!... వద్దు ఈ నగర జీవితం నాకొద్దు... ఈ పట్టణాలు, నగరాలు మానవజాతికి, మానవజాతి మనుగడకు ముప్పుతెస్తున్న రొచ్చుగుంటలు, మానవతను మంటగలుపుతున్న రాక్షసుల నిలయాలు... ప్రపంచ మానవాళికే ప్రమాదమవుతున్నవీ మహానగరాలు...

అదిగో! పల్లె పిలుస్తోంది. ప్రశాంత జీవనం నీకు అందిస్తానురా మానవుడా! అంటూ ఆహ్వానిస్తోంది. ఆమె ఒడిలో ఎవరయినా నిర్భీతితో నిద్రపోవచ్చు... నేనూ అక్కడికే వెళతాను..."

★ ★ ★

ఉదయం సైటుకి బయలుదేరబోతుంటే విజయవాడనుండి రామకృష్ణ వచ్చాడు. తన కొడుక్కి పాలిటెక్నిక్ ఎంట్రన్స్‌లో రాంక్ వచ్చిందనీ, ఇంటర్వ్యూ హైదరాబాదులో జరుపుతుంటే పిల్లవాడిని తీసుకొచ్చాననీ చెప్పాడు.

తను సైటుకి వెళ్లడం పోస్ట్‌పోన్ చేసుకుని ఆయనకు స్నానపానాదులు తయారుచేయసాగాడు రవి.

హైదరాబాదు తనకు కొత్తట. ఇంటర్వ్యూ జరిగే ప్రదేశం కూడా తెలియదట.... అడ్రసు కాగితం అతడి చేతిలోపెట్టి, తమని కాస్త అక్కడ దిగబెట్టమన్నాడు రామకృష్ణ.

తప్పేదేముంది...? వారు స్నానంచేసి, టిఫిన్ తిన్నాక బస్సులో ముగ్గురూ సికింద్రాబాదులోని టెక్నికల్ బోర్డు కార్యాలయానికి వెళ్లారు. ఇంటి అడ్రసు రాసిచ్చి, ఇంటర్వ్యూ అయిపోయాక ఇంటికెళ్లమన్నాడు. అటువైపు వెళ్లే బస్సు నంబర్లు, గుర్తులు చెప్పాడు. ఇంటి తాళాలు వారి చేతిలోపెట్టాడు.

అక్కడినుండి మళ్లీ ఇంటికెళ్లి స్కూటర్ తీసుకుని సైటుకి వెళ్లడం... ఎందుకులే అనుకుని బస్సు ఎక్కేశాడు.

బస్టాపులో బస్సు దిగి లేబర్‌వైపు నడిచి వెళుతుంటే అల్లంత దూరంలోనే అతన్ని చూసిన అజయ్, ఎదురుగా వచ్చాడు. ఆరోజెందుకనో అజయ్ ముఖం మతాబులా వెలిగిపోతోంది.

"రవిసాబ్! మీకో గుడ్‌న్యూస్"

"ఏమిటి?"

"ఆమధ్య నేనో ఇంటర్వ్యూకెళ్లానని చెప్పాను గుర్తుందా?... ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో జె.ఇ. పోస్ట్‌కి... నిన్ననే అపాయింట్‌మెంట్ ఆర్డర్‌వచ్చింది. అది చెప్పి వెళ్లాలనే వచ్చాను"

"కంగ్రాచ్యులేషన్స్" మనస్ఫూర్తిగా చెప్పాడు రవి.

"సో! ఈరోజు మీకు మంచి పార్టీ ఇవ్వబోతున్నాను"





"పార్టీ అంటే... నాకు బార్‌లకు వచ్చే అలవాటులేదు''

"పోనీ రూమ్‌కి తెచ్చుకుని సెలబ్రేట్ చేసుకుందాం''

"ఐ మీన్. నాకు తాగుడు అలవాటులేదని''

"ఈజిట్?" ఆశ్చర్యపోయాడు అజయ్.

వారిద్దరూ రెండేళ్ళు కలసి పనిచేసినా, వారి పరిచయం కేవలం సైట్‌కే పరిమితం.

"యస్''

"సరే! ఏం చేద్దాం" అజయ్ భుజాలెగరేసాడు.

ఇద్దరూ లేబర్‌వైపు వెళుతున్నప్పుడు అజయ్ అడిగాడు "మీరీరోజు స్కూటర్ తీసుకురాలేదేం?"

"మరో ఇద్దర్ని సికింద్రాబాదులో దిగవిడిచి రావలసి వచ్చింది. ముగ్గురం స్కూటర్‌లో వెళ్ళలేం కదా! బస్సులోనే వెళ్ళి అటు నుండి ఇటు వచ్చేసాను''

లేబర్ రోడ్‌సైడ్ కటింగ్ చేస్తున్నారు. మేస్త్రి రవిని చూసి చేతులు జోడించాడు.

ఆకాశంలో అప్పుడప్పుడే మబ్బులు కమ్ముతున్నాయి. వర్షం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

"నీకు ఉద్యోగం.వచ్చిన విషయం ఆలీబేగ్‌కి చెప్పావా?"

"ఉదయమే ఇంటికెళ్ళి చెప్పాలనుకున్నాను. నిద్రలేవడం ఆలస్యమయింది. సైట్‌లో నిన్నటి వర్క్ కొంత బేలన్స్ ఉంది కదా!... ఆలస్యమయితే లేబర్ వేస్ట్ అవుతారు. అందుకే ఇలా వచ్చేసాను. ఆయన ఎలాగూ సైట్‌కి వస్తారు కదా?"

"రావచ్చు''

వారలా మాటాడుకుంటున్నప్పుడే దూరంగా జీపు వస్తున్న చప్పుడయింది. అదే క్షణం పైనుండి చిరుజల్లులు పడసాగాయి.

ఆయనవారి పక్కనే జీప్ ఆపి, "ఇదేమిటి! నేను వస్తూ వర్షాన్ని తీసుకువచ్చినట్టున్నానే'' అన్నారు నవ్వుతూ.

"నిజమే సార్'' అజయ్ కూడా నవ్వాడు.

"బాగుంది'' ఆయన జీప్‌లోనుండి దిగలేదు. వర్షం చినుకులు పెద్దవవడం చూసి, "మీరూ జీపులోకి రండి'' పిలిచాడు.

వారిద్దరూ జీపు ఎక్కి కూర్చున్నారు. డోర్ గ్లాస్‌లు పైకెత్తేసారు.

లోపల కూర్చున్న అరనిముషం తర్వాత రవి ఆలీబేగ్‌తో చెప్పాడు, "సాబ్! మన అజయ్ ఒక గుడ్‌న్యూస్ చెప్పబోతున్నాడు మీకు''

"ఏమిటది?" క్యూరియస్‌గా చూసారాయన.

అజయ్ చెప్పాడు, "నాకు జూనియర్ ఇంజనీర్‌గా గవర్నమెంట్ జాబ్ వచ్చింది సార్''

"నిజమా?" ఆయన ఆశ్చర్యానందం కనపరిచారు. "అయితే కంగ్రాచ్యులేషన్స్'' సంతోషంగా చెప్పాడు.

సాధారణంగా కొంతమంది వ్యక్తులు తమ కింద పనిచేసే ఉద్యోగి, పైస్థానానికి ఎగబాకుతుంటే అంతగా ఆనందించలేరు. తమ వర్కర్ వెళ్ళిపోతున్నాడనేబాధ... అదీ స్వార్థంగా ఆలోచిస్తూ, పైకి మాత్రం నవ్వుతూ వీడ్కోలు చెపుతారు. ఆలీబేగ్‌లో అటువంటి భావం ఏమాత్రం కనిపించలేదు సరిగదా తన కుటుంబంలో ఒకరికి ప్రభుత్వోద్యోగం వచ్చినట్టుగా సంబరపడటం కనుపించింది.

వర్షం మరికాస్త ఎక్కువయింది. ఆకాశంలో నల్లమబ్బులు పోయి తెల్లగా మారింది. తెల్లమబ్బు మీద కురిసే వర్షం ఎంతకూ తెరిపి ఇవ్వదు- అంటారు.

అప్పటికే లేబర్ పూర్తిగా తడిసిపోయారు. జల్లులు పెద్దవి కావడంతో తట్టుకోలేక చెట్ల కిందకు పరుగెత్తారు.

"మనమూ కేంప్‌కి వెళితే బాగుంటుందేమో'' చెప్పారాయన.

వారిద్దరూ మౌనంగా ఉన్నారు.

ఆలీబేగ్ జీప్ స్టార్ట్ చేసి కేంప్‌వైపు పోనిచ్చారు.

గుడిసె పక్కనే జీప్ ఆపి, ముగ్గురూ లోపలికి పరుగెత్తారు.

లోపలికెళ్ళి కూర్చున్నాక, ఆలీబేగ్ పెద్దగా చెప్పారు "పాపయ్యా! చాయ్ చేసి తీసుకురా''

"తెస్తాను సాబ్'

ఆలీబేగ్ కుర్చీలో వెనక్కు వాలారు. అజయ్‌వంక ఆప్యాయంగా చూస్తూ, "అయితే మన అజయ్ మనల్ని విడిచి వెళ్ళిపోతున్నాడన్నమాట"

"విడిచిపోవడమేమిటి సార్! అప్పుడప్పుడూ ఇక్కడికి వస్తూనే ఉంటాను''

"వచ్చినా గెస్ట్‌గానే కదటోయ్''

అజయ్ నవ్వి ఊరుకున్నాడు.

"సో!... మనం మరో ఇంజనీర్‌ని వెతుక్కోవాలి రవీ''

"తప్పదు కదా సార్'

పాపయ్య ట్రేలో టీ కప్పులు తీసుకొచ్చి వారి ముందు ఉంచాడు.

చాయ్ తాగుతూ కూర్చున్నారు వారు.

ఆయన యధాలాపంగా బయటకు చూస్తూ, అప్పుడే గుర్తుకువచ్చినట్టు ప్రశ్నించాడు. "రవీ! నీ స్కూటర్ ఏది?"

"తీసుకురాలేదు సార్' విషయం చెప్పాడు అతడు.

తలూపాడాయన.

తర్వాత వర్క్ విషయం చర్చించుకుంటుంటే... మధ్యాహ్నమయింది. బయట వర్షం మాత్రం తగ్గలేదు.

రవి, అజయ్‌లు కేరియర్‌లు విప్పారు. మరో ప్లేట్ కడిగించి, తమ కేరియర్‌లోది ఆయనకూ కొంత వడ్డించారు.

ఆయన బెట్టు చేయలేదు. అందరితో కలిసిపోయే మనస్తత్వం ఆయనది.

భోంచేస్తుంటే ఆయన రవిని చూస్తూ అడిగారు. "ఇది నీ స్వయంపాకమా?"

తలూపాడు అతడు.

"అంతకుముందు నీకు వంటచేయడం రాదు కదూ?"

"ఈమధ్యనే నేర్చుకున్నాను సార్'

ఆయన అతనివంక కొద్దిసెకనులు తదేకంగా చూసాడు. ఆ చూపులో ఎన్ని భావాలో?

భోజనాలయ్యాక కూడా ఒక గంటసేపటివరకూ కూర్చున్నా, వర్షం తగ్గే సూచన కనిపించలేదు. రెండునిముషాలు తగ్గినా, వెంటనే మళ్ళీ మొదలవుతోంది.

"ఈ వర్షంలో లేబర్ మాత్రం ఏంపని చేయగలరు? వారిని వెళ్ళిపొమ్మని చెపుదాం... మనమూ వెళ్దాం పదండి''

సైట్‌లోకెళ్ళాక మేస్త్రిని పిలిచి లేబర్‌ని పంపేయమని చెప్పాడు రవి. జీప్ ముందుకు కదిలింది.

బస్టాప్ వచ్చాక అజయ్ "నేనిక్కడ దిగుతాను సార్' అంటే ఆయన, "ఈ వర్షంలో బస్సుకోసం ఎలా వెయిట్‌చేయగలవులే... మీ ఇంటి దగ్గర దించేస్తాను పద" చెప్పాడు.

నాలుగు కిలోమీటర్లు ప్రయాణించాక అజయ్, ఓ సందువైపు చూపిస్తే ఆలీబేగ్ జీపు అటువైపు పోనిచ్చారు.

ఇంటిముందు జీపు ఆపాక అజయ్ వారిని ఇంట్లోకి రమ్మని బలవంతం చేసాడు. "ఇప్పుడు కాదులేవోయ్. మరోరోజు తీరిగ్గా వస్తాను'' ఆయన జీపుని మెయిన్‌రోడ్‌లోకి పోనిచ్చారు.

ఇప్పుడు జీపులో వారిద్దరే!

జీపు నెమ్మదిగానే ముందుకుపోతోంది. వెపర్ గ్లాసు మీదపడే నీటితుంపరలను కిటికీ పక్కకి తోస్తూ దారి స్పష్టంగా కనపడేట్టు చేస్తోంది.

"రవీ! మా ఇంటికి వచ్చి చాలాకాలమయింది. ఎందుకు రావట్లేదు?"

"రావట్లేదంటే..." అతడు మాటలు పేర్చుకునేందుకు నాలుగు సెకనులు అవసరమ




యింది "మీకు తెలియనిదేముంది? నిద్రలేచాక వంటపని, పిల్లలు, సైట్‌కి రావడం, తిరిగి వెళ్ళాక కూడా తీరికలేని పని... సమయం ఎక్కడుంది చెప్పండి?"

ఆయన నిశ్శబ్దంగా తలాడించాడు.

ఒక బస్టాపు వచ్చాక "మీరిక్కడ జీపు ఆపితే, బస్సు పట్టుకుని నేను వెళ్ళిపోతాను'' పలికాడు అతడు.

"బస్సులోనా...?" ఆయన జీపు కాస్త స్లో చేసి, అంతలోనే వేగం పెంచుతూ "వద్దులే రవీ! నన్ను ఇంటి దగ్గర దింపేసి, నువ్వు జీప్ తీసుకువెళ్ళిపో... ఈరోజు నేను ఎక్కడికీ వెళ్ళేపనిలేదు. సాయంత్రం జీప్ తీసుకుని ఇంటికి రా, నేనూ రామచంద్రరావుని కలుసుకు నేందుకు వస్తాను''

ఆయన జీపుని ఇంటిముందు ఆపాడు. "సరే వెళ్ళు... ఇంట్లో బంధువులెవరో వచ్చి ఉన్నారన్నావుగా... సాయంత్రం మాత్రం ఏడింటికి వచ్చెయ్యి. నేనూ వస్తాను''

అతడు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. ఆయన ఇంట్లోకి వెళ్ళిపోయాడు. అతడు జీపు ముందుకు కదిలించబోతూ ఇంటిలోకి చూసాడు. ఆమె కనిపిస్తుందేమోనని... కనిపించలేదు. ఎందుకో తెలియదు... కొద్ది నిరాశ! అంతలోనే సాయంత్రం రాబోతున్నానన్న - ఆశ!!... జీపు కదిలింది.

జీపు ఇంటిముందు ఆపి లోపలికి నడుస్తుంటే, వరండాలో కుర్చీ వేసుకుని తడుస్తున్న నేలను, కురుస్తున్న వానను తాదాత్మ్యతతో చూస్తున్న రామచంద్రరావు అతడిని చూసి నవ్వాడు.

"తెలిసినవారెవరో వచ్చినట్టున్నారు''

"బంధువులు... ఉదయమే వచ్చారు''

"అందుకేనా త్వరగా వచ్చేసావు?"

"వర్షంకదా! పని బంద్ చేయవలసివచ్చింది''

అతడు మిద్దెమీదికి వెళ్ళిపోయాడు.

రవి జీపుదిగి రావడం పైనుండి రామకృష్ణ చూసాడు. ఇంటిముందు ఖాళీగా పడిఉన్న స్కూటర్‌ని కూడా చూసాడు. 'మంచి పొజిషన్ లోనే ఉన్నట్టున్నాడు' అనుకున్నాడు.

అతడు పైకొచ్చాక షూ విప్పి కుర్చీలో కూర్చున్నాడు.

"ఇంటర్వ్యూ బాగా జరిగిందా?"

"బాగానే జరిగింది''

"ఏ గ్రేడ్ ఇచ్చారు''

"మెకానికల్''

అతడు వంట గదిలోనికి వెళ్ళాడు. ఉదయం వండిపెట్టిన అన్నం అలాగే ఉంది'' మీరు భోంచేయలేదా?"

"హొటల్‌లో భోంచేసి వచ్చాం"

"ఇక్కడ వండి ఉంచానని చెప్పానుకదా''

"ఇంటర్వ్యూ దగ్గర బాగా ఆలస్యమయిపోయింది. వేళ దాటిపోతుందని దగ్గరలో ఉన్న హొటల్‌లో భోంచేసాం"

అతడు మౌనంగా ఉండిపోయాడు.

"పిల్లలు స్కూల్‌నుండి ఎన్నింటికి వస్తారు?"

"మరో అర్థగంటలో వచ్చేస్తారు''

"వారు వచ్చాక మేము బయలుదేరుతాము''

"అదేమిటి?... రేపు వెళ్ళొచ్చుకదా!"

"నీకు తెలియనిదేముంది... నేను ఇలా రావడం, కొట్టు మూతపడిపోయిందక్కడ. రేపయినా షాపు తెరవాలి''

అతడు మరికాసేపు బలవంతం చేసినా ఆయన ఉండేందుకు ఇష్టపడలేదు.

పిల్లలు స్కూల్‌నుండి వచ్చాక, వారిని చూసి, కాసేపు మాట్లాడాడు.

"మమ్మల్ని బస్టాండువరకూ వదిలిపెడుతావా?"

"తప్పకుండా''

అతడు పెద్దపిల్లాడికి వంట విషయం చె



ప్పాడు. తను రావడం కాస్త ఆలస్యమవ్వుతుందని పనులు చేసేనుకోమని. బయటకు నడిచాడు.

రామకృష్ణ, ఆయన కొడుకు జీపు ఎక్కాక, స్టార్ట్‌చేసి పోనిచ్చాడు.

రద్దీ రోడ్లమీద జీపు నెమ్మదిగా పోతోంది. రామకృష్ణ అతడివంక తల తిప్పాడు.

"రవీ! ఇక్కడ కాస్తోకూస్తో స్థిరపడ్డావు. పెళ్ళి చేసుకునే వయసు... వంటపని, పిల్లల పని- ఇవన్నీ ఒక్కడివే కష్టపడటం ఎందుకు? పెళ్ళి చేసుకోకూడదూ?... అవునులే! ఎవరయినా అమ్మాయిని చూసిపెడితేకదా!... మంచి అమ్మాయిని చూడమంటావా?"

"మరో సంవత్సరం ఆగండి. వర్క్ కంప్లీట్ అయిపోతుంది. తర్వాత నేను మన ఊరు వచ్చేస్తాను. అప్పుడు పెళ్ళి చేసుకుంటాను''

ఆయన కన్నులలో విస్మయం "ఏమిటీ! హైదరాబాదు వదిలి మళ్ళీ పల్లెకు వెళ్ళిపోతావా?"

"అవును''

"ఎందుకలా చేయడం?"

అతడు రోడ్డుమీదనుండి తలతిప్పకుండానే చెప్పాడు. "ఈ నగరవాతావరణం నాకేం నచ్చలేదు'' అంతకన్నా విపులీకరించి చెప్పవలసిన అవసరం కనిపించలేదు.

"అదేమంత మంచి నిర్ణయంగా నాకనిపించడంలేదు''

అతడు బదులు పలకలేదు.

"నువ్వు కనీసం పెళ్ళయ్యేవరకయినా ఇక్కడే ఉండటం మంచిది''

"ఎందుకని?"

ఆయన చెప్పాడు. "చాలామంది ఆడపిల్లల తల్లిదండ్రులకదో నమ్మకం. పల్లెలో పదెకరాలు స్వంతసేద్యం కలిగిన వాడికన్నా, పట్నంలో చిన్న ఉద్యోగం చేసేవాడి దగ్గర ఆడపిల్ల సుఖపడుతుందని. నువ్వు హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నావని చెపితే ఆడపిల్లల తల్లిదండ్రులు ఎక్కువ ఉత్సాహం చూపిస్తారు. కట్నకానుకలు కూడా ఎక్కువ డిమాండ్ చెయ్యొచ్చు''

అతడికి బాధతో కూడుకున్న నవ్వొకటి పెదాలమీద ప్రత్యక్షమయింది. "పల్లెలోకన్నా, పట్నంలో ఆడపిల్లలు ఎక్కువ సుఖపడతారని అనుకుంటుంటే వారు నిజంగా అమాయకులు''

"వారు అమాయకులో, అతితెలివిగలవారో- మనకి మాత్రం అవకాశం ఉంటుంది. పిల్లవాడికి హైదరాబాదులో ఉద్యోగం అంటే చాలామంది క్యూలో నిలబడతారు''

"వద్దులేండి! నాకిప్పుడు పెళ్ళిమీద ఇంట్రస్ట్ లేదు''

"అదికాదోయ్..."

"ప్లీజ్''

ఆయన మరి మట్లాడలేకపోయాడు.

బస్టాప్ వచ్చింది. జీపు పార్కింగ్ ప్లేస్‌లో పెట్టి కిందికి దిగాడు. విజయవాడవైపు వెళ్ళే బస్సులు వరుసగా ఉన్నాయి.

వారిని బస్సు ఎక్కించాక "అందరినీ అడిగానని చెప్పండి'' అన్నాడు. రామకృష్ణ తలూపాడు. బస్సు కదిలి వెళ్ళిపోయింది.

అతడు జీపువైపు నడుస్తుంటే, విజయవాడ జీవితం ఒక్కసారి కన్నులముందు కదలాడింది. కమలాకర్, ప్రసాద్, ఆలీ... సెంటర్‌లో టీ తాగడం... షాపు, లూటీ...! అతడు తల విదిలించాడు.

జీపెక్కి ఆలీబేగ్ ఇంటివైపు పోనిచ్చాడు.

ఇంటిముందు జీప్ ఆపి లోపలికి నడుస్తుంటే, ఆయన తన కోసమే ఎదురు చూస్తున్నట్టుంది. "రావోయ్ రవీ'' అన్నారు.

అదే క్షణం... తలుపు అవతల చప్పుడు. కన్నులు తిప్పి చూసాడు.

మనిషిలో చాలా మార్పు కనిపిస్తోంది:





బొద్దుగా, ముద్దుగా కనిపిస్తుండిన ఆమె సన్నగా, రివటలా తయారయింది. మునుపటి హుషారు కనిపించడంలేదు. వయసుకు మించిన పెద్దరికం కోరి నెత్తిన వేసుకున్నట్లు కనిపిస్తోంది.

అతడు వరండాలో వేసి ఉన్న కుర్చీలలో ఆయనకు ఎదురుగా కూర్చున్నాడు. "రెండు నెలలు పైగా అయిపోయింది కదూ! మా ఇంటికి వచ్చి?" ప్రశ్న.

నిలువుగా తలాడించాడు.

లోపల గదిలో ముసలావిడ పెద్దగా దగ్గుతోంది.

"మా అమ్మకు కూడా ఆరోగ్యం బాగోలేదు. పూర్తిగా మంచంపట్టేసింది" ఆయన తల తిప్పి ఇంట్లోకి చూస్తే నూర్జహాన్ వాకిట్లోనే కనిపించింది. "చాయ్ చేసి పట్టుకురామ్మా"

ఆమె అతడివంక ఒకసారి నిశ్చలంగా చూసి లోపలికెళ్ళిపోయింది.

అతడు ఆయనను ఓరకంట చూడసాగాడు.

"ఎవరీయన? ఈయనకూ, నాకు ఈ అనుబంధం ఏమిటి?'... ఆయన తన కులస్తుడు కాదు, మతస్తుడు కాదు... కేవలం తనకు యజమానిగా పరిచయం అయినవాడు. అయితేనేం ఏ రక్తసంబంధం కూడా చేయలేని త్యాగాన్ని తనపట్ల చేసాడు. మనిషికీ మనిషికి మధ్య ఏ అనుబంధం ఉంటే ఇలాంటి త్యాగాలు సాధ్యమవుతాయి. తాము ఒకే మతం వారయితే చాలు. అవతలివారు సహాయం చేసేస్తారా?... ఏది తన మతస్తులు తనకు చేసిన సహాయం? ఒకే మతంవారు అవసరార్థం చంపుకునే రాజకీయ పరిస్థితులలో బతుకుతున్నాం... నా మతం నాకేం చేసింది?... నేను మతానికి ఏమిచ్చాను? అభిమానం అందించాను. చాలదూ?... ఫలితం కూడా అనుభవించాను..."

"రవీ! చాయ్ తీసుకో' ఆలోచనల్లోనుండి ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడతడు.

నూర్జహాన్ ట్రేలో చాయ్ కప్పులతో తన ఎదురుగా నిలబడి ఉంది. ఆమె చూపులు తన శరీరాన్నంతా తడుముతున్నాయి.

చాయ్ కప్పు అందుకున్నాడు. "పిల్లలెలా ఉన్నారు?"

"బాగున్నారు"

"ఒకసారి తీసుకురండి... చూడాలని ఉంది"

"అలాగే"

చాయ్ తాగడం పూర్తయింది. కప్పులు కిందపెట్టారు. "వెళ్దామా రవీ" అతడూ లేచాడు.

జీపు ఎక్కుతూ అటు చూస్తే... ఎప్పటిలానే ... తలుపు చాటున ఆమె... చూపులు తన శరీరాన్నంతా తడుముతూ...

ఇగ్నిషన్ కీ తిప్పి, గేరు మార్చాడు. ఒక్క జర్క్‌తో ముందుకు దూకింది జీప్...

చుట్టూ జనం...

అవకాశం చిక్కితే అవతలివాడి ఇల్లు, వళ్ళూ దోచేయగల జనం...

ఏమీ ఎరుగని అమాయకుల్లా, ఏదో అర్జంట్ పని ఉన్నట్టు పరిగెడుతూ.

నగరంలో ఒక రాత్రి మొదలయింది!

చీకటిగా ఉంటే సాటిమనిషిని కూడా కసాయికొట్లో అమ్మేయగల జనం ఉన్నారని భయపడి కాబోలు... వీధిలైట్లు నగరాన్ని పట్టపగలులా ఉంచే ప్రయత్నం చేస్తున్నాయి.

పగలంతా దోపిడి కార్యక్రమంలో పాల్గొన్న మనుష్యులు కొందరు'రిలాక్స్' అనే ముసుగులో బార్‌లలోకి దూరుతున్నారు.

బస్టాపులో ఒక వేశ్య తన సుఖవ్యాధిని అంటించుకునే వ్యక్తికోసం ఎదురు చూస్తోంది.

సినిమాహాలు ముందు నిలబడి ఉన్న పెళ్ళయిన యువతి వంక ఆశగా చూస్తూ నిలబడి ఉన్నారిద్దరు కాలేజీ కుర్రోళ్ళు.

కుంభకోణంలో ఇరుక్కుని కేసుల్లోంచి బయటపడ్డ కాంట్రాక్టర్ కారు దర్జాగా రోడ్డు మీద పోతోంది.

రాజకీయ హత్యలు చేయించే గూండా రోడ్డుపక్కనే పెద్ద బిల్డింగ్ కడుతున్నాడు...

పాపం! నిజాయితీగా ప్రజలకోసం శ్రమపడిన ఎమ్మెల్యే రోడ్డుపక్కనే నడిచిపోతున్నాడు.

అదిగో... అల్లదిగో అదే మంత్రిగారి. ఇల్లు! అరే! ఆ ఇంటి ముందు ఆగి ఉన్న కారు చక్కెర ఫ్యాక్టరీ ఓనర్‌ది కదూ!?

అప్పుడే ఓ విమానం ఆకాశంలోకి లేచింది. ఏ మంత్రో ముఖ్యమంత్రి కావాలనే కోరికతో ఆ విమానంలో ఢిల్లీ వెళుతున్నాడు.

ఇదే ముఖ్యమంత్రి ఇల్లు... ఎదురుగా బస్తాలచాటున నక్కిన సైనికులు... విపరీతమయిన రక్షణ... ఇంటిముందు మాత్రం ఒక గజ్జికుక్క మొరుగుతూ ఉంది... ముఖ్యమంత్రికి ఆ కుక్క మొరుగుడు అర్ధమయితే, ఆత్మహత్య చేసుకుంటాడా?... చేసుకోడుగాక చేసుకోడు. వారి చర్మాలు ఎప్పుడో మొద్దుబారిపోయాయి.

అతడు చప్పున బ్రేక్ నొక్కాడు. జీపు కీచుమంటూ ఆగింది. నల్లకుక్క ఒకటి ప్రాణాలను తప్పించుకుని రోడ్డు దాటింది.

"ఏమిటీరోజు చాలా పరధ్యాసగా డ్రైవింగ్ చేస్తున్నావు''

అతడు బదులు పలకలేదు. డ్రైవింగ్‌మీద ఏకాగ్రత చూపాడు.

రెండునిముషాల తర్వాత జీపు రామచంద్రరావుగారింటిముందు ఆగింది. ఆయన జీపు దిగి మిత్రుడి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. రవి మిద్దెమీదికి వెళ్ళాడు.

గంట తర్వాత ఆయన మిద్దెమీదికి వచ్చాడు. పిల్లల్ని పలకరించి వెళ్ళిపోయాడు.

★ ★ ★

"రవీ''

అతడు తలెత్తి రామచంద్రరావుగారివంక చూశాడు.

"నువ్వారోజు పల్లెకు, నగరానికి మధ్య తేడా చెప్పాక నా పరిశోధనాంశానికి ఏదో చిన్న పాయింట్ దొరికినట్టనిపించిందోయ్''

"ఏమిటది?" ప్రశ్నించాడు అతడు.

వారిద్దరూ ఎప్పటిలానే ఆయన ఇంట్లో డ్రాయింగ్ రూంలో కూర్చుని ఉన్నారు. మామూలుగానే గోడ మీదిబల్లి, గోడపక్క జాజిమల్లి, కిటికీకి వేలాడే నైట్‌క్వీన్... వారి మాటలు వినేందుకు సిద్ధమయ్యాయి. పాపం! చంద్రుడు ఆరోజు అక్కడి సమావేశాన్ని చూడలేకపోతున్నాడు. అమావాస్య! 'పాము చంద్రుడిని మింగేసింది'

అతడు చెప్పసాగాడు. "జాతి, తెగ, మత వైషమ్యాలు ఎప్పటికయినా ఘర్షణకు తావిస్తుంటాయని నా నమ్మకం. ఈ ఘర్షణ నివారించే మార్గం ఏదీ లేదని నేనిప్పటికీ నమ్ముతున్నాను. 'రెచ్చగొట్టేవారున్నంతకాలం, రెచ్చిపోయేవారు మిగిలినంతకాలం 'ఘర్షణ'కు ఆస్కారం ఉంది. అయితే... నువ్వు 'పల్లెల గురించి చెప్పాక ఈ ఘర్షణను కొద్దిగా తగ్గించే మార్గం నాకు కనిపించింది. నిజమే రవీ! ప్రపంచ మానవాళికి ప్రమాదకారణాలవుతున్నాయి ఈ మహానగరాలు. ప్రతి ఘోరం ఇక్కడనే జనించి, ప్రబలుతోంది. లూటీలు, బంద్‌లు, మత ఘర్షణలు- పల్లెలలోకి అడుగు పెట్టలేకపోతున్నాయి. కారణం ఏమిటి? నేనింతవరకూ 'భారతదేశం- మతం- ఇతర దేశాలతో పోలికను ఒక స్థూలదృష్టితో చూసానేగానీ, సూక్ష్మదృష్టితో పరిశీలించి 'నగరాలు- పల్లెలు'గా విడగొట్టితే ఘర్షణ చాలావరకూ తగ్గుతుంది..." ఆయన ఊపిరితీసుకునేందుకు కొద్దిసెకన్లు ఆగాడు.

అతడు ఆసక్తిగా ముందుకు వంగాడు.

"రవీ! భారతదేశం సువిశాలమైనది. పచ్చని పొలాలు, సమృద్ధిగా పారే నదులు, మంచి వాతావరణం, గుడులు, గోపురాలు-





మసీదులు, చర్చిలు... వాస్తవంలో ఇక్కడి జనం చాలా మంచివారు. సన్మార్గులు. ఇక్కడ ఎన్నో మతాలు, మరెన్నో కులాలు ఉన్నాయి. సాధారణంగా వీరు ఆవేశపరులుకారు. అయితే అత్యంత మేధావులయిన కొందరు స్వార్థపరులు వీరిలో విషబీజాలు నాటారు. 'విభజించు- పాలించు- అందలం చేజిక్కించుకో' అనే సూత్రాన్ని పాటించారు. ఫలితంగా దేశం రెండు ముక్కలయింది. అంతేకాదు, విభజించబడ్డ ఈ నేలలో కూడా స్వాతంత్ర్యకాలంనుండి మత ఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. ముఖ్యంగా హిందూ- ముస్లిం గొడవ ఏనాటికీ ఆగని జ్వాలలా మండుతూనే ఉంది... దీనికి పరిష్కారం పూర్తిగా లేకపోవచ్చు. కాని కొంత నివారించవచ్చని, మొన్న నీతో సంభాషించాక అర్థమయింది. ఎలా గంటే... పల్లెలను అభివృద్ధిపరచడం ద్వారా!... మొన్న నీతో సంభాషించాక స్థూల దృష్టినుండి, సూక్ష్మదృష్టికి వచ్చి పరిశీలించాను. మొన్నటివరకూ భారతదేశ ప్రభుత్వానికి సవాలుగా మిగిలిన 'ఖలిస్థాన్' ఉద్యమం 'అమృతసర్'కే పరిమితమయింది. పంజాబ్ రాష్ట్రంలోని పల్లెలను ఆ ఉద్యమం పెద్దగా ప్రభావితం చేయలేదు. అలాగే నిన్నటివరకూ హైదరాబాదు నగరాన్ని ఊపేసిన మతకల్లోలం ఈ రాష్ట్రంలోని ఏ పల్లెనూ తాకలేదు... కారణం ఏమిటి?... ఆ కారణాన్ని అన్వేషిస్తూ పల్లెజీవితాలను పరిశీలించాను. నాకు అర్థమయిందొక్కటే! పల్లెలలో మనిషీ, మనిషి మధ్య సహజీవనం ఉంది. ఇతరులతో చక్కని అనుబంధం ఉంది. అక్కడి ప్రతి ఒక్కరితో మరొకరికి అవసరం ఉంటూ ఉంటుంది. సాటి మనిషిని మనిషిగా చూసే మంచి లక్షణం పల్లెవాసులలో ఇప్పటికీ మిగిలి ఉంది. ... మీ ఊరి 'మస్తాన్ సాయబుని' చంపడానికి మీలో ఎవ్వరికీ చేతులు రావు. ఎంత మతాభిమాని అయినా అక్కడ మానవత్వం కలిగిఉంటాడు. అదే నగరాలలోనయితే, పొరుగువాడితో కూడా అవసరమేముంది. తనను కూడా ఎవ్వరూ పట్టించుకోరు. భయపడవలసిన అవసరంలేదు. అంతే కాదు, నగరాలలో డబ్బుకి దొరికే సుఖాలు, విలాసాలు... మనిషికి ఏం చేసయినా 'డబ్బు' సంపాదించమని ప్రేరేపిస్తాయి. ఇక్కడ డబ్బుకి ఉండే విలువ మనిషిలోని స్పందనని చంపేసి, మెటీరియలిస్టిక్‌గా మారుస్తుంది. దాంతో వ్యక్తి పక్కవాడిని పట్టించుకోడు. అవతలివాడికి కళ్ళెదుట అన్యాయం జరగుతున్నా తనకెందుకులే అనుకుని చక్కాపోతాడు... అదే పల్లెలో పక్కింటివాడికి అన్యాయం జరగుతుంటే నలుగురూ మూగుతారు. దౌర్జన్యం చేసేవాడిని తిట్టో, కొట్టో పంపించేస్తారు. గూండాలు, రౌడీలు కేవలం పట్టణాలకే పరిమితమవడానికి కారణం అదే! నగరాలలోని మనిషి తన చుట్టూ గిరిగీసుకుని అవతలివాడిని గిరిలోనికి రానివ్వకుండా, తను గిరి దాటి వెళ్ళకుండా బతుకుతుంటాడు. క్లుప్తంగా చెప్పాలంటే- నగరంలోని వ్యక్తి అవకాశం వస్తే సాటివాడిని దోచుకునేందుకు వెనుకాడడు. అదే సమయంలో పక్కవాడు దోచుకోబడుతున్నా పట్టించుకోడు.

మనిషిలోని ఈ అవకాశవాదాన్ని కొందరు తెలివయిన స్వార్థపరులు చక్కగా వినియోగించుకుంటున్నారు. అవసరమనుకుంటే కొందరిని రెచ్చగొడుతారు. తమ పబ్బం గడుపుకుంటారు''

ఆయన మాటలకు అడ్డు వచ్చాడు అతడు, "మీ మాటలలో చిన్నతేడా కనిపిస్తోంది. మెటీరియలిస్టిక్‌గా మారిన వ్యక్తి తన చుట్టూ గిరిగీసుకున్న వ్యక్తి రెచ్చిపోవడం అసంబద్ధంగా ఉంది''

"కాదు..." ఆయన స్థిరంగా పలికాడు, "... ఎంత మెటీరియలిస్టిక్ వ్యక్తిలోనయినా ఒక 'బలహీనత' - కాసింత 'భయం' తప్పకుండా ఉండి తీరుతాయి. ఆ బలహీనత, 'మతం' లేదా 'కులం' కావచ్చు. ఆ భయం మాత్రం తప్పకుండా తన గురించే అయి ఉంటుంది. ఆ

బలహీనతని భయాన్ని సమన్వయం చేసుకుని తన స్వార్థంకోసం వాడుకునే వాడే... రాజకీయ నాయకుడు!"

"మీరు చెప్పేది అర్థమయింది... అవకాశవాదులయిన నగరవాసులు కొందరు రెచ్చగొడితే రెచ్చిపోతారు. అరాచకం సృష్టిస్తారు. మరి పల్లెవాసులు? రాజకీయనాయకుల ప్రసంగాలకు వాళ్ళు కూడా రెచ్చిపోవాలి కదా?"

"రెచ్చిపోవాలి. కాని రెచ్చిపోయి వారు ఎవరిమీద అరాచకం చేయగలరు?... ఇరుగు పొరుగు మీదనా? వారిలో చక్కని అనుబంధం ఉందాయె! మరో మతస్తుడి మీదనా? చెప్పానుగా! వారిలో ఇంకా మానవత చచ్చిపోలేదని! తమలో ఒకడిగా తిరిగేవాడిని చంపడం... ఊహు! వారు పల్లెలో జీవించే మనుష్యులయ్యా! నిజమయిన మనుష్యులు''

అతడికి ఏదో అర్థమయింది. ఒక భయంకర సమస్య విస్తరించడానికి గల కారణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"పల్లెలను అభివృద్ధిపరచడం ద్వారా, ఘర్షణ కొంత వరకూ నివారించవచ్చని మీరన్నారు... అది వివరంగా చెప్పండి?"

"ఎక్కడయితే అవకాశవాదులు ఎక్కువగా ఉంటారో, అక్కడ 'ఘర్షణ'స్థాయీ ఉధృతంగా ఉంటుంది. నగరాలలో జనాన్ని పరిమితం చేయడంద్వారా 'ఘర్షణ'కొద్దిగా తక్కువయ్యేందుకు ఆస్కారముంది''

"అదెలా సాధ్యం?"

"నగరాలలోని జనాలను పల్లెలకు పంపడమే''

'ఆయన తెలివి ఉండే మాట్లాడుతున్నాడా?' అనుకునే పరిస్థితి! అతడు మాత్రం అనుకోలేదు. రామచంద్రరావు ఒక విద్యావేత్త అని అతడు మరిచిపోలేదు.

"ఎలా?"

ఆయన గొంతు సర్దుకున్నాడు.

"మీ ఊరు విజయవాడకు ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉంది. మీ ఊరి స్కూల్స్‌లో పదిహేనుమంది ఉపాధ్యాయులున్నారు. మీ ఊరికో విలేజ్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ ఉన్నాడు. వీరి నివాసం ఎక్కడ?"

రవి వెంటనే చెప్పాడు, "విజయవాడలో! వారు రోజూ బస్సులో మా ఊరు వస్తారు''

"కృష్ణాజిల్లా చుట్టుపక్కల వంద గ్రామాలలోని టీచర్స్ వెయ్యిమంది విజయవాడలో కాపురం పెట్టడంవలన నగర జనాభా నాలుగు వేలు పెరుగుతోంది. కేవలం నేను టీచర్స్‌ని మాత్రమే ఉదాహరణగా తీసుకున్నాను. అలా పల్లెల్లో నివసించవలసిన ఉద్యోగులు పట్నాలకు పరుగెత్తడం వలన జనాభా కేంద్రీకరణ జరుగుతోంది. ఎక్కడయితే జనాభా కేంద్రీకరణ జరుగుతోందో అక్కడే సామాజిక సమస్యలు ఉద్భవిస్తున్నాయి. అవకాశవాదం వెర్రితలలు వేస్తుంది. నేనిక్కడ కేవలం ఉద్యోగులు పల్లెలకు తరలిపోతే చాలు జనాభా వికేంద్రీకరణ జరిగిపోతుందని చెప్పడం లేదు. ప్రభుత్వం పల్లెల పట్ల శ్రద్ధ కనపరచాలి. నగరాల నుండి, పట్టణాలనుండి వీలయినంత మంది గ్రామాలవైపు తరలివెళ్ళేలా చేయాలి. నిరుద్యోగులకు పల్లెల్లో ఉపాధి కల్పన ద్వారా వారిని నగరాలవైపు రాకుండా చూడాలి. పల్లెల్లో వసతి సౌకర్యాలు పెంచాలి. డాక్టర్లను పల్లెలకు పంపాలి. ఇలా పల్లెలు అభివృద్ధి చెందిననాడు నగరాలకే పరిమితమయిన సమస్యల ఉధృతి చాలావరకూ తగ్గిపోతుంది... ఏమంటావ్?"

"నిజమంటాను... కానీ'' అతడు నిట్టూర్చాడు "ఈ దేశం రాజకీయ నాయకులు ఆడుకునే చదరంగం బోర్డు. సమస్యలు పావులు. వారు ఈ దేశ చదరంగ పటం మీద ఆడుకునేందుకు సమస్యల పావులు తప్పక కావాలి. ఒకడు మతమనే పావును ముందుకు జరిపితే, మరొకడు కులమనే పావును అడ్డం వేస్తాడు. సమస్యలు లేకపోతే వారి ఆట సాగదు. ఆట లేకపోతే వారికి మనుగడ లేదు. వారి మనుగడ కోసం సమస్యలు సృష్టించయినా ఆడగల సమర్థులు... కాకపోతే వారి ఆటలో చచ్చేది సామాన్య





మానవులు''



కాలం కొంతముందుకు సాగింది.

ఆలీబేగ్‌గారి వర్క్ నాలుగోవంతు పూర్త యింది. అతడి జీవితంలో పెద్ద మార్పేమీ లేదు. ఎప్పటిలానే సాగే దినచర్య!

ఉదయించే సూర్యుణ్ణి చూసి మరోరోజు మొదలయింది అనుకోవడం, ఉరుకుల పరు గుల మీద పగలంతా సాగే జీవనం, ఇంటికి చేరాక పడుకోబోయే ముందు కేలండర్‌లో ఆ రోజు డేట్ కాగితం చించేయడం! మరింకెన్ని రోజులలో కదా ఈ నగరవాసం? అతడు రోజులు లెక్కేసుకుంటున్నాడు.

ఆ రోజు ఎప్పటిలానే ఉదయమే సైట్‌కి వెళ్లాడు రవి. కొత్తగా వచ్చిన ఇంజనీర్ కుర్రా డు చక్రవర్తి రోడ్డు లెవల్స్ చూసుకుంటున్నా డు.

పది గంటలవుతుండగా ఆలీబేగ్ సైట్‌కి వచ్చారు. మాటలమధ్య రవితో అన్నారు, "ఈ రోజు సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ చాలా సందడి గా ఉందోయ్''

"ఏమిటి విశేషం?"

"అయోధ్యలో కరసేవట. హిందువులంతా తరలి వెళుతున్నారు'' అతడేమీ మాట్లాడలే దు. ఆ విషయం ఆ క్షణమే మరచిపోయాడు.

అయితే-

మూడోరోజు సాయంత్రం అతడు సైట్ నుండి ఇంటికెళ్లేసరికి, వరండాలో కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు రామచంద్రరావు. అతడిని దగ్గరకు పిలవడంతో వెళ్లాడు.

"చూశావా! అగ్గి ఇప్పుడే రాజుకుంది. రెండుమూడు రోజుల్లో దేశమంతా ఆ దావాల నంలో మాడి మసయిపోతుంది'' ఆయన గొంతు సన్నగా వణుకుతోంది.

"మీరు ఏ విషయం గురించి మాట్లాడుతు న్నారు?"

"నీకింకా అర్థం కాలేదా? అయోధ్యలో మసీదు పడగొట్టడం గురించి. ఈరోజే జరి గిందది... దేశమంతా అల్లర్లు చెలరేగబోతు న్నాయి''

"నేనిప్పుడే సైట్ నుండి వస్తున్నాను''

"అందువలననే నీకింకా విషయం తెలిసిన ట్టులేదు'' ఆయన కాస్త భయంగా చెప్పాడు. "నా ఊహ సరయితే, రేపు తెల్లారేసరికి దేశ మంతా లూటీలు, కర్ఫ్యూలు, అసాధారణంగా రక్తపాతం జరగబోతుంది. నేను చాలా కా లంక్రితమే నీకు చెప్పాను చాలా... చాలా త్వరలో భారత్, రువాండా దేశాల్లో భయంకర రక్తపాతం తప్పకుండా జరగబోతుందని. ఇది గో! ఇప్పుడే ఈ దేశంలో మొదలయింది. రెండు మతాల మధ్య ఘర్షణ రక్తపుటేరులు పారించబోతుంది. తమ మసీదు కూలిపో యిందన్న క్రోధంతో ముస్లింలు రెచ్చిపోతారు. హిందువులు ఆవేశపడతారు. రెండు మతాల మధ్య ఘోర రక్తపాతం..."

అతడికి కూడా భయమేసింది. కేవలం ఒక పట్టణంలో జరిగిన హత్యనే అవకాశవాదులు వినియోగించుకుని పట్టణమంతా ధ్వంసం చేశారు. వందలమంది వ్యక్తులు నిరాశ్రయుల య్యారు. కాని ఇప్పుడు... ఇరుమతాలమధ్య పోరాటం. అవకాశవాదంకన్నా రెచ్చిపోవడమే జరుగుతోంది. అదీ ఒకే సమయంలో దేశ మంతా!

ఈ సంఘటనకు ఎన్ని లక్షల ప్రాణాలు బలవుతాయో! ఎంతటి విధ్వంసం సృష్టించబ

డబోతుందో...

ఆ రాత్రి అతడు నిద్రపోలేదు... ఏదో భయం! కేవలం తన గురించే కాదు, దేశం గురించి కూడా! రోజురోజుకీ ఇరుకయిపోతున్న ప్రపంచం పట్ల కూడా!!

తెల్లవారింది.

దేశంలో పరిస్థితి అదుపు తప్పలేదు. అన్ని ప్రధాన నగరాల్లో, సెన్సిటివ్ ఏరియాల్లో కర్ఫ్యూలు, వన్ ఫార్టీఫోర్ సెక్షన్లు... లూటీలు జరగలేదు. కొన్నిచోట్ల ఒక్కో మతంవారు రెచ్చిపోయి కాస్త అల్లరి చేశారు. విధ్వంసం సృష్టించబడలేదు. అన్నింటికన్నా ముఖ్యంగా ఇరు మతస్తులు రెచ్చిపోయి ఎదురుపడి... రక్తపాతం ప్రవహింపచేయలేదు.

అదీ విచిత్రం!

రామచంద్రరావుగారన్నారు "ఆ మతస్తులు ఇంకా అర్థంకాని అయోమయంలో ఉన్నారు. ఆ అయోమయం నుండి తేరుకునేందుకు ఒకటీ రెండు రోజులు పడుతుంది. ఈలోపు ఆ మతనాయకులు తమవారిని రెచ్చగొడతారు... రక్తపాతం జరిగేది ఖాయం"

రెండు రోజులు జరిగాయి.

మత ఘర్షణల్లో మరణించినవారి సంఖ్య రెండు, మూడు వందలు! దేశస్థాయిలో రెండు మతాల మధ్య ఘర్షణలో హతులయిన వారి సంఖ్య అది.

అంతమంది మరణించడం బాధాకరమైన విషయమే! ఒక్కరు ఒక్కరయినా సరే మత మౌఢ్యానికి ఎందుకు బలికావాలి?

రామచంద్రరావుగారు అనేది రక్తపుటేరులు ప్రవహించాల్సిన ఈ ఘర్షణ, రెండు మూడు వందలమందితో తేలిపోవడం ఈ దేశం చేసుకున్న అదృష్టమని! ఈ ఘర్షణ ఇలా ఎందుకు తేలిపోయిందా? అని ఆయన కారణాలు వెతకడం మొదలుపెట్టాడు. ఒక ఘోర ప్రమాదం నుండి దేశం సురక్షితంగా బయటపడినందుకు ఆయన ఆనందంగా ఉన్నాడు. కాకపోతే ఒక సమస్యను పరిశోధించడం, పరిశీలించడం, ఊహించడం, విశ్లేషించడం ఆయన పని కాబట్టి. ప్రస్తుతం ఆయన తన పనిలో నిమగ్నమయ్యాడు.

మరో రెండు రోజుల తర్వాత ఆయన తన పరిశోధనాంశం చెప్పాడు, "ఎంతయినా ఇది పవిత్ర దేశమయ్యా! తరతరాలుగా ఇక్కడి ప్రజలకు పరమత సహనం అలవాటయిపోయింది. లేకుంటే నిన్నటి సంఘటన బాప్‌రే! నేనసలు వణికిపోయాను... భయంకరంగా వస్తుందనుకున్న తుపాను, ఏమీ చేయకుండా నే తీరం దాటేసింది. ఈ దేశం పెద్ద ప్రమాదం తప్పించేసుకుంది''

"అంటే ఈ దేశ ప్రజలలో నరనరాన జీర్ణించుకుపోయిన పరమత సహనమే నేటి ప్రళయం నుండి దేశాన్ని రక్షించిందని మీరు భావిస్తున్నారా!"

"ఖచ్చితంగా''

"మసీదును పడగొట్టడం ఒక మతం వారిని రెచ్చగొట్టడమేనని మీరు నమ్ముతున్నారా?"

"నమ్మడం ఏమిటి? ఒక మతాన్ని రెచ్చగొడితే మరో మత విశ్వాశాల మీద దెబ్బతీయడమేనని బల్లగుద్ది చెపుతున్నాను''

"చాలా పెద్ద స్థాయిలో ఒక మత విశ్వాశాలను దెబ్బతీస్తూ, అదే సమయంలో మరో మతాన్ని రెచ్చగొట్టినా ఈ దేశంలో మీరూహించినంత ప్రమాదం జరగలేదు. ఈ దేశ ప్రజలు పరమత సహనం కలిగినవారు. వారు చాలావరకూ ఆలోచించే వ్యక్తిత్వం కలిగినవారు. సో! ఈ దేశంలోకి రాజకీయ నాయకులు ఇరువర్గాల వారిని ఎంతగా రెచ్చగొట్టినా రెచ్చిపోరు... యామైరైట్?"

"యూ ఆర్ రాంగ్! ఏదో ఒకసారి బంగాళాఖాతంలో జనించిన వాయుగుండం పెద్ద ప్రమాదం కలిగించకుండా తీరం దాటిపోయిందని, జనించే ప్రతి వాయుగుండం ప్రమాదం చేయదని స్టేట్‌మెంట్ ఇవ్వడం లా




గుంది నువ్వు చెప్పేది. ఇలాంటి ప్రమాదం ఈ దేశంలో జరగడం అదే మొదటిసారి. దాంతో జనమంతా నిశ్చేష్టులయిపోయారు. ఏం చేయాలో ఎవరికీ పాలుపోలేదు. ఏం చేస్తే ఏమవుతుందోనన్న భయం. తమకు కూడా ఉనికి లేకుండా పోతుందన్న అనుమానం... మరోసారి అలాంటి ప్రమాదం సంభవిస్తే పరిస్థితి ఇలాగే ఉంటుందని మాత్రం అనుకోకు. అవకాశవాదం అదను కోసం వేచి ఉంది. రెచ్చగొట్టే శక్తులు పథకాలు సిద్ధం చేసుకుంటున్నారు. తమ ఉనికిని కాపాడుకుంటూనే, అవతలి మతాన్ని దెబ్బతీయాలని మతతత్వవాదులు ఆలోచిస్తున్నారు. మరోసారి ఈ దేశంలో పెద్ద స్థాయిలో మతఘర్షణ అంటూ మొదలయితే అది మారణహోమం సృష్టిస్తుందని ఖచ్చితంగా చెప్పొచ్చు''

అతడు కొద్దిసేపు ఆగాక ప్రశ్నించాడు. "ఈ దేశానికి మతవిద్వేషం కొత్తేమీ కాదుకదా! స్వాతంత్ర్యం రోజుల్లో కూడా మత ఘర్షణలు జరిగాయి. కొంత ప్రాణనష్టం జరిగింది. మీరు భవిష్యత్ ప్రమాదం గురించి అతిగా ఆలోచిస్తున్నారేమోననిపిస్తుంది''

"అప్పటి పరిస్థితులు వేరు రవీ! అప్పట్లో అవకాశవాదం లేదు. ఆవేశపడే వ్యక్తులేగానీ, స్వార్థాలోచన తక్కువగా ఉండేది. కేవలం అప్పట్లో ఆవేశపడిన జనాలవల్లనే దేశవిభజన జరిగింది. లక్షలాది అమాయకులు హతులయ్యారు. నాటికీ, నేటికీ పరిస్థితి ఎంతో మారింది. నేటి పరిస్థితుల్లో పథకం ప్రకారం మతవిద్వేషం రెచ్చగొట్టబడితే, ఊహించలేనంత భయంకర వాతావరణం మన కళ్ల ముందు నిలుస్తుంది''

అతడు కన్నులు మూసుకున్నాడు.

ఒక దృశ్యం...

బాంబులతో ,బద్దలవుతున్న భవంతులు, కూలిపోతున్న వంతెనలు బాంబు పేలుళ్లు... జనం కకావికలయి పరుగెత్తుతున్నారు. వారిలో కొందరు కత్తి పోట్లకు గురయి నేలకూలుతున్నారు. రక్తం ఏరులై ప్రవహిస్తోంది. శవాలు గుట్టలుగా పడుతున్నాయి. ఆకాశంలో గ్రద్దలు గుంపులుగా ఎగురుతున్నాయి. ఒక శవం ప్రక్కన ఏడుస్తూ కూర్చుని ఉన్న ఏడేళ్ల బాలుడు, పక్కనే మరో ఆడశవం రొమ్ము చీకుతున్న ఏడునెలల పసికందు.. హృదయ విదారక దృశ్యం... మనసున్న ఏ మనిషయినా కరిగిపోయే దృశ్యం.

అతడు తల విదిలించాడు. తిరిగి కన్నులు మూస్తే... మరో దృశ్యం! మనసును ఆహ్లాదపరిచే దృశ్యం.

కొందరి ముఖాలకు రాక్షస ముఖాలు తగిలించి ఉన్నాయి. వారు ప్రాణభయంతో పరుగెడుతున్నారు. కొందరు... వందల సంఖ్యలోని జనం, చేతిలో కర్రలతో, కత్తులతో ఆ కొద్ది మంది రాక్షసులను వెనుక తరుముతున్నారు. రాక్షస ముఖాలు ప్రాణ భయంతో పరిగెడుతున్నాయి. ఒక స్త్రీ... ఆదిపరాశక్తిలా అలంకరించుకుని ఉంది. ఆమె చేతిలోని త్రిశూలం ఒక రాక్షసుడిని పొడిచింది. వాడు అమ్మా అంటూ నేలకూలాడు. మరో వ్యక్తి ఒక రాక్షసాకారాన్ని కత్తితో పొడిచాడు. రాక్షసులు చచ్చిపోతున్నారు... అసుర సంహారం పూర్తయ్యాక, ఆ జనం అక్కడున్న పవిత్ర గ్రంధాలు తలొకటి చేత పట్టుకున్నారు. అది ఏరుకుని తీసుకోవడం కాదు, చేతికందిన గ్రంధం... అది భగవద్గీత, ఖురాన్, బైబిల్... ఏదైనా చేతికందినదే!

రెండు క్షణాలలోనే అతడి మనోనేత్రం ముందు కదలాడిన రెండు వేర్వేరు దృశ్యాలు సమస్యా పరిష్కారాలకు సింబాలిజమేమో!!

వారు అలా మాట్లాడుకున్న మూడు నెలల తర్వాత... బొంబాయిలో బాంబు ప్రేలుళ్ళు సంభవించాయి.

దేశంలోనే ప్రథమ ప్రధాన వ్యాపార నగరంలో అతి ముఖ్యమయిన భవంతులు కూలిపోయాయి. బాంబు ప్రేలుళ్ళకు కోట్లాది ఆస్తి ధ్వంసమయింది. సుమారు మూడువందల మంది అమాయకులు ప్రాణాలు పోగొట్టుకు



న్నారు.

దేశమంతా మరొక్కసారి భీతిల్లిపోయింది.

వెనువెంటనే మరో రెండు మూడు ప్రధాన నగరాలలో బాంబు ప్రేలుళ్ళు సంభవించాయి.

నగర ప్రజలు ప్రాణాలు అరచేత పట్టుకుని బ్రతికే పరిస్థితి ఏర్పడింది. ఏ నిముషం ఏ చోట బాంబు పేలుతుందో తెలియని స్థితి. తాము వెళుతున్న బస్సులో బాంబు ఉంటుందేమో! కదులుతున్న రైలు గమ్యంచేరుతుందో లేదో! ఏ ఆఫీసు భవంతి ఎప్పుడు కూలిపోతుందో తెలియదు... బరోడాలో



ఆయిల్ రిఫైనరీ పేల్చేస్తారని, మద్రాసు విమానాశ్రయం కూలిపోతోందనీ, పార్లమెంట్ భవనమే బాంబులతో బ్రద్దలు కాబోతుందని పుకారు కావచ్చు... వార్తా విశ్లేషణ కావచ్చు... ఏమయినా నగర జనం భయం నీడలో భారంగా బతుకులు గడపసాగారు. అదీ ఏదో ఒక గంట ఒకరోజు మాత్రమే ఉండే భయం కాదు. చాలా రోజులపాటు అశాంతి కలిగించిన బాంబు ప్రేలుళ్ల సంఘటన.

"చూశావా! నేను ఆ రోజే చెప్పాను. మత ఘర్షణలకు ఇది ఆరంభం మాత్రమే అంతం కాదని... ఆనాటి సంఘటనకు సీక్వెల్ ఇది'' రామచంద్రరావు టెన్షన్‌గా చెప్పాడు.

ఆయన ముందు ఆ రోజు దినపత్రిక ఉంది. అంతకుముందురోజే ఒక నగరంలోని ప్రధాన కూడలిలో స్కూటర్‌లో పెట్టబడిన బాంబు పేలి చాలా విధ్వంసం జరిగింది.

దాంతో ప్రతి నగరంలోని పోలీసులు అలర్ట్ అయ్యారు. రైల్వే స్టేషన్లు, విమానాశ్రయాలు, బస్సు టెర్మినల్ ప్రతిచోటా గట్టి బందోబస్తు. కనుపించిన ప్రతి అనుమానమైన వస్తువునూ పరిశీలించడం, అవసరమనుకున్న వ్యక్తులను సోదా చేయడం, అధికారులు ప్రమాదం జరగకుండా అన్ని రక్షణ చర్యలు తీసుకున్నారు. కాని కాస్త ఆలోచిస్తే మనదేశంలోని వెన్నెముకలేని పోలీసు వ్యవస్థ ప్రజలకిచ్చే రక్షణ ఏపాటిదో తెలియనిది కాదు!

రక్షణ, విధ్వంసం సంగతి వదిలేస్తే నగరాల్లో మనిషి మనుగడ ఎంత భయంకరంగా తయారయిందంటే నీవు కారులో వెళుతుంటే రోడ్డు మీద సిగరెట్ కాలుస్తూ నిలబడ్డ పోలీసు కారాపి చెకింగ్ పేరుతో నీ కారుని అణువణువూ చూస్తాడు. కారులో కూర్చుని ఉన్న నీ భార్య వంక చూసి వెకిలిగా నవ్వుతాడు... నువ్వు అర్జంట్‌గా వెళ్లాలన్నా వినిపించుకోడు.

"నువ్వు రైల్వేస్టేషన్‌లో సూట్‌కేస్ పట్టుకుని నిలబడి ఉంటే బాతాఖానీ కొడుతున్న డ్యూటీ కానిస్టేబుల్స్ నీ సూట్‌కేస్ వంక అనుమానంగా చూస్తారు. నువ్వు కాస్త భయపడుతున్నట్టుంటే, నీ సూట్‌కేస్ తెరిపించి అందులోని బట్టలన్నీ బయటవేయిస్తారు. చివరికి నీ డైరీ కూడా కొంత చదివి పక్కన పడేస్తాడు''

ఇక మరోవైపు...

నువ్వు అర్జంట్‌గా బాత్‌రూమ్ వెళ్లాల్సి లగేజీ కాస్త చూడమని పక్కనున్న వ్యక్తికి చెపితే, అతడు నీవంక అనుమానంగా చూస్తాడు... అక్కడే ఉన్న మైక్‌లో నుండి పోలీసు హెచ్చరిక వినిపిస్తుంటుంది "ఇతరుల లగేజీని మీ దగ్గర ఉంచుకోవద్దు. అందులో బాంబు లేదా ఇతర ప్రమాదకర సామాగ్రి ఉండి ఉండొచ్చు''

బస్సు ఎక్కబోతుంటే సీటు వెనుక హెచ్చరిక సీటులో కూర్చోబోయే ముందు అన్నివైపులా పరీక్షగా చూడమని అనుమానాస్పద వస్తువు కనిపిస్తే పోలీసులకు అప్పగించండి అని!

ఎంత బాధాకరమయిన పరిస్థితి ఇది. నిర్దోషి అయినా నిరపరాధి అయినా అనుమాన దృక్కులతో చూడబడడం, నేరమేమీ చేయకుండానే సోదాచేయబడడం... మనిషిలోని సున్నితత్వం దెబ్బతినదా?

అలాగే మనిషిని సాటి మనిషి నమ్మలేకపోవడం మానవత్వానికే కళంకం కాదా?

అనుక్షణం ప్రాణభయంతో బిక్కుబిక్కుమంటూ బతక వలసి రావడం మనిషి జీవితానికే ఒక శాపం కాదంటారా?!

అయినా ఇవన్నీ నగరవాసులకు తప్పని సరి! నగరంలోని మనిషి మెల్లగా జడుడిగా మారేది ఇలాంటి పరిస్థితుల ప్రభావం వలననే...

రామచంద్రరావు ముందున్న దినపత్రికను అతడి ముందుకు తోసాడు. అందులోని సంపాదకీయం చదువు... ఆ పక్కనే ఉన్న విశ్లేషణా వ్యాసం చదువు... మన హైదరాబాదులో కూడా బాంబుపేలుడు సంభవించేదానికి అవకాశం ఉందని అందులో రాశాడు''

అతడు పేపర్ చేతిలోకి తీసుకోలేదు "జరగనివ్వండి... జరిగే ఘోరం మనం అడ్డుపడితే ఆగుతుందా?"

"హైదరాబాదులో బాంబుప్రేలుడు అంటే మనం కూడా ప్రమాదంలో పడేందుకు అవకాశముందనే నేను చెప్పడం" అతడికి వివరంగా చెప్పాడు.

"చూడండి! బాంబు ప్రేలుడు.. అదో ప్రత్యేక ప్రమాద అంశంగా నేను భావించడంలే




దు. నగరంలోని మనిషి జీవితం అనుక్షణం ప్రమాదంతో కూడుకున్నదేనని నా అభి ప్రాయం"

"కావచ్చు... కాని ఇది''

ఆయన మాటలు మధ్యలోనే కట్ చేశాడు అతడు "ఇప్పుడు జరుగుతున్న బాంబు ప్రేలు ళ్లు నగరాల్లోనే కదూ జరిగేది''

"అవును''

అతడు స్వగతంగా అన్నాడు, 'చివరికి బాంబు ప్రేలుళ్లు కూడా నగరాలకే పరిమితమ య్యాయి. నేడు ఈ దేశంలోని ఏ పల్లె కూడా బాంబు గురించి ఆలోచించడంలేదు. భయప డటంలేదు. మత విధ్వంసాలే కాదు, ప్రతీకార చర్యలయిన బాంబు ప్రేలుళ్లు కూడా నగరాల కే పరిమితం...

రవి స్వగతాన్ని ఆయనా విన్నాడు, నిజమే కదా అనుకున్నాడు.

కొద్ది క్షణాలు గడిచాక ఆసక్తిగా అడిగాడు.

"రవీ! హైదరాబాదులో కూడా బాంబు పేలేందుకు అవకాశం ఉందంటే నీకు భయం కలగడం లేదా?"

"లేదు''

"ఎందుకని?"

అతడు కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా అరచేతుల వంక చూసుకున్నాడు. తర్వాత చెప్పాడు.

"నగర జీవితమంటేనే ప్రమాదంతో కూడు కున్నదని నాకెప్పుడో తెలిసిపోయింది. బాంబు ప్రేలుడు అదో ప్రత్యేక ప్రమాదమని నేను అనుకోవడం లేదు. పల్లె విడిచినప్పుడే నేను ప్రమాదానికి దగ్గరగా వచ్చేశాను. అరచేతిలో బాంబు పెట్టుకుని, ఆరడుగుల దూరంలోని బాంబు పేలుతుందేమోనని భయపడడమే మిటి? నాన్సెన్స్... ఇంకెంతకాలం మరో తొమ్మిది, పది నెలలు. ఆ తర్వాత అప్పటివరకూ ఏ ప్రమాదం జరగకుండా ఉంటే నేను మా పల్లెకు వెళ్లిపోతాను. మరో తొమ్మిది, పది నెలలు''

  

పెద్ద పిల్లవాడు స్కూల్ ఫైనల్‌లో జాయిన య్యాడు. చిన్నవాడు ఎనిమిదో తరగతిలో ప్రవేశించాడు.

మరొక్క విద్యా సంవత్సర కాలం.

వర్క్ కూడా సగానికి పైగానే అయిపో యింది. తను పల్లెకు వెళ్లడం, ఆ వర్క్ పూర్తికావడంతో ముడివడి ఉండడంతో మరింత శ్రమ పడుతున్నాడు.

అతడూ తన చుట్టూ గిరిగీసుకున్నాడు. ఇతరులతో తనకేమీ సంబంధం లేదు. అతడు ఒక విధంగా ఏకాంత జీవితం గడుపుతున్నా డు.

ఇల్లు, సైట్ ఇవే అతడి లోకాలు. ఒక షికారు లేదు, మరో కులాసాలేదు. యాంత్రిక జీవనానికి అలవాటుపడ్డాడు.

ఇంతలో దేశంలో మరో కొత్త సమస్య పుట్టుకొచ్చింది.

కులం!

మతవాదాన్ని దెబ్బతీసేందుకు కొందరు కులాలను పెంచి పోషించారు. కులతత్వం మెల్లగా నల్లని త్రాచులా ప్రాకివస్తోంది. రేప టిరోజు కులాల మధ్య పోరాటం మొదలవు తుంది, అది మత విద్వేషాన్ని మించిపోతుంది అనుకున్నాడు అతడు.

జాతి, మత, తెగ, కుల వైషమ్యాలకు దూరంగా పల్లెలు మాత్రం ప్రశాంతంగా ఉన్నాయి.

పచ్చని పొలాలు, ఎగిరే కొంగలు, గోధూళి, పచ్చిక మోపు ఎత్తుకుని జానపదం పాడు కుంటూ వచ్చే పల్లెపడుచు.

అతడి కన్నులముందు తన పల్లె కదలాడు తుంది. వెళ్లాలి, తన పల్లెకు వెళ్లాలి. ఆ చల్లని తల్లి ఒడిలో ఇప్పటివరకూ నగర జీవితంలో పడిన బాధలు మరచి ప్రశాంతంగా నిద్రపో వాలి.

తనెంత తప్పు చేశాడు. కన్నతల్లిలా లా



లించి, పాలించే పల్లెను వదిలి సవతితల్లి లాంటి నగరం వైపు పరుగెత్తుకు వచ్చాడు. సవతితల్లి అలంకరణ చూసి మోసపోయాడు. ఈమె దగ్గర పై మెరుగులేగానీ ఆ తల్లి దగ్గరున్న ప్రేమ, మమకారాలు ఏవి? ఆప్యాయత, అనురాగాలు లభించవుకదా! ఎంతయినా ఆమె కన్నతల్లి!!

రోజులు భారంగా గడుస్తున్న అనుభూతి... త్వరగా త్వరగా కాలం గడిచిపోతే బాగుణ్ణు. ఏప్రిల్ ఎప్పుడొస్తుందో వేసవి శెలవులు ఎప్పుడు మొదలవుతాయో! ఈ వేసవి శెలవుల్లో తన పల్లెకు వెళ్లిపోవాలని అతడు నిర్ణయం చేసుకున్నాడు. అప్పటికి వర్క్ కంప్లీట్ అవుతుంది కూడా.

అతడు ఆలీబేగ్‌గారికి ఈ విషయం చెప్పేశాడు. ఆయన అయిష్టంగానయినా తలాడించాడు.

రామచంద్రరావు, రజనీలు సరే పల్లెటూరి ప్రశాంతజీవనాన్ని ప్రతిరోజూ పొగుడుతూనే ఉన్నారు. తాము వృద్ధాప్యంలో తమ పల్లెకు వెళ్లి నిర్భీతితో బతకాలని వారు ఏనాడో నిర్ణయించేసుకున్నారు.

రవి పల్లెలోని తనవారికి జాబు రాశాడు... ఫలానా నెలలో తాను పల్లెకు వస్తున్నాననీ ఇల్లు శుభ్రం చేసిపెట్టమని.

నారాయణ వెంటనే తిరుగుజాబు రాశాడు, 'అతడికోసం ఇల్లు శుభ్రంగా ఉందని ఎప్పుడయినా పల్లెకు వచ్చేయమని'

తన పల్లె తనను రమ్మంటోంది వద్దనుకుని వెళ్లిపోయిన కొడుకుని కూడా చేరదీసే విశాలహృదయం ఆ తల్లిది. నిజమయిన మాతృహృదయం.

రోజులు తరిగిపోతూ ఉన్నాయి.

ఏదో సినిమాలో పాటలా...

ఒకటాయె, రెండాయే ఉయ్యాల...
రెండేమో మూడాయే ఉయ్యాల...

రెండు... మూడు... నాలుగు... తొమ్మిది... పదినెలలు పూర్తయ్యాయి.

ఏప్రిల్ వచ్చేసింది.

వర్క్ పూర్తయిపోయింది. తను ఇక ఋణగ్రస్తుడు కాదు. కృతజ్ఞతా సూచకంగా ఆలీబేగ్ గారి వర్క్ పూర్తి చేసి లాభం సంపాదించి పెట్టాడు.

ఆయన కూడా అందుకు తగిన ప్రతిఫలమే ఇచ్చాడు. పెద్ద మొత్తం డబ్బు వద్దంటున్నా బలవంతంగా అందించాడు.

"నీవు లేకపోతే ఈ వర్క్‌లో నేను నష్టపోయి ఉండేవాడిని. ఇప్పుడు నాకు మంచి లాభం వచ్చింది. అందులో కొంత మాత్రమే నీకు ఇస్తున్నాను. నా తృప్తి కోసం తీసుకో'

తీసుకోక తప్పలేదు.

మరో వారం పది రోజుల్లో పిల్లలకి స్కూల్ అయిపోయి, శెలవులు ఇచ్చేస్తారు. శెలవులు మొదలయిన మొదటి రోజే తమ ప్రయాణం... పల్లెవైపు.

అతడికి చాలా ఆనందంగా ఉంది. కష్టాలన్నీ గట్టెక్కిపోతున్నాయన్న ఆనందం అది.

అతడు మూడు టిక్కెట్స్ రిజర్వేషన్ చేయించాడు.

అది ఏప్రిల్ 30వ తేదీ!



"ఈ రాత్రంతా నీతో మాట్లాడుతూ గడిపేయాలని ఉంది రవీ'' రామచంద్రరావు గొంతులో దిగులు ధ్వనించింది.

 

"అందుకేగా ఈ రోజు మీ ఇంట్లో భోంచేసి, రాత్రంతా మీతో గడిపేయాలని నిర్ణయించుకుంది''

అర్ధగంట క్రితమే వారి కుటుంబంతో కలిసి, రవి, పిల్లలిద్దరూ భోంచేశారు. పిల్లలిద్దరూ భోంచేసాక నిద్ర వస్తోందంటూ మిద్దె మీదికి వెళ్లిపోయారు. రవి ఆయన కోసం డ్రాయింగ్ రూంలో కూర్చున్నాడు.

అతడికి చేయవలసిన పని చాలాఉంది. సామానంతా ప్యాక్ చేసుకోవాలి. బట్టలన్నీ సర్దుకోవాలి. అయినా నగరంలో చివరి రాత్రి ఆయనతో గడపక తప్పదు.

"నువ్వు ఇక్కడుంటే నాకూ ఒక తోడు ఉన్నారన్న భావన ఉండేది. మనం ఇలా కూర్చుని మాట్లాడుకోవడం... నాకు చాలా రిలాక్సింగ్‌గా అనిపించేది. రేపటి నుండి నాతో మాట్లాడేందుకు ఎవరూ ఉండరు''

జవాబు ఏం చెప్పగలడు? నిశ్శబ్దం ఆశ్రయమిచ్చింది.

"ఆలీబేగ్ కూడా నీకోసం చాలా బాధపడుతున్నాడు. నువ్వు పల్లెకు తిరిగి వెళ్లడం ఆయనకు అసలు ఇష్టంలేదు''

"మీకు కూడానా?"

"నేను మాత్రం నీ నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను... ప్రశాంత పల్లె జీవనం నా కన్నుల ముందు కదలాడుతోంది. నాకూ ఆ తల్లి చెంత చేరాలని ఉంది. వెళ్లిపోతాను. వీలయినంత త్వరలో నేనూ పల్లెకు వెళ్లిపోతాను. దేశ భవిష్యత్ పట్ల నాకూ భయంగానే ఉంది. నా ఊహ నిజమవుతుందేమోనన్న ఆందోళన కలుగుతోంది.

రవి పేపర్ చూడడం ఎప్పుడో మానేశాడు. లేకుంటే పతాక శీర్షికల్లో ఉండే వార్తలని తప్పక చదివి ఉండేవాడు. కాకపోతే అతడు మునుపోసారి రామచంద్రరావుగారి నోటి వెంటే విన్నాడు. నా ఊహ నిజమయితే చాలా చాలా త్వరలోనే భారత్, రువాండాల్లో ఘోర రక్తపాతం జరగబోతుంది. భారత్, రువాండాల మధ్య కొన్ని పోలికలున్నాయి. ఈ దేశంలో హిందువులవలే అక్కడి హుటులు ఎనభై శాతం, ముస్లింల వలే టుట్సీలు పధ్నాలుగు శాతం...

రజని వచ్చి వారితోపాటు కూర్చుంది.

సిసలయిన స్నేహం కొద్దికాలం పెనవేసుకున్నా చాలు, ఆ బంధం నుండి వేరుపడాలంటే చాలా బాధగా ఉంటుంది. వారు చూపించిన ఆప్యాయత, అభిమానం అతడు జీవితాంతం మరిచిపోలేడు.

వారు కూడా అతడి స్నేహాన్ని ఏనాటికీ మరచిపోలేకపోవచ్చు.

ఆ రాత్రి గడియారంలో ముళ్ళు చాలా త్వరగా తిరుగుతున్నట్టనిపించింది రామచంద్రరావుకు.

గోడగడియారం పన్నెండు గంటలు కొట్టాక "వెళ్ళు రవీ! ప్రయాణానికి సర్దుకోవలసినవి చాలా ఉన్నాయేమో'' తప్పనిసరయి లేచాడాయన.

అతడూ ఆ చోటనుండి వచ్చేసాడు.

ఇంట్లోకెళ్ళి వస్తువులన్నీ ప్యాక్ చేసుకోసాగాడు. మర్నాడు అవన్నీ ట్రాన్స్‌పోర్ట్‌లో అప్పగించాలి.

బట్టలు సూట్‌కేస్‌లో సర్దుకున్నాడు... రైలులో తన వెంట తీసుకువెళ్ళే సామాను వేరుగా పెట్టుకున్నాడు.

వేకువఝామున ఒకగంట మాత్రమే నిద్రపోయాడు.

తెల్లారి లేచాక-

ఆలీబేగ్‌గారింటికి వెళ్లాడు రవి.

అతడు ఆరోజు సాయంత్రం నగరం విడిచి వెళ్ళిపోతున్నాడని ఆయనకు తెలుసు. చెప్పి వెళ్ళేందుకే వచ్చాడు.

"కూర్చో రవీ''

అతడు కూర్చున్నాడు, "నేనీరోజు సాయంత్రం మా ఊరు వెళ్ళిపోతున్నాను''

"ఏ ట్రెయిన్‌లో?"

"చార్మినార్'

"నేనూ సాయంత్రం స్టేషన్‌వరకూ వస్తాను లే'

తలుపు దగ్గర ఎప్పటిలానే మనిషి కదలిన చప్పుడు. ఆమేకదా!

వారి సంభాషణ విన్నదేమో! అతడివంక చూసింది. ఆ చూపులలో తాను మునుపెన్న డూ చూడని వేదన చూసాడు అతడు. 'ఇక... ఇక నువ్వు నాకెన్నడూ కనిపించవా?... నీవు లేకుండా, నిన్ను ఎన్నటికీ చూడకుండా నేను జీవించటం ఎట్లా?"

ఆమె ఎప్పటిలానే తాను వెళ్ళిపోయేవ రకూ తలుపు చాటున నక్కి ఉండలేదు. చప్పుడు కాకుండా లోపలికి తప్పుకుంది.

మరికాసేపు కూర్చున్నాక లేచి ఆయన పాదాలకు నమస్కరించాడు రవి. తన మన సులోని కృతజ్ఞతను తెలుపుకునేందుకు అంత కన్నా మరో మార్గంలేదు. అక్షరాలలో చెప్పా లంటే ఎటువంటి పధాల ప్రయోగం ఆయనప ట్ల 'కృతజ్ఞత' అనే పదాన్ని సంపూర్ణంగా తెలియచేస్తాయి. ఎలాంటి చేతలు ఆయనకు తన గుండెలోకల స్థానాన్ని చెప్పగలుగు తాయి.

ఏమీ చేయలేని, మరేమీ చెప్పలేని అతడు, ఆయనకు పాదాభివందనం చేసాడు.

ఆ పని చాలు, అతడి మనసులోని భావం ఆయన అర్థంచేసుకునేందుకు.

ఆయన అతడిని పైకిలేపి అక్కున చేర్చుకు న్నాడు.

"వెళ్ళిరా రవీ! క్షేమంగా వెళ్ళిరా''

అతడు ముందుకు నడిచాడు. నాలుగు అడుగులు వేసాక వెనుతిరిగి చూసాడు.

ఆ ఇల్లు...

రెండు సంవత్సరాలు తనకు ఆశ్రయం ఇచ్చింది. అగమ్యగోచరంగా ఉన్న తన బతు కుకు ఒక గమ్యం చూపించింది.

ఈ ఇంటితో తనకు చాలా దగ్గరి అనుబంధ మే ఏర్పడింది.

ఇదిగో... ఈ వాకిటనే తన అన్నగారి ప్రాణాలు అనంతవాయువులలో లీనమ యింది. ఈ ఇంటి వెనుక గదిలోనే తల్లిలాంటి వదిన ఆత్మహత్య చేసుకుంది. అదిగో... ఆ గదిలోనే మతవాదులు తనను హత్యచేస్తా మని బెదిరించింది. ఆ చోటనే ఒక గొప్ప మానవతావాది- ముస్లిం, ఒక హిందువు ప్రాణ రక్షణకోసం తాను ఆత్మాహుతి చేసుకుంటా నన్నది. ఎంత గొప్ప పవిత్రనిలయం ఇది.

ఈ ఇల్లు తనకీ నగరం గురించి పరిపూర్ణ జ్ఞానాన్ని కూడా అందించింది.

అడుగో... ఆయన... అసాధారణ వ్యక్తి త్వం మూర్తీభవించిన మహనీయుడు. మతం కన్నా మానవత్వం గొప్పదని చేతలలో చూ పించిన ఆదర్శ పురుషుడు.

అక్కడ... ఆ తలుపు చాటున... ఏది... ఆమె కనుపించదేమి? తనను మురిపించి, మనసు మైమరపించి, అందని ద్రాక్షపండులా మిగిలిన ఆ అమ్మాయి... తన ముఖం చూడ కూడదని తప్పుకుందా?! అంతే అయి ఉంటుంది. లేకపోతే తన అడుగుల సవ్వడికి, అన్నీ విడిచి వచ్చి కనులముందు నిలబడే ఆ అమ్మాయి, తనిక ఎన్నటికీ కనుపించడని తెలిసీ, ముఖం చాటేయడం... పోనీలే! ఏం చేయను... ఆ అమ్మాయి చూపిన అభిమానాని కీ, ఆదరణకు ఏ విధమైన కృతజ్ఞత ప్రకటించ లేని అశక్తుడు తను!

నూర్జహాన్ కనుపించకపోవడం బాధగానే ఉంది. కాని... అతడు ముఖం తిప్పుకున్నాడు.

వడివడిగా వీధిలోనికి అడుగులేసాడు.

ఆటో ఎక్కాడు.

అక్కడినుండి ముందుకు పోతుంటే, పాత బస్తీ తనకు వీడ్కోలు చెపుతున్నట్టు అని పించింది.

★ ★ ★

రైల్వేస్టేషన్ కోలాహలంగా ఉంది.

అతడు ఆటోలోనుండి దిగాడు. ప్రశాంత్





సతీష్‌లు కిందికి దిగాక చేరో బేగ్ చేతపట్టుకున్నారు. ఆటో వెళ్ళిపోయింది.

ఆటో వెనుకే స్కూటర్‌మీద రజని, రామచంద్రరావు!

అందరూ స్టేషన్ లోపలికి నడిచారు.

చావుబతుకులను సమానంగా, గాజుకళ్ళతో చూసే కాటికాపరిలా నిశ్చలంగా నిలబడి ఉంది నాంపల్లి స్టేషన్ భవనం.

అతడు ఎంట్రన్స్ దాటుతుంటే, ఒక పల్లెటూరివాడు, "బాబుగారూ" అంటూ రవిని పిలిచాడు. రవి ఆగి ఆ వ్యక్తివంక చూసాడు. పంచెకట్టు కట్టి, నెత్తిన టవల్ చుట్టి... పల్లెటూరి వేషధారణ కనులముందు నిలచింది. ఆ వ్యక్తికి ముప్ఫయ్ సంవత్సరాలుండొచ్చు. తన పక్కనే పడుచు భార్యా, ఒక పసిబిడ్డ!

"బాబుగారూ! చార్మినార్‌కి వెళ్ళేందుకు బస్సులు ఎక్కడ ఆగుతాయి?"

అతడు చెప్పాడు.

"వెళ్దాం పదవే'

ఆ వ్యక్తి భార్య భుజంమీద చెయ్యివేసి, స్టేషన్ దాటి బయటకు నడుస్తున్నాడు. అతడు వారివంక చూస్తూ అనుకున్నాడు. 'నగరం అందాలు చూసి భ్రమసి అటువైపు పరుగెత్తబోతున్నట్టున్నారు. ఇక్కడ ధనం ఏరులై ప్రవహిస్తుందని, తాము కొంత దోచుకుని దాచుకోవచ్చనుకుంటున్నట్టున్నారు. పిచ్చివాళ్ళు... అమాయకులు! నగరాలలో ధనం కన్నా రక్తప్రవాహమే ఎక్కువని వీరికి తెలియదు. ఖరీదయిన కంచిపట్టుచీర చుట్టుకున్న సిటీ, 'సిఫిలిస్' వ్యాధి గ్రస్తమని ఎవరు వీళ్ళకి చెప్పగలరు?'

వారిని చూస్తే అతడికి జాలి కలిగింది. జనారణ్యంలోకి వెళుతున్న మేకపిల్లల్లా కనిపించారు. అదేక్షణం బాధ కూడా కలిగింది.

'ఓ రెండు సంవత్సరాలక్రితం అన్నావదినలు ఇలాగే ఆనందంగా, ఆశలపల్లకిలో ఊరేగుతూ వచ్చి ఈ స్టేషన్‌లోనే, ఇక్కడే, వీరిలానే రైలుదిగి ఉంటారు... వారిప్పుడు ఎక్కడ? ఈ నగరారణ్యంలో క్రూరమృగాలకు బలయిపోయారు'

గుండెకింద నరం మెలివడింది. ఎవరో గుప్పెటతో గుండెను నలిపేస్తున్న ఫీలింగ్...

అతడు స్టేషన్‌లోకి నడవసాగాడు. అయితే మనసు తన పల్లె గురించే ఆలోచిస్తోంది.

"ఎంతకాలం? ఎంత కాలమయింది తను ఆ పల్లెను చూసి? ఐదుసంవత్సరాలకు పైగానే అయింది. తన పల్లె అప్పటికి- ఇప్పటికి ఏమయినా మారి ఉంటుందా?... ఊహు! పల్లెలు ఎప్పటికీ మారవు. పచ్చపచ్చని చెట్లు, చెట్లమీది రామచిలుకలు, చెట్లకింద ఆడుకునే బడిపిల్లలు, చెరువులో గేదెలు కడుగుతూ ఈతకొట్టే పశువుల కాపరులు, పొలంగట్ల వెంట నడుస్తూ సాగే బావామరదళ్ల సరదాలు-సరసాలు, పైరు నాటుతూ ముసలమ్మలు పాడే జానపదగీతాలు, ఎడ్లబండిలో హుషారుగా ఈలవేసే రైతన్నలు... ఇంటి ముందు ముత్యాలముగ్గు, ఇంట్లో రతనాల పంట, పశువుల కొట్టంలో చెంగుచెంగున ఎగిరిపడే లేగదూడ... అత్తగారి గద్దింపులు, ఆడపడుచుల ముసిముసి నవ్వులు, కోడళ్ళ మూతివిరుపులు... నవరససమ్మేళనమయిన పల్లె జీవితాన్ని వదిలి, బీభత్సరస ప్రధానంగా సాగే నగరంలోనికి తను పారిపోయి వచ్చాడు? ఎంతటి అమాయకత్వం?'

చాలాకాలం దూరంగా ఉన్న తర్వాత తల్లి ఒడిలో వాలబోయే చిన్నపిల్లాడిలో పొంగిపొరలే ఉత్సాహం ఆ క్షణం అతడికి కలిగింది. 'వెళుతున్నాను. నా తల్లి ఒడిలోకి వెళ్ళిపోతున్నాను'

వారంతా ప్లాట్‌ఫారం మీదికి వెళ్ళేసరికి ట్రెయిన్ వచ్చి ఉంది.

అతడు తన రిజర్వేషన్ కంపార్ట్‌మెంట్ చూసి అందులో లగేజీ పెట్టాడు. ప్రశాంత్, సతీష్ సీటు నెంబర్లు వెతుక్కుని కూర్చున్నారు.




"వెళ్ళొస్తాం అంకుల్" పిల్లలు రామ చంద్రరావుకి చెప్పారు.

"మంచిది! ప్రశాంత్, సతీష్- మీరు బాగా చదువుకోవాలి"

"అలాగే"

అతడు ట్రెయిన్ దిగి వచ్చి, ప్లాట్‌ఫారం మీద నిలబడి వారితో మాట్లాడసాగాడు.

"ఉయ్యూరుకు చేరగానే, నాకు లెటర్ వ్రాయి"

"తప్పకుండా"

"ఎప్పుడయినా హైదరాబాదు వస్తే మాత్రం తప్పకుండా ఇంటికి రా" తలూపాడు అతడు. మనసులో మాత్రం ఇక్కడికి ఇక ఎప్పటికీ రాకూడదనే అనుకున్నాడు.

"ఆలీబేగ్ స్టేషన్‌కి వస్తానన్నాడు కదూ?"

"అవును" చెప్పాడు రవి.

"ఇంకా రాలేదేం?"

"నేనూ ఆయన కోసమే ఎదురు చూస్తున్నాను"

తనంటే ప్రాణమిచ్చే ఆలీబేగ్‌గారు, తనకి వీడ్కోలు చెప్పేందుకు ఇంకా రాకపోవడమే మిటి? అతడికి ఆశ్చర్యంగా ఉంది.

రైల్వే అనౌన్స్‌మెంట్ వినిపించింది. 'మరో పదినిముషాలలో ట్రెయిన్ బయలుదేరబో తోంది'

రామచంద్రరావు అన్నాడు. "ఇక ఆలీబేగ్ ఏమొస్తాడో? వచ్చే సూచనలు కనిపించడంలే దు''

అతడూ తలూపబోతూ అటు చూసాడు. అతడి కన్నులు విప్పారితాలయ్యాయి.

ఆలీబేగ్‌గారు ట్రెయిన్‌వైపు హడావుడిగా వస్తున్నాడు. ఆయన ముఖం ఎప్పటిలా చిరు నవ్వులు చిందించడంలేదు. చిరునవ్వు చెరిగి పోయి ఉంది. కన్నులు అమృతాన్ని వర్షించడం లేదు. గాజుకళ్ళలా మారి ఉన్నాయి... మొత్తంమీద ఆయన ముఖం భావరహితంగా ఉంది.

రవి ఆయనను అలా చూసి ఉలిక్కిపడ్డా డు. 'ఎనీథింగ్ రాంగ్' మనసులో అనుమానం ఉదయించింది.

ఆయన వారి దగ్గరగా వచ్చాడు.

"ఏమిటి ఇంత ఆలస్యంగా వచ్చావు?" రామచంద్రరావు, ఆలీబేగ్‌ని ప్రశ్నించాడు. ఆయన ఆ మాట అసలు వినిపించుకోనేలేదు. ఆయన రవి వంక చూసాడు. ఆ చూపులు చూసి భయపడ్డాడు అతడు.

ఆలీబేగ్ పెదవులు విప్పాడు.

"రవీ! నాకా విషయం ఎందుకు చెప్పలే దు?"

అతడు భయంనుండి అయోమయంలో పడ్డాడు, "ఏ విషయం?"

ఆయన అతడి మాట వినిపించుకోకుండా నే, "నేను మరీ అంత కిరాతకుడిలా నీ కంటికి కనిపించానా?"

"మీరేం మాట్లాడుతున్నారో నాకర్థం కావ డంలేదు సార్'

"నేను ఆ గదిలోనికి వెళ్ళడం అరసెకను ఆలస్యమయి ఉంటే చాలు. నా చిన్నారి... నాకున్న ఏకైక ఆశాకిరణం నాకిక దక్కి ఉండేది కాదు'' ఆయన గొంతు రుద్ధమ యింది.

అతడికే కొద్దికొద్దిగా అర్థమవుతున్నట్టని పించింది. అసలేమీ అర్థంకానిది రామచంద్రరా వుకే!

"ఏమిటి! నువ్వనేది? చెప్పదలచుకున్నది వివరంగా చెప్పు'' రామచంద్రరావు కసిరినట్టు అన్నాడు.

రజనీ, పిల్లలు ఆలీబేగ్‌వంక అర్థంకాని పజిల్‌ని చూసినట్టు చూస్తున్నారు.

"రామచంద్రం... అసలేమయిందో తె లుసా? నేను రవికి స్టేషన్‌కి వస్తానని చెప్పి పంపాక, చాయ్ పెట్టమని చెపుదామని వంట గదిలోనికి వెళ్ళాను. నూర్జహాన్ లేదక్కడ. తన గదిలోకి వెళితే... ఎలుకలమందు మింగ బోతూ ఉంది''

"నూర్జహాన్ ఎలుకలమందు మింగబో యిందా?" అతడు ఆందోళనపడ్డాడు.

"ఎందుకలా చేయబోయింది?" రామ చంద్రరావు వెంటనే ప్రశ్నించాడు.

"నేను అదే అడిగాను. తనూ వెక్కుతూ, ఏడుస్తూ చెప్పింది.

రవి ఊరెళ్ళిపోతున్నాడట. తనకి ఇక ఎప్పు డూ కనిపించడట... అందుకని''

వింటున్న దంపతులిద్దరూ ఉలిక్కిపడ్డారు. మెదడు కొద్దిసెకనులపాటు పనిచేయలేదు.

ఆయన చెపుతూ ఉన్నాడు, "ఆమె అలా అనేసరికి నాకు వళ్ళు తెలియనంత కోపం వచ్చేసింది. నూర్జహాన్‌ని నరికిపారేద్దామనుకు న్నాను. కాని... ఆమె లేకుండా నేను బతకల




ను. ఆమెను చంపేసిన క్షణమే నేనూ చనిపోవాలి. అంతలోనే నాకోపం రవి మీదకు మళ్ళింది. తనకు ఎంత గొప్ప ఉపకారం చేసాను. ఫలితం?... ఎంతటి కృతఘ్నుడో కదా! అంటుంటే తనే మళ్ళీ చెప్పింది. 'రవికి తెలిసీ, తననెలా అదుపులో పెట్టింది'... రవి వ్యక్తిత్వమేమిటో నాకు అర్థమయింది. నా ఆవేశం ఆలోచనగా మారింది. ఈ ప్రపంచంలోని కులాలు, మతాలు, మనుష్యులు, కేవలం మనుష్యులు సృష్టించినవే! ఆ అడ్డుగోడలు ఆధారం చేసుకుని నా కూతురి ఆశను మంటగలపడం నాకిష్టంలేదు. రవీ! నేను... నేను నీకు ఇవ్వబోయే ఆ బహుమతి మన స్ఫూర్తిగా స్వీకరించు..."

ఆ బహుమతేమిటో అతడు ఊహించాడు. ఆయన రెండు చేతులూ పట్టుకున్నాడు. మాటలలో చెప్పలేనిది ఆ స్పర్శలో చెప్పబడింది.

ఆయన వేగంగా బయటకు నడిచాడు. అరనిముషం తర్వాత ఆయన వెంట ముగ్ధలా ఒదిగి నడిచి వస్తున్న ఆమె...

అతడి మనసెందుకో ఎక్కడెక్కడో ఊహలలో విహరించసాగింది. ఇక ఈ జీవితానికి దొరకదనుకున్న పెన్నిధి, తనే నడిచి వచ్చినట్లు...

ఆయన, ఆమెను అతడి పక్కనే నిలబెట్టాక చెప్పాడు. "రవీ! ఈ దేశంలో ఏ ముస్లింతండ్రీ చేయని, చేయలేని పని ఇది. నీ పట్ల ఉన్న అనంతమయిన అభిమానం, నా కూతురంటే ఉన్న ఇష్టం, కులమతాలు వాస్తవాలు కాదన్న సత్యం గ్రహించడం... ఇవే నన్ను నా కూతురిని ఇక్కడికి తీసుకువచ్చేలా చేసాయి... నిజానికి నూర్జహాన్ ఆ ఇంట లేకుండా నేను బతకలేను. నా కూతురి వెంట ఆ ప్రశాంతమయిన పల్లెలకు వచ్చేయాలని ఉంది నాకు. కాని నా ఇంట నా తల్లి ఉంది. ఆమె మంచం పట్టిఉంది... మరికొంతకాలం గడిచాక నేనూ మీ పల్లెకు వస్తాను. జీవితంలోని ఆఖరి అధ్యాయాన్ని అక్కడ నింపుకుంటాను"

రైలు కూతవేసింది.

"ఎక్కండి"

వారంతా రైలెక్కి, కిటికీ పక్క సీట్లలో కూర్చున్నారు.

ఆలీబేగ్ కూతురికి వీడ్కోలు చెప్పాడు. రామచంద్రరావు రవి దగ్గరగా వచ్చాడు.

"రవీ! ఈ దేశంలో తరతరాలుగా జరుగుతూ వస్తున్న మత విద్వేషానికి తెరపడే అవకాశం లేదా అనేదానికి జవాబుకోసం అన్వేషిస్తున్న నాకు ఇప్పుడే జవాబు దొరికింది... నాకిప్పుడు ఎంతో ఆనందంగా ఉంది"

రైలు కదిలింది.

"మీకు దొరికిన జవాబు ఏమిటి?" ఆసక్తిగా ప్రశ్నించాడు రవి.

"రవి- నూర్జహాన్- పల్లె"

అతడికి అర్థమయింది. చప్పున పెదాల మీద నవ్వు కదలాడింది.

ఆలీబేగ్ చెయ్యి ఊపారు. రవి రెండుచేతులూ జోడించి ఆయనకు నమస్కరించాడు.

రైలు వేగం పెరిగింది. రైలు వెంటే కొంత దూరం నడిచి, అది మరీ వేగం పెంచాక ఆగిపోయారు, అందరూ.

దూరతీరాలకు సాగే పట్టాలు... పరుగెత్తే రైలు...

కొందరిని గమ్యం చేరుస్తుంది. మరి కొందరి బతుకుల్ని అగమ్యగోచరంగా మారుస్తుంది.

కలసిన హృదయాలనెన్నింటినో విడగొడుతూ నిత్యం సాగే రైలు ప్రయాణం.

మనిషి జీవితంలానే... మధ్య మజిలీలు ఎన్నిఉన్నా గమ్యం మాత్రం 'అక్కడికే...

రైలు కనుమరుగయ్యేవరకూ వారంతా ప్లాట్ఫారంమీద నిలబడి చేతులూపుతూనే ఉన్నారు.



# చమత్కారాలు

## జబ్బు

ఎంఎల్‌ఏ జోగినాధానికి హఠాత్తుగా సుస్తీ చేసింది. వెంటనే ఆయనని కుటుంబ సభ్యులు నగరంలోవున్న ప్రముఖ వైద్యశాలలో చేర్పించారు.



ఎన్నికలు సమీపంలో వున్న సమయంలోనే జోగినాధానికి రోగం రావడంతో ఆయన అనుచరులు ఆందోళన పడిపోయారు.

అసలే నియోజకవర్గంలోనూ, రాజధాని నగరంలోనూ వాడిగా, వేడిగా చర్చలు సాగుతున్నాయి, జోగినాధానికి సీటు వస్తుందా, రాదా అని.

దానికి తోడు నియోజకవర్గంలో 20 మంది పార్టీ టిక్కెట్టు ఇవ్వమని దరఖాస్తు చేసుకున్నారు. వాళ్లలో ఓ నలుగురయితే హైరాహైరీగా టిక్కెట్టు కోసం కృషి చేస్తున్నారు. సీటు ఇవ్వకపోతే సూయిసైడ్ చేసుకుంటామని బెదిరించారు. టిక్కెట్టు తమకే వస్తుందనీ ఎవరికి వాళ్లే ధీమాగా చెప్పుకోవడం కూడా ప్రారంభించారు.

ఎంఎల్‌ఏ గాకముందు నిజానికి జోగినాధం బజార్లంట బేవార్స్‌గా తిరిగేవాడు.

పనీపాటా లేకుండా వూరికే అలా రోడ్లంట, ఊళ్లంట తిరుగుతుండటంతో భార్య సరిగా తిండికూడా పెట్టేది కాదు. అనేకసార్లు భర్తని ఘనంగా చీపురుతో సత్కరించిన సందర్భాలు కూడా వున్నాయి.

అలాంటిది, తంతే ఎగిరి గారెల బుట్టలోనో, బూరెల బుట్టలోనో పడ్డట్లు, జోగినాధానికి పార్టీ టిక్కెట్టు రావడం, అప్పుడు వీచిన గాలిలో కొట్టుకు రావడం అన్నీ కలలో మాదిరిగా జరిగిపోయాయి.

ఎప్పుడైతే జోగినాధానికి పదవి చిక్కిందో, అప్పుడే భార్యకి అతని మీద ప్రేమ పుట్టుకొచ్చింది. గాలికి తిరిగినా, తన మొగుడు మరీ అంత అప్రయోజకుడు కాదు, కాస్తంత ప్రయోజకుడే అని ఆమె మురిసిపోయి భర్తని సత్కరించడం మానుకుంది.

జోగినాధానికి ఇంట్లోనూ, వీధిలోనూ, వూరులోనూ కూడా పలుకుబడీ, విలువా పెరిగిపోయింది.

ఈ ఐదేళ్లూ జోగినాధం సర్వసుఖాలూ అనుభవించాడు. కారూ, నెలనెలా జీతం, కోరిన తిండీ! హాయిగా ఐదేళ్లూ గడచిపోయాయి. రెండు తరాలకు సరిపడా ఆస్తిని కూడా సంపాయించి పడేశాడు.

అలాంటిది మళ్లీ ఎన్నికలు అనడంతో జోగినాధం గుండెల్లో రాళ్లుపడ్డాయి.

జోగినాధాన్ని చూసీ, పదవిని చూసీ, హెరాదాని చూసీ కొంతమంది స్వార్ధపరులు టిక్కెట్టు కోసం జోగినాధానికి పోటీవచ్చారు.

ఇంతలోనే జోగినాధానికి జబ్బు చేసింది. కోమాలోకి వెళ్లిపోయాడు.

ఆయనని నమ్ముకున్న అనుచరులు డీలా పడిపోయారు. ఎన్నికలు సమీపించిన తరుణంలోనే గురువుగారు మంచం ఎక్కడంతో వాళ్ల బాధ వర్ణనాతీతంగావుంది.

డాక్టర్లు జోగినాధానికి అన్నిరకాల పరీక్షలూ చేశారు. అయితే రోగం ఏమిటో ఎంతకీ నిర్ధారించలేకపోయారు.

జోగినాధం ఎప్పుడూ అసమ్మతీ, గిసమ్మతీలాంటి అంటు వ్యాధులకి ఆమడ దూరంలోనే వున్నాడు. ఏ కృష్ణుడు ముఖ్యమంత్రి పీఠం అధిష్టిస్తాడో, ఆ కృష్ణుడికి జై కొట్టడం అలవాటు చేసుకున్నాడు. అందుకే జోగినాధం విషయంలో శ్రద్ధగా చూడమని ఉన్నతాధికారుల ఆదేశాలు వున్నాయి.

ఎక్కడెక్కడినించో స్పెషలిస్టుల్నీ, సూపర్ స్పెషలిస్టుల్నీ, సూపర్ డూపర్ స్పెషలిస్టుల్నీ పిలిపించారు... చూపించారు. అయినా ప్రయోజనం కనపడలేదు.

మరోవైపు ఎన్నికల నామినేషన్లు ముంచుకొస్తున్నాయి.

ఇంతలో జోగినాధం పార్టీ, అభ్యర్థుల లిస్టు ప్రకటించింది. ఆ లిస్టులో జోగినాధం పేరు కూడా వుంది.

ఇక ఆస్పత్రిలో రద్దీ పెరిగిపోయింది.

జోగినాధాన్ని చూడవచ్చిన వ్యక్తి ఎవరో మాటల సందర్భంలో అన్నాడు, "అయ్యగారికి సీటువచ్చింది''

ఆ మాటలకు జోగినాధం మంచం మీద నుంచి కొద్దిగా కదిలినట్లు అనిపించింది అతని అనుచరుడికి.

జోగినాధం విషయం క్షుణ్ణంగా తెల్సిన ఆ అనుచరుడు చప్పున విషయాన్ని సునిశితంగా గ్రహించి పెద్దగా జోగినాధంతో అన్నాడు,

"అయ్యగారూ... తమరు మళ్లీ పోటీ చేయడానికి టిక్కెట్టు వచ్చిందిసార్!"

ఆ మాటలు వినడంతోనే మంచం మీద పడుకున్న జోగినాధం ముక్కులకీ, మూతికీ, చేతులకీ వున్న గొట్టాల్ని పీకి అవతల పారేసి మంచం మీదనుంచి ఎగిరి ఒక్కదూకుదూకాడు. ఊడిపోతున్న గోచీ బిగించి, డాక్టర్లు నోరు వెళ్లబెట్టి చూస్తుండగా, పరుగు లంకించుకున్నాడు. నియోజకవర్గంలో ప్రచారం చేసుకోవాలిక దా మరి!

-కోటేశ్వరరావు

# తోడుదొంగలు

''రేపు రాజమ్మ పన్లోకి రాదుట. చచ్చినట్టు సెలవు పెట్టాలి నేను. అసలే మా బాస్ ఛండశాసనుడు ఏమంటాడో ఏమో'' తలుపు తెరిచినప్పటి నుంచీ గొణుగుతూనే ఉంది పరిమళ.

"ఎందుకు రాదుట?" బూట్లు విప్పుతూ ప్రశ్నించాడు భర్త.

"అట్టే దిగులుపడకు. మహా అయితే జీతం కోస్తాడంతేగా. ఒక చీరకొనుక్కోవడం మానేస్తే సరి'' హాస్యమాడాడు భర్త.

"వెక్కిరించడానికి ఎప్పుడూ తయారే. పోనీ మీరు కూడా సెలవు పెట్టకూడదూ. చాలా రోజుల్నించీ సినిమా కెళ్దామనుకుంటు న్నాంగా. సరదాగా వెళ్ళొచ్చు'' అనుకోకుండా వచ్చిన సెలవుకి ఉత్సాహం వచ్చేసింది పరిమళకి.

"అలాగే కానీ, శ్రీమతి ఆజ్ఞాపించాక తప్పుతుందా''



సంతోషమేసిందామెకి. పరిమళ పనిచేసే ప్రైవేట్ కంపెనీకి సెలవులు అనేవి ఉండవు. ఆదివారాలు కూడా రమ్మంటే వెళ్ళాల్సిందే. కానీ మంచి జీతం వదులుకోవడం ఇష్టంలేక అలాగే నడిపిస్తోంది. పసిపాపని చూడటానికి రాజమ్మని పెట్టుకుంది. సాయంత్రం ఆరింటి వరకు పాప బాగోగులన్నీ రాజమ్మవే.

"వాళ్ళ పాపకి జ్వరంట. మందులు కొనుక్కోవాలని డబ్బు కూడా పట్టికెళ్ళింది''

"పోన్లే పాపం" జాలిపడ్డాడు.

"మీకేం మీరు బాగానే జాలి చూపిస్తారు. మా బాస్‌తో నేను ఎట్లా'' మళ్ళీ దిగులుపడింది.

మర్నాడు పొద్దున లేస్తూనే గబగబా వంట

చేసింది. ముగ్గురూ తయారై మార్నింగ్‌షో సినిమాకి బయల్దేరారు.

కానీ, థియేటర్లో ముందు వరుసలో కూర్చున్న రాజమ్మనీ, దాని కూతుర్ని చూసి బోల్డు ఆశ్చర్యపడిపోయింది. జ్వరమని అబద్ధం చెప్పి హాయిగా గలగలా నవ్వుకుంటూ సినిమా చూస్తున్న వాళ్ళవైపే కన్నార్పకుండా చూస్తుండిపోయింది. ఎంత అందంగా అబద్ధం చెప్పిందో. తను నిజంగానే నమ్మేసింది. వెధవ సినిమాకెళ్ళడంకోసం కన్న కూతురికి జ్వరమని చెప్తుందా? ఎంత ధైర్యం దీనికి. అన్నీ లేబర్ బుద్ధులే. రేపు రానీ చెప్తా అనుకుంటూ పళ్లునూరుకుంటూ కూర్చుంది.

అనుకున్నట్లే మర్నాడు అరగంటసేపు రాజమ్మకు లెక్చరిచ్చి, కసి తీర్చుకుంది కూడా.

యథావిధిగా ఆఫీసుకెళ్ళి 'హమ్మయ్య' అనుకుంటుండగా బాస్ పిలుపు వచ్చింది.

"మీరిట్లా చెప్పా చెయ్యకుండా మానేస్తే ఎలా? మీ టేబుల్ మీద వర్క్ ఎంత పెండింగుందో తెలుసా. అందులో ఎన్ని అర్జంటు ఫైల్సున్నాయో తెలుసా? అవి ఒక్కరోజు డిలే అయితే కంపెనీకి ఎంతలాసో తెలుసా?" బుసలుకొడ్తున్నాడు బాస్, కేబినులోకి వెళ్ళి వెళ్లగానే.

కొంతమంది స్టాఫ్ అది చూసి ఇకిలిస్తున్నారు. కొంతమంది జాలిగా చూస్తున్నారు. తల కొట్టేసినట్టయిందామెకి. సినిమా చూసిన సంబరమంతా హుష్‌కాకీ అని ఎగిరిపోయింది. నిస్సత్తువ ఆవరించింది.

"సారీ సర్... నిన్న మా పాపకి చాలా జ్వరంగా ఉంది. అందుకే రాలేకపోయాను'' చేతులు నులుముకుంటూ చెప్పింది పరిమళ.

నీ మాట నేన్నమ్మను అన్నట్లు చూశాడు బాస్!

సాయంత్రం ఎదురొచ్చిన రాజమ్మని పల్లెత్తు మాట కూడా అన్లేదు పరిమళ.

**-గొల్లపూడి శైలజ**

---

## ధర్మసందేహం

సుందరమ్మకి చీరలంటే విపరీతమైన పిచ్చి. హైస్కూల్‌తోనే చదువు కట్టేసినప్పటికీ రకరకాల చీరలను కట్టడం మటుకు మానలేదు. చీరల పరిణామక్రమ చరిత్రమీద పరిశోధనచేసి డాక్టరేట్ సంపాదించగల నాలెడ్జి సుందరమ్మ సంపాదించింది. చీరలని ముట్టుకోకుండానే కళ్ళతోనే చూసి వాటి నాణ్యత చెప్పేయగలదు. చీర రంగు వెలసిపోతుందా పొడవు తీసిపోతుందాలాంటి వన్నీ ఇట్టే పసిగట్టేయగలదు.

తమింట్లో ఎవరికీ లేని ఈ చీరల పిచ్చి దీనికెలా వచ్చిందా అని సుందరమ్మ తల్లి దండ్రులు ఆశ్చర్యపోయేవారు. సుందరమ్మకు పాతికేళ్ళు వచ్చేసరికి మంచి సంబంధం చూసి పెళ్ళిచేశారు. సుందరమ్మ భర్త సుబ్బారావు చక్కగా చదువుకున్నాడు, మంచి ఉద్యోగంలో వున్నాడు. చెడు అలవాట్లు ఏమీ లేవు.

పిల్లని కొత్తచీరలాగా అల్లుడిచేతుల్లో పెడ్తూ సుందరమ్మ తల్లిదండ్రులు సుబ్బారావుతో, "అమ్మాయికి ఒక విషయంలో మోతాదు మించి పిచ్చి వుంది. చీరలంటే పడి చచ్చిపోతుంది. ఎందుకు చీరలంటే మనసు కష్టపెట్టకుంటుంది. అమ్మాయిని జాగ్రత్తగా చూసుకో అల్లుడూ'' అన్నారు.

"అంతేగా! పెళ్ళానికి కావలసిన చీరలు కొని పెట్టలేని మొగుడూ ఓ మొగుడేనా. మీరేమీ బెంగపెట్టుకోకండి, సుందరమ్మని చీరలలో పెట్టి చూసుకుంటాను'' అన్నాడు సుబ్బారావు.

సుందరమ్మ భర్తతో విజయవాడ వెళ్ళిపోయింది. చీరలు ఉతుక్కోడానికి, గంజి పెట్టుకో

డానికి, ఆరేసుకోడానికి కావలసిన సదుపాయాలు వున్న ఇంట్లోనే అడుగుపెట్టినందుకు సుందరమ్మ మురిసిపోయింది.

కూరలు తేవడానికని బజారుకు వెళ్ళి చీరలు కొని తెచ్చినా సుందరమ్మని సుబ్బారావు పల్లెత్తు మాట అనేవాడు కాడు. సుందరమ్మ అందాన్ని కాక సుందరమ్మ కట్టిన చీర అందాన్ని పొగిడేవాడు.

మూడంతస్తుల మేడ, ఒంటినిండా బంగారం, మారుతీ ఏసి కారు ఇటువంటి కోరికలు సుందరమ్మకు లేకపోవడం తన అదృష్టం అనుకున్నాడు సుబ్బారావు.

అలా మూడు చీరలు, ఆరు జాకెట్లుగా వారి సంసారం సాగిపోతుండగా ఒకరోజున దినపత్రికల్లో "ప్రసిద్ధ కంపెనీల రకరకాల చీరల ప్రదర్శన. చీరలు కిలోల లెక్కన తూచి అమ్మబడును'' అనే ప్రకటన సుందరమ్మ చూసింది.

అదే దినపత్రికలో మరో రెండు పేజీలు తిప్పేసరికి, "ప్రసిద్ధ కంపెనీల రకరకాల చీరల ప్రదర్శన చీరలు మీటర్ల లెక్కన అమ్మబడును'' అనే మరో ప్రకటనా సుందరమ్మ కళ్ళబడింది.

ఆ రెండు ప్రకటనలు వెంటనే భర్తకి చూపించింది.

"సరే... రేపు శనివారం గదా. మధ్యాహ్నం సెలవు. రెండుచోట్లకీ వెళ్దాం" అన్నాడు సుబ్బారావు.

"అది సరేనండీ. నాకు ఒకటే సందేహం" అంది సుందరమ్మ

"రేపటిదాకా ఉండవంటావా?" అన్నాడు సుబ్బారావు.

"అది కాదండీ అక్కడ తూకాలు, కొలతలు సరిగ్గా వుంటాయా?!" అంది సుందరమ్మ!

-తాజీప్రసాద్





# చతుర ప్రపంచం

## చిల్లర సమస్య

'ఈ దేశంలో ముష్టివాళ్లు తప్ప... బహుశా మిగతా ప్రజలంతా కూడా 'చిల్లర సమస్యను ఎదుర్కొంటూనే వున్నారు' అంటున్నారు పరిశీలకులు. పోస్టాఫీసుల్లో, బస్సుల్లో, షాపుల్లో ఎక్కడ చూసినా ఈ చిల్లర సమస్య అటు కొనేవాడినీ, అమ్మేవాడినీ కూడా వేధిస్తూనే వుంది. అప్పుడప్పుడు చిల్లరకోసమని అక్కర్లేని వస్తువులను కూడా కొనాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది మనకి. రైల్వే స్టేషన్లలో టిక్కెట్టు కొనేటప్పుడు సరిగ్గా చిల్లర దొరక్కపోతే... ఆ గుంజాటనలో రైలు కూడా మిస్సవడం కద్దు.

చిల్లర లేక ఆ విలువకి సరిపడ బిస్కట్లో, బిళ్ళలో, మరోటో చేతిలో పెడతాడు షాపుయజమాని. అటుదాన్ని వద్దనలేక, చిల్లర వదులుకోలేక ఆలోచనలో పడతాడు వినియోగదారుడు.

అసలు ఈ 'చిల్లర' ఓ పెద్ద వ్యాపారంగా తయారయింది. కొన్ని ప్రాంతాల్లో. ఈ వ్యాపారంలో 100 రూపాయలకి 25 నుంచి 30 రూపాయలదాకా లాభం పొందుతున్నాడు వర్తకుడు. అత్యవసర పరిస్థితిలో రూపాయి చిల్లర కోసం రూపాయిచ్చి 80 పైసలు మాత్రం తీసుకోవలసివస్తుంది 'చిల్లర' వ్యాపారుల నుంచి. డిల్లీ, బొంబాయిలాంటి మహానగరాల్లో 'చిల్లర' వ్యాపారం మహాజోరుగా సాగుతున్నట్టు తెలుస్తోంది.

ప్రభుత్వం ఈ 'చిల్లర' కొరతను తీర్చడానికి చాలా ప్రయత్నాలు చేసింది. చిల్లరనాణేల అదనపు ఉత్పత్తికోసం విదేశాలనుంచి నాణేలను తయారుచేసే యంత్రాలను దిగుమతి చేసుకుంది. ఇదికాక బ్రిటన్, కెనడా, సౌత్‌కొరియాలనుంచి ఖాళీ నాణేలను దిగుమతి చేసుకుని వాటికి భారతీయ నాణేల రూపాన్నిచ్చే ప్రయత్నం కూడా చేసింది. కానీ ఆ పద్ధతిని కొంతమంది మింట్‌వర్కర్స్ వ్యతిరేకించడం



జరిగింది.

'ప్రభుత్వం దిగుమతుల పేరుతో అనవసర ఖర్చులు పెడుతోందని, పనివారలకు ప్రోత్సాహకరమైన సౌకర్యాలని, అదనపు పనిభత్యాన్ని ఇచ్చి ఇక్కడే మరింత ఉత్పత్తిని పెంచవచ్చు' అంటారు 'బాంబే మింట్‌వర్కర్స్ యూనియన్ ప్రెసిడెంట్ మిస్టర్ పింటో.

1981 నుంచి చూస్తే నాణాల ఉత్పత్తి క్రమంగా పెరుగుతూనే వచ్చింది. 1985 వరకు మనకి లెఖ్ఖలున్నాయి. 81, 82 మధ్యకాలంలో 525 కోట్ల నాణేలు విడుదలయితే, 82, 83 మధ్య 660 కోట్లు, 83, 84 మధ్య 1063 కోట్లు, 84, 85ల మధ్య 1667.60 కోట్ల నాణేలు విడుదలయ్యాయి. రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా లెఖ్ఖల ప్రకారం 88, 89 నాటికి 4600 కోట్ల నాణేలు అవసరమయ్యాయి.

1984 తరవాత నాణేల ఉత్పత్తిలో అధిక వ్యయాన్ని తగ్గించేందుకుగాను ఇరవైపైసల ఇత్తడి నాణాన్ని ముద్రించడం మానుకుంది ప్రభుత్వం. దాంట్లో రాగిశాతం ఎక్కువగా వుండటంతో వాటిని పోగేసి వేరే పనులకు ఉపయోగించడం ప్రారంభించారు కొంత మంది. దానివల్ల నాణాల కొరత మరింత పెరిగింది. దాంతో రాగి, ఇత్తడి కలవకుండా మరొక లోహంతో ఇరవైపైసల నాణేల ముద్రణ ప్రారంభమయింది.

'అసలు ఇలా చిల్లర కొరత ఏర్పడటానికి గల ప్రధాన కారణమేమిటి? ఈ చిల్లర పోగేసి దాచిపెడుతున్న వ్యక్తులకు వ్యతిరేకంగా ప్రభుత్వం చర్య తీసుకోకపోవడానికి కారణమేమిటి?' ఇవన్నీ చాలామందిని వేధిస్తున్న ప్రశ్నలు.

నిజానికి ప్రభుత్వం ఈ చిల్లర పోగేసి కూడబెట్టే వ్యక్తులెవరో తెలిసే చర్య తీసుకోకుండా ఊరుకుంటోందని కొందరి ఆరోపణ. ఢిల్లీ, బొంబాయిలలోని రిజర్వ్‌బ్యాంకు ఉద్యోగులు కూడా ఈ విషయమై నోరు మెదపడంలేదు సరికదా 'మేమే చిల్లరని బ్లాక్‌లో కొనుక్కోవలసివస్తోంది' అంటున్నారు.

## నాస్తికుడి జోస్యం

**ఆ**స్తికులు వున్నట్టుగానే నాస్తికులూ ఎక్కడా వుంటూనే వుంటారు. వీళ్ళని వాళ్ళు, వాళ్లని వీళ్ళు విమర్శించుకుంటూ, సవాళ్ళు విసురుకుంటూనే వుంటారు. అలాగే జ్యోతిష్యాన్ని నమ్మేవాళ్ళూ, నమ్మనివాళ్ళూ కూడా వుంటారు. అయితే నమ్మడంకన్న అప్పుడప్పుడు నమ్మకపోవడమే నయమేమో అనిపిస్తుంది. ఎందుకంటే కొంతమంది జ్యోతిష్యులు మంచిని, చెడునీ కూడా మొహంముందే కుండ బద్దలుకొట్టినట్టు చెప్పేస్తారు. ఫలానా వ్యక్తికి ఇంకో రెండేళ్ళుకన్న ఆయుష్షు లేదన్న సంగతి స్వయంగా ఆ వ్యక్తికే చెప్పేస్తాడు, ఒక్కో జ్యోతిష్యుడు. దాంతో మరో పదేళ్ళు బతకవలసిన వ్యక్తి బెంగతో రెండేళ్లు కాదుగదా, ఏడాదిలోపుగానే చస్తాడు. బలహీన మనస్కుల మూఢనమ్మకాలను సొమ్ముచేసుకునే జ్యోతిష్యశాస్త్రవేత్తలు, మంత్రగాళ్ళు చాలా మందే బయలుదేరుతున్నారు ఈ రోజుల్లో. దాంతో అసలు సిసలైన జ్యోతిశ్శాస్త్ర ఉనికిని, దాని గొప్పతనాన్ని ఎవరూ గుర్తించలేకపోతున్నారు. ఒకప్పుడు బిడ్డ పుట్టిన క్షణంలో అతడి భవిష్యత్తులో విషయాలన్నిటినీ ఖచ్చితంగా రాసిచ్చిన మహాపండితులుండేవారు. ఇప్పుడు అంతటి పాండిత్యం, ఆ శాస్త్రజ్ఞానం నూటికి నూరుపాళ్ళూ లేకపోవడంతో జ్యోతిష్యం ప్రకారం కొన్ని జరగడం, కొన్ని జరగకపోవడం చూస్తున్నాం.

ఒకప్పుడు ఇంగ్లాండులో పాట్రిడ్జ్ అనే జ్యోతిశ్శాస్త్రవేత్త ఉండేవాడు. ఆయన ప్రతి సంవత్సరం దేశకాలమాన పరిస్థితుల్లో రాబోయే మార్పులను, మంచి చెడులను, అన్నిటినీ తెలుపుతూ ఓ పత్రిక వెలువరించేవాడు. ఇది నమ్మని, పాట్రిడ్జ్ అంటే గిట్టని స్విఫ్ట్ అనే హేతువాది ఇజాక్ బికర్‌స్టాఫ్ అనే మారుపే







రుతో పాట్రిడ్జ్ ఇచ్చిన సమాచారానికి వ్యతిరేక సమాచారాన్ని వెలువరించేవాడు.

స్విఫ్ట్ పూర్తిపేరు జోనాథన్‌స్విఫ్ట్. 'గలివర్స్ ట్రావెల్స్' అనే పుస్తకాన్ని రాసిన స్విఫ్ట్ మంచి రచయితగా అందరికీ పరిచయస్థుడే. అయితే అతడు హేతువాది కావడంచేత భవిష్యవాణి అంటూ పాట్రిడ్జ్ రాసే విషయాలతో ప్రజలు మోసపోతున్నారని తలచి, ఏదో రకంగా పాట్రిడ్జ్ పేరు పోగొట్టాలని అతనికి వ్యతిరేకంగా ప్రచారం చెయ్యనారంభించాడు. తను నాస్తికుడన్న సంగతి అందరికీ తెలుసు కాబట్టి, అందరూ తను కావాలనే పాట్రిడ్జ్ పరువు తీయడానికి ఇలా రాస్తున్నట్టు భావించకుండా, పేరు మార్చుకుని మరీ రాసేవాడు.. ఓసారి అతడు వెలువరించిన వార్త అందర్నీ దిగ్భ్రమ లో ముంచితే, పాట్రిడ్జ్‌ని కోపోద్రిక్తుణ్ణి చేసింది. అది ఏమంటే మరో రెండు నెలల్లో అంటే మార్చి 29వ తేదీ రాత్రి 11 గంటలకు పాట్రిడ్జ్ ఈ లోకాన్ని విడుస్తాడని తేదీ, సమయంతోసహా ఇవ్వడంతో అందరూ నమ్మడమే కాకుండా చాలా బాధపడటం ప్రారంభించారు. దాన్ని పాట్రిడ్జ్ గట్టిగానే ఎదుర్కొన్నాడు గానీ, ప్రజలందరి నోళ్ళల్లోనూ ఇదో వింతవిషయంలా నానింది. నమ్మిన వాళ్ళలో కొందరు తన చావెప్పుడో తానే తెలుసుకోలేకపోయాడని హేళన చేశారు. ఆ తేదీ దాటాకగానీ, తిరిగి పాట్రిడ్జ్‌మీద, అతనిచ్చే భవిష్యవాణిమీద నమ్మకం కుదరలేదు జనానికి. ఇంతకీ ఆ తేదీకి ఏడు సంవత్సరాల తరువాత మరణించాడు పాట్రిడ్జ్.

## డాక్టర్‌గారి సెలూన్

పూనాకు చెందిన వినయ్‌కోపర్‌కర్ అనే ఓ యమ్.బి.బి.యస్. డాక్టరుగారు, వైద్యులుగానే కాక ఓ మాంచి క్షురకుడుగా కూడా పేరుతెచ్చుకున్నారు. ఈ వైద్యులుగారు తన క్లినిక్ పక్కనే ఓ హెయిర్‌కటింగ్ సెలూన్ కూడా ప్రారంభించి కేసుల్లేని సమయాల్లో కత్తికి పదును పెడుతూ వుంటారు. మొదట్లో ఈయనగారి క్లినిక్‌కి బొత్తిగా ఒక్క కేసూ రాకపోవడంతో, ఏదైనా సైడ్ బిజినెస్ మరొకటి చూసుకోవాలని నిర్ణయించుకోగా ఆయనకి తట్టిన బిజినెస్ అది.

కొంతమంది ఆయన్ని ఈ ప్రశ్నావేశారు "దేశంలో లక్షాతొంభై రకాల వ్యాపారాలుండగా ఈ క్షురకర్మే ఎందుకూ?" అని! దానికి ఆయన చెప్పిన సమాధానం ఇది. "ఈ వృత్తి 'పారా మెడికల్' క్యాటగిరీలోకి వస్తుంది. 'కాస్మొటాలజీ'లో 'హెయిర్‌షేపింగ్', 'ట్రిమ్మింగ్' ఇవన్నీ వస్తాయి. దీనికి ఎనాటమీ, ఫిజియాలజీతో కూడా లింకు వుంటుంది'' అని! ఇలా చెబుతూ మొత్తంమీద నాలుగు వైద్యపదాల్ని మేళవించి అటు క్లినిక్‌కూ, ఇటు




సెలూన్‌కూ లింకుపెట్టేసాడాయన. 'పాపులర్ సౌందర్య ప్రదర్శన గృహ ఫర్ మెన్' అంటూ బోర్డెట్టి ఓ శుభముహూర్తాన ఆ సెలూన్ ప్రారంభించేశాడు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన వినయ్ సెలూన్ పెట్టాక హెయిర్‌కటింగ్‌లో మరిన్ని శాస్త్రీయపద్ధతులను కనిపెట్టి అందర్నీ ఆకర్షిస్తున్నాడు. ముఖంమీద ఏర్పడే మొటిమలు, కళ్ళకింద వచ్చే చారలు, చుండ్రు వగైరా ఎన్నో రోగాలను నయం చేస్తున్నాడు వినయ్. ఈ వృత్తిలో మరిన్ని అదనపు మెళుకువలు తెలుసుకోవడంకోసం జర్మనీ, ఇంగ్లాండులు కూడా వెళ్ళే ఉద్దేశంలో వున్నాడాయన. సెలూన్‌కి కావలసిన అత్యాధునాతన పరికరాలను విదేశాలనుంచి దిగుమతి చేసుకునే ఉద్దేశంలో వున్నాడా డాక్టర్!

తన క్లినిక్ సమయాలు మాత్రం ఠంచనుగా పాటిస్తాడీయన. ఉదయం 8 నుండి పదిగంటలు, సాయంత్రం ఆరునుంచి తొమ్మిది గంటల వరకు ఖచ్చితంగా వైద్య వృత్తిలో వుంటాడు.

ఈలోగా తన సెలూన్ కొచ్చేవారికి ప్రత్యేకాకర్షణలుగా కలర్ టి.వి., వి.సి.పి.లు కూడా ఏర్పాటు చేశాడు. ఇవికాక అలసి వచ్చినవారికి కావాలంటే ఓ కప్పు టీ, లేదా కూల్‌డ్రింక్ అందజేసే సౌకర్యం ఆ సెలూన్‌లో వుంది. ఈ లెఖ్ఖన అటు క్షవరాని'కేకాక ఇటు అదనపు ఆకర్షణ'ల'కి'కూడా బాగానే' క్షవరమవుతుందని గొణుక్కుంటున్నవాళ్ళూ లేకపోలేదు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

# నిజానికి మజ్జైన జీవితం మొదలయ్యేది 58 ఏళ్ళకే



## ... మీరు సరిగ్గా అలా ప్లాన్ చేస్తే. ఇప్పుడే!

ప్రవేశపెడుతున్నాం, యుటిఐ వారి రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్. రిటైరవడం యిక ఆలా హాయినిచ్చే అనేక సుఖసంతోషాల రోజులకోసం ఎదురుచూడటానికి తోడ్పడే పెట్టుబడి ఆధారంగాగల మొట్టమొదటి రిటైర్‌మెంట్ ప్లాన్. మీరు పెట్టే సబ్‌స్క్రిప్షన్‌కి సెక్షన్ 88 క్రింద పన్ను రాయితీకి అర్హత వుంటుంది.

యుటిఐ వారి రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్‌లో పెట్టుబడి పెట్టండి నేడే. దీన్ని మించిన పెట్టుబడి మరొకటి యింతవరకు లేదు?

### ముఖ్యాంశాలు

- ఇది 18-52 మధ్య వయస్సులోని వ్యక్తుల కోసం.
- మొత్తంగాగల కనీసపు సబ్‌స్క్రిప్షన్ - రూ. 10,000. కనీసం రూ. 500/- చొప్పున (యిక దాని గుణిజాలలోనూను) 20 సాటినా వాయిదాలు మించకుండా వుండేలాగా, 52 ఏళ్ళ వయసొచ్చేదాకాను. సబ్‌స్క్రిప్షన్‌కి గరిష్ట పరిమితి లేదు 52 ఏళ్ళ వయసు వచ్చేదాకా చెల్లించే రూ. 10,000/- యొక్క దఫాలవారీ సొమ్మును చెల్లించని పక్షంలో, సొమ్ము వాపస్ అనేది, తిరిగి కొనుగోలు సొమ్ముపైన 15% డిస్కౌంటు తీసుకుని చెల్లించబడుతుంది.
- ముఖపత్రపు విలువ రూ. 10/-. 1వ నెలలో అమ్మకం సరసమైన ధరలోనూ, యిక ఆ తర్వాత ఎన్‌ఎవి ఆధారమైన అమ్మకపు ధరకీను - (ఎలాట్‌మెంట్ మూడు దశాంశాల దాకాగల భిన్నాలలోని యూనిట్లలో)
- దీనిలో పెట్టే సబ్‌స్క్రిప్షన్‌కి, మొత్తపు పరిమితి అయిన రూ. 60,000/-లో, ఆదాయ పన్ను చట్టం, 1961 సెక్షన్ 88 క్రింద, పన్ను రాయితీకి అర్హత వుంటుంది.
- నెలవారీ ఆదాయం, 58 ఏళ్ళ వయస్సు వచ్చినప్పటినుంచీను.
- సొమ్ము వాపసు తీసుకోవడం అనేది, 70 ఏళ్ళ వయస్సు వచ్చిన తర్వాత, ఎన్‌ఎవి ఆధారమైన తిరిగి కొనుగోలు ధరకి కాలవ్యవధి ముగిసేముందు సొమ్ము వాపసు తీసుకోవడం అనేది, తిరిగి కొనుగోలు సొమ్ముపైన 10% డిస్కౌంటు తీసుకుని చెల్లించబడుతుంది

పెట్టుబడి ఆధారంగాగల మొట్టమొదటి రిటైర్‌మెంట్ ప్లాన్




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

మీ ఉజ్వల భవిష్యత్తు కోసం

**RETIREMENT BENEFIT PLAN**

రిటైరవ్వడంలోని ఆనందాన్ని కనుగొనండి.

మ్యూచువల్ ఫండ్లూ, సెక్యూరిటీలలో పెట్టుబడులన్నీ మార్కెట్ రిస్కులకు అనుబద్ధంగా వుంటాయి. ఇక స్కీముల యొక్క ఎన్‌ఎవి అనేది, సెక్యూరిటీ మార్కెట్‌ని ప్రభావం చేసే అంశాలూ, శక్తులపైన ఆధారపడి వాటికి హెచ్చుతగ్గులు వుండవచ్చును ఆ తీరులో. గతంలోని కార్యసాఫల్యం, భవిష్యత్తులోని ఫలితాలకు సూచన కాదు. రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్ అనేది పథకం యొక్క పేరు మాత్రమే. అది యీ పథకంయొక్క లక్ష్యాన్నిగాని, భవిష్యత్తులోని అవకాశాన్నిగాని లేదా లాభాల్నిగాని ఏవిధంగానూ సూచించదు. ఈ పథకాల ఉద్దేశ్యాలు సాధించబడతాయనే హామీ యివ్వబడటం లేదు. పెట్టుబడి పెట్టేముందు, ఆఫర్ డాక్యుమెంటుని చదవమని మనవి.

జోనల్ ఆఫీసు: 29, రాజాజీ సాలై, మద్రాసు 600 001, ఫోను: 517101.

బ్రాంచి ఆఫీసులు: హైదరాబాదు, ఫోను: 511095 ● విశాఖపట్నం, ఫోను: 550275 ● విజయవాడ, ఫోను: 74434

UTI-159/94 TE B

